A.P. G.O.M.L. & R.I. Series No. 13.



# ఆర్షకుటుంబము

రచయిత

శ్రీ వాసిరెడ్డి దుర్గాసదాశివేశ్వర ప్రసాద్

పరిచయకర్త

డాక్టర్ వి.వి.యల్. నరసింహారావు



ప్రచురణ

...ంధ్రప్రదేశ్
...ంథాలయం, పరిశోధనాలయం,
...హైదరాబాద్.

A P G.O.M.L & R. I. Series 13

# ఆర్షకుటుంబము

గ్రంథకర్త

శ్రీ వాసిరెడ్డి దుర్గాసదాశివేశ్వర ప్రసాద్

పరిచయకర్త

డా. వి.వి.ఎల్. నరసింహారావు

ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ

ప్రాచ్యలిఖిత గ్రంథాలయం, పరిశోధనాలయం,

హైదరాబాద్-500 007

A.P.G.O.M.L. & R. I. Series 13

ĀRSHA KUTUMBAMU

By Sri Vasireddi Durga Sadasiveswara Prasad

First Edition : November 1983
Copies : 200

Price : Rs. 47/-

Published by
A.P. Govt. Oriental Manuscripts
Library & Research Institute,
Hyderabad-500 007.

Title Design By
B. K. CHARY

Printed at
MASTER Art Printers
1-1-694/2/A, Gandhi Nagar,
HYDERABAD-500 380

# విషయసూచిక

# FOREWORD

'ĀRSHA KUTUMBAMU' is a prose work in Telugu which deals with the Aryan path of domesticity. The author, Sri Vasireddi Durga Sadasiveswara Prasad, former Raja of Jayantipuram is a profound scholar in Telugu, Sanskrit, Pali and Hindi.

To his credit he wrote about thirty books and thirty three essays in Telugu of which only nine books and eight essays were published. All the works cover a wide range of subjects like Philosophy, Ethics, Literature, Grammer, Indian Medicine, Botany, Environmental Science, Geography, Tourism and Political History.

Mr. Prasad, being an erudite Scholar in Buddhist Literature, translated a number of Buddhist works from Pali and Sanskrit. His first Literary endeavour was 'Bodhisatva Avadana Kalpalata,' a translation of Kshemendra's sanskrit work into Telugu. 'Dhammapada' 'Jataka Stories' 'Bouddha Paribhasha' and 'Bouddha Hridaya' are his other works which convey the message of Buddha. As a mark of respect for the yeoman services rendered by him in popularising Buddha's teachings, the Nagarjuna University honoured him on the occasion of the inauguration of its 'Mahayana Buddhist Studies Centre'.

Mr. Prasad, in principle, does not like to be honoured as he believes that titles and honours always deprive a person of his wisdom and knowledge.

Mr. Prasad, now aged 84, still prosecutes his studies and literary pursuits, despite the onslaught of age which affects the capacity to read, write and listen to.

Although he was brought up in an affluent atmosphere by his revered father, Sri Venkatadri Naidu, the Raja of Muktyala and himself being the former Raja of Jayantipuram, Mr. Prasad is surprisingly unostentatious, and abounds in native culture of high order.

It is this background which prompted him to undertake the work entitled "Arsha kutumbamu" in the year 1954.

A peep into this work provides a preliminary knowledge of our ancestral family traits. The reader will be enlightened to get at the cream of Indian culture as revealed through the age-old family system which contributed to the happy and peaceful living of our ancestors.

Some of the suggestions made by the author may, of course, be not palatable and practicable in these days of urban civilisation and unrest. But to the extent possible, we may try to put them into practice in the day-to-day social life and administrative pattern of our villages for a better and blissful way of living.

This volume* is the thirteenth publication in the series of the Andhra Pradesh Government Oriental Manuscripts Library and Research Institute. I thank the Government of Andhra Pradesh for the keen interest evinced by them in the activities and progress of this department.

V.V.L. NARASIMHA RAO,
DIRECTOR.
Andhra Pradesh Government
Oriental Manuscripts Library and
Research Institute. Hyderabad.

Nov. 1, 1983

---

* The original manuscript of 'Arsha Kutumbamu' was purchased from the author on 2-3-1977 by the A.P.G.O.M.L. & R.I. The Accession and call numbers assigned to this manuscript are Acc. No. 3710 and T 10-8 respectively.

# పరిచయం

## డాక్టర్ వి. వి. యల్. నరసింహారావు

పరిచయ మంటే గ్రంథకర్తను గూర్చిన పరిచయం; గ్రంథాన్ని గూర్చిన పరిచయం.

గ్రంథకర్త శ్రీ వాసిరెడ్డి దుర్గాసదాశివేశ్వర ప్రసాద్ గారు ప్రసిద్ధులు. అయినా పరిచయం అవసరమా ?

వారినిగూర్చి వారిరచనలనుగూర్చి అన్నివిషయాలు అందరికీ తెలియక పోవచ్చు వాటి నీపరిచయంలో ప్రస్తావించటం భావ్యం.

శ్రీ ప్రసాద్ గారిని సానునయంగా అడిగాను – "మీజీవితవిశేషాలు తెలియజేయండి" అని.

చిరునవ్వు నవ్వి ఊరకున్నారు. తన్నుగూర్చి తానుగా చెప్పుకోవటం బాగుండ దని కాబోలు! కాని నామాట కాదనటమూ వారి కిష్టంలేదు. కొన్ని కాగితాలు* నాచేతి కిచ్చి "ఇవి చూడండి చాలు" నన్నారు.

అవి తన్నుగూర్చి తెలిసినవారు వ్రాసిన విశేషాలు గల కాగితాలు, అందులో రెండుమూడు వ్యాసాలవంటివి. తక్కినవి రచనా విశేషాలతో గూడినవి. వ్యాసాలు తన జీవితవిశేషాలు తెలిసినవారు వ్రాసినవి, రచనా విశేషాలు సంక్షిప్తంగా తాను పేర్కొన్నవి.

---

*ఇందులో—నాగార్జున విశ్వవిద్యాలయంవారి అభినందనపత్రం, పత్రికల్లో ప్రచురితమైన శ్రీమల్లెల శ్రీరామమూర్తి శ్రీ జి. కృష్ణగార్ల వ్యాసాలు, శ్రీ ప్రసాద్‌గారు స్వయంగా వ్రాయించి యిచ్చిన తమరచనావిశేషాలకు సంబంధించిన కాగితాలు ఉన్నాయి.

సావధానంగా చూద్దునుగదా నాకన్ను చెదిరిపోయింది.

అర్ధశతాబ్ది క్రిందట వారు పాళీభాషనుండి తెనుగుజేసిన 'ధమ్మపదము' ఆమధ్య చదివిన జ్ఞాపకం నాకింకా ఉంది. దానికి వారు వ్రాసుకున్న పీఠిక, లఘు వివరణలు చూచిననాడే ఆయన విశాలహృదయంగల గొప్ప పండితు డనే నమ్మిక నాకు కలిగింది.

ఇప్పుడు వారందజేసిన విశేషాలు పరిశీలించినకొద్దీ నాకొక్కటే అభిప్రాయం కలిగింది.

విరియ బండిన పండ్లబరువుతో వృక్షరాజం వినమ్రమై ఉంటుంది.

సాధికారికంగా సప్రమాణంగా ప్రసాద్ గారు వ్రాసిన 30 గ్రంథాలు, 33 వ్యాసాలు ఉన్నాయి. అందులో 9 గ్రంథాలు, 8 వ్యాసాలు ముద్రితాలు. తక్కినవి అముద్రితాలు.

ఈ రచనలన్నీ ఎంతోవిషయవైవిధ్యం గలవి. సాహిత్యం, వ్యాకరణం, విద్య, బౌద్ధం, నీతిశాస్త్రం, తంత్రశాస్త్రం, వృక్షశాస్త్రం, భౌగోళిక వాతావరణ శాస్త్రం, వైద్యశాస్త్రం, యాత్రలు, రాజకీయం మొదలైన అనేక విషయాలు గల రచనలివి. బౌద్ధానికి సంబంధించిన రచనలు ప్రసాద్‌గారికి సుప్రశస్తి నార్జించిపెట్టినవి.

ఇంతటి కృషిచేసినా ఆయనలో కించిత్తు గర్వరేఖ కనిపించదు. జీవిత సాహితీ రంగాలు రెండింటిలోను పక్వఫలాలు పండించుకొన్న వినమ్ర వృక్షరాజం శ్రీప్రసాద్‌గారు.

స్వోత్కర్షకు చోటివ్వని సౌమనస్యం. పండితు లిచ్చిన బిరుదు కూడా ప్రకటించుకోరా దనే మనస్తత్వం.

ఈ యుగంలో ఇవి అపురూపమైన గుణాలు కావా !

బౌద్ధవాఙ్మయంలో శ్రీప్రసాద్‌గారు చేసిన కృషిని సమ్మానిస్తూ 1977లో గుంటూరుజిల్లాలోని అప్పికట్లలో ప్రొఫెసర్ యన్.జి. రంగాగారి అధ్యక్షతను ప్రసాద్‌గారికి ఒక బిరుదు ఇవ్వబడినమాట వాస్తవం.

ఇటీవల నాగార్జున విశ్వవిద్యాలయంవారు మహాయానబౌద్ధ అధ్యయన కేంద్ర ప్రారంభోత్సవానికి భూటాన్‌ప్రభువు శ్రీ జిగ్మేసింగ్యావాంగ్‌చుక్ గారితోపాటు ప్రసాద్‌గారినికూడా ఆహ్వానించి, ప్రసాద్‌గారి బౌద్ధవాఙ్మయ సేవలను ప్రస్తుతిస్తూ తత్సంబంధమైన వారి బిరుదునుకూడా అభినందన పత్రంలో పేర్కొనటం జరిగింది.

ఆబిరుదు నేనుకూడా ఈ పరిచయపత్రంలో ఎక్కడ పేర్కొంటానో అనే అనుమానంతో కాబోలు ప్రసాద్‌గారు నాకేం వ్రాశారో చూడండి!

"అప్పికట్లలో నన్ను సన్మానించి బిరుదమిచ్చిన విషయము వీరు దీనిలో (నాగార్జునవిశ్వవిద్యాలయం వారు అభినందనపత్రములో) ప్రస్తావించిరి. ముందుగా నా కాబిరుదు విషయము చెప్పక ఆసభలో దానిని హఠాత్తుగా వెల్లడించారు బిరుదులు పొందుట నా కిష్టముగాదు దాని నపుడు తిరస్కరించిన ఆ సభవారి నగౌరవపరిచినట్లగునని నేను ఉపేక్షాభావముతోనుంటిని. అయితే ఆబిరుదును నే నుపయోగించుకొనుట లేదు. దాని నుపయోగించవలదని నామిత్రులకు విన్నవించినాను. వారు దానిని వాడుటలేదు. కనుక దయచేసి మీరూ ఆబిరుదును వాడవలదని విన్నవిస్తున్నాను.

బిరుదులవల్ల గర్వము పెరుగును. దాన వివేకము వికలపడును. అది వాంఛనీయము కాదు.''

ఇదీ నిరాడంబరమైన శ్రీప్రసాద్‌గారి నిండైన వ్యక్తిత్వం.

అందుకే అన్నాను 'ఫలభారానత వృక్షరాజం ప్రసాద్‌గా'రని.

11–4–1899 న, ఉగాది పండుగనాడు జన్మించారు ప్రసాద్‌గారు. తండ్రిగారు ముక్త్యాలసంస్థానాధీశ్వరులైన వాసిరెడ్డి వేంకటాద్రినాయుడుగారు. అన్నగారు చంద్రమౌళీశ్వరప్రసాద్‌గారు. సంప్రదాయానుసారం అన్నగారు ముక్త్యాలసంస్థానాధిపతులుకాగా తాము జయంతిపురం జమీందారైనారు. ప్రసాద్‌గారి విద్యాభ్యాసాదులు పాఠశాలలో కాదు పితృపాదుల అంతికంలోనే, శ్రీ పూండ్లవెంకటప్పయ్యగారివంటి పండితుల సన్నిధిలోనే. సంస్కృతాంధ్రాలలో క్షోదక్షమమైన పాండిత్యం. స్వయంకృషితో నేర్చిన భాష పాళీభాష. ఆంగ్లభాషకూడా సుపరిచితమే. సాహిత్య రంగంలో బహుముఖ ప్రజ్ఞకు దోహదం కలిగించింది వేటూరి ప్రభాకరశాస్త్రి వేలూరి శివరామశాస్త్రిగార్ల పరిచయం. క్రమంగా ప్రసాద్‌గారికి కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారివంటి ప్రాజ్ఞులతో పరిచయం ఏర్పడింది. శ్రీదిగవల్లి శివరావుగారు మొదలైనవారి పరిచయంతో ప్రసాద్‌గారి జీవితం క్రొత్తమలుపు తిరిగింది.

దేశభక్తి, జాతీయతారక్తి, స్వాతంత్ర్య సమరసన్నాహశక్తి మొదలైనవి ప్రసాద్‌గారి రాజకీయ జీవితవిశేషాలు. 'నారాజకీయజీవితం' అనే పేరుతో పదకొండువందల పుటల బృహద్గ్రంథం ఒకటి ప్రసాద్‌గారే వ్రాసి సిద్ధంచేసి వుంచారు. ఒకవిధంగా అది కృష్ణా జిల్లా రాజకీయచరిత్రకూడాను. అచ్చయితే అనేక విషయాలు తెలుసుకోవచ్చు.

నేటికి ఎనభైనాలుగేళ్లు నిండి వినుకలి కనుకలి శక్తులు వెనుకాడుతున్నా రచనావ్యాసంగం మాత్రం విడనాడని ప్రసాద్‌గారి సాహితీ జీవితం సంకల్పశుద్ధికీ సాహిత్యసిద్ధికీ స్వచ్ఛదర్పణం.

## బౌద్ధవాఙ్మయసేవ

ప్రసాద్‌గారి సాహితీజీవితం 1922లో క్షేమేంద్రుని అవదానకల్పలత నాంధ్రీకరించటంతో ఆరంభమైంది. 1922, 23 సం॥లలో తమసంపాదకత్వంలోనే వెలువడుతున్న 'సరస్వతి' మాసపత్రికలో 15పల్లవాల వచనానువాదం

ప్రచురించారు. 16నుండి 30 పల్లవాలవరకు అనువదించిన తరువాత మిత్రులు వాడుకభాషలో వ్రాయవలసిందిగా కోరితే అట్లాగే వ్రాశారట. 25 పల్లవాల అనువాదం అముద్రితంగానే ఉండిపోయింది.

1924 లోనే వాడుక భాషను వరించిన ప్రసాద్‌గారి వ్యావహారిక రచనా రీతి 1954 నాటికి ఏపాటి తీరుతీయములు సంతరించుకొన్నదో ప్రస్తుత 'ఆర్యకుటుంబ' రచనాపద్ధతే ప్రత్యక్షీకరిస్తుంది.

ఈ మధ్యకాలంలో క్షేమేంద్రుని 'సేవ్యసేవకోపదేశము' నకు పద్యానువాదం చేశారు. ప్రసాద్‌గారి ప్రప్రథమ పద్యరచన యిదే. ఇది 1925లో 'భారతి' లోను తరువాత పుస్తకరూపంలోను ప్రచురితమైంది.

1926లో వచనానువాదం చేసిన 'ధమ్మపదము' ను 1964లో పద్యరూపంగా వ్రాశారు. పద్యకృతి అముద్రితం. ధమ్మపద గాథలకు మూలమైన 'అట్టకథలు' మహేంద్రుడు సింహళభాషలో వ్రాయగా అశ్వఘోషుడు వాటిని పాళీభాషలోకి అనువదించాడు. ప్రసాద్‌గారు 1964లో అశ్వఘోషునికృతిని 'ధమ్మపదపు అట్టకథ'లనే పేరుతో వచనరూపంగా తెనుగుచేశారు. ఇదీ అముద్రితమే. 1955లో వ్రాయబడిన 'కరుణామయి' అనే పద్యకృతి ప్రసాద్‌గారి స్వతంత్రరచన. బౌద్ధకథాసమన్వితమే. వీరి 'బౌద్ధకాలీనభూగోళచరిత్ర' అనే గ్రంథం మరోకోణంలో సాగిన పరిశోధనాత్మకరచన.

బర్మా మొదలైన బౌద్ధదేశాల పాఠశాలల్లో నిత్యం విధిగా పఠింపజేసే పాళీగ్రంథం 'మంగళసుత్త'. దీనిని ప్రసాద్‌గారు 1968లో అనువదించారు. 1969లో 'బౌద్ధహృదయ' మనే గ్రంథాన్ని మూడు భాగాలుగా రచించారు. బౌద్ధమతం, దాని పూర్వోత్తరస్థితుల్లో బుద్ధుని జీవితవిశేషాలు, తత్పరిణామాలు, క్రైస్తవమతం మీద బౌద్ధప్రభావం, భారతదేశంలో బౌద్ధం క్షీణించడానికి కారణాలు ఈ గ్రంథంలో విపులంగా వివరించబడినాయి. సింగాలుడికి బుద్ధుడు చేసిన ఉపదేశాలతోగూడిన గ్రంథం 'సింగాలసుత్త'. దీనిని ప్రసాద్

గారు 1980లో అనువదించారు. బౌద్ధభిషగాచార్యుడుగా ప్రసిద్ధిపొందిన జీవకుని కథకూడా ప్రసాద్‌గారు 1976లోనే వ్యాసరూపంగా ప్రచురించారు.

మొత్తంమీద బౌద్ధవాఙ్మయానికి ప్రసాద్‌గారు చేసినసేవలు చిర స్మరణీయాలు.

## విషయవైవిధ్యం, విజ్ఞాన విశేషాలు

ప్రసాద్‌గారి రచనల్లోని విషయవైవిధ్యం గుర్తించతగింది. శాస్త్ర దృష్టితోపాటు లోకాన్ని ప్రగాఢంగా పరిశీలించి ప్రబోధించాలనే దృష్టికూడా వారి రచనల్లో స్పష్టంగా కనిపిస్తుంది.

సాహిత్యజీవులకు వ్యాకరణాది విద్యల్లో అభినివేశం ఉండడం సహజం. కాని వృక్షశాస్త్రం, భౌగోళిక వాతావరణాది శాస్త్రాల్లోకూడా రచనాసక్తి ఉండటం విశేషం.

వీరు 1932లో భగవద్గీతను పద్యాల్లోకి అనువదించారు. గీతలోని ముఖ్య విషయాలకు వివరణాత్మక ప్రజ్ఞాపనములు చేర్చి, 1955లో పునర్ముద్రణం చెయ్యటంకూడా జరిగింది. 1968లో కాళిదాసుని మేఘదూతం తెనుగుచేశారు. 1969లో ప్రత్యేకంగా కాళిదాసునుగూర్చి, ఆయనకాలాన్నిగూర్చి పరిశీలనాత్మక రచనకూడా చేశారు. రఘుజైత్రయాత్ర అనే మరోరచనకూడా ఉన్నది. భారతీయలిపినిగూర్చి భాషాపరిణామంగూర్చికూడా వ్యాసాలు వ్రాశారు. పాణిని ప్రయోగించిన పరిభాషాపదాలకు అన్వయముఖమైన వివరణలు సంతరించి, ఆగ్రంథానికి 'పాణిని పారిభాషిక' మని పేరుపెట్టారు. 1970లో జరిగిన ఈ రచన వారి శబ్దశాస్త్ర జిజ్ఞాసను సూచిస్తుంది. సుందరపాండ్యుని నీతిముక్తకాలను 'నీతిసీరాజన' మనేపేరుతో 1950లో తెనుగుచేసి, 1955లో ప్రచురించారు. 1957లో 'ధర్మానుగతినీవు తలపోయుమన్నా!' అనే మకుటంతో 'ధర్మసందేశ' మనే ఖండిక ఒకటి రచించారు. ఇది అముద్రితం. 1950లో భవిష్యదవతార మనే మరోగ్రంథంకూడా వ్రాశారు. జగదుద్ధారకుడైన మహానుభావు

ప్రొక దవతరిస్తాడనీ అతనికి తెల్లగుట్టంతో సంబంధముంటుందనీ ప్రసిద్ధ మతాలవారు విశ్వసిస్తున్నారు. ఇటువంటి విశ్వాసం ముస్లింమతం వారిలోను ఉన్నది.హిందువుల వీరభోగ సంతరాయణ్ణిగూర్చిప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు.

మనప్రాచీన వృక్షశాస్త్రంపట్ల ప్రసాద్‌గారికి పరమాసక్తి. అదే వారి చేత 'ప్రాచీనపాదపీయశాస్త్ర' మనే గ్రంథం వ్రాయించింది. 1964లో తెలుగు అకాడమీ వారి వ్యవసాయపు సంపుటంలో దీన్ని ప్రచురించారు. భారతీయుల ఉద్యానకళలో ప్రత్యేకించి తెలుసుకోవలసిన అంశాలు అనేకం. ప్రసాద్‌గారు 1935 నుండి ఈ కళనుగూర్చి ఎంతో పరిశోధించి "ఉద్యానకళ" "వృక్షాయుర్వేదం" అనే రెండుగ్రంథాలు వ్రాశారు. అపూర్వమైన అనేకవిషయాలతో గూడిన ఈ గ్రంథాల్లోని కొన్నిభాగాలు మాత్రమే ముద్రితమైనాయి. మొక్కలు అంట్లుకట్టడం. తేనెలు సేకరించేతీరు మొదలైన విషయాలుకూడా ప్రత్యేక వ్యాసాలుగా ప్రచురితమైనాయి.

వరాహమిహిరుని 'బృహత్సంహిత' ననుసరించి, వర్షోత్పత్తి వర్షసూచనలు మొదలైన అంశాలు వివరిస్తూ 1951లో 'వాతావరణశాస్త్ర' మనే గ్రంథం వ్రాశారు. 1965లో వ్రాసిన 'హంసమేఖల' అనే గ్రంథం ఇంద్రజాలం, వాడుకలోవున్న వైద్యప్రయోగాలు మొదలైన విశేషాలను వివరిస్తుంది. ఇది ప్రాచీనుడైన మాహుకుని పాలీరచనకు అనువాదం. 1966లో రచించిన 'గార్హ్య తంత్ర' మనే మరోగ్రంథ ముంది. ఇది నిత్యజీవితంలో ఉపయోగించే అనేక యోగాలకు సంబంధించిన స్వతంత్ర రచన.

1964లో వ్రాసిన 'భారతదేశ ఇతిహాసపు రూపురేఖ' అనేగ్రంథం జయచంద్రవిద్యాలంకార్ హిందీ రచనకు తెనుగుసేత. 1967లో రచించిన 'కైలాసము,మానససరోవరయాత్ర' స్వామిప్రణవానంద రచనకు తెనుగుసేత. 1971లో వ్రాసిన 'ప్రాచీన భారతదేశమందలి దేశాలు ప్రదేశాలు' అనే స్వతంత్రరచనలో ప్రాచీన ప్రదేశాలకు ఇప్పటిపేర్లు వివరించబడినాయి. భారతదేశపు రైళ్ళనుగురించి, కుశద్వీపమునుగురించి, మెసపొటోమియాలో హైందవ

సంస్కృతిని గురించి, చీనాలో భారతీయ రాజవంశ మౌలిక రాజపాలనగురించి, లాసాస్థాపన గురించి, లడక్ గురించి, సుమేరు ఈజిప్టు మొహంజొదారోల లోని ప్రాచీనసభ్యజాతుల గురించి, 'భారతీయుల శిల్పకళ గ్రీకులనుండి లభించిందా?' అనే అంశంగూర్చి, 'ప్రాచీన భారతీయుల యంత్రవిద్య' ను గూర్చి—ఇట్లా ఎన్నెన్నోవిషయాలను గురించి అనేక వ్యాసాలు వ్రాశారు.

మత సంబంధమైన ప్రాచీన సంస్కృతి నన్వేషిస్తూ 'సర్పారాధన' గురించి, 'యూపము' గురించి, 'స్థూపము' గురించి, 'శివలింగము' గురించి, 'కాళీశక్తుల భిన్నతత్త్వము' గురించి, 'పితృర్చన' గురించి అనేక వ్యాసాలు వ్రాశారు.

వేదకాలపు విద్యనుండి నేటి విశ్వవిద్యాలయాలవరకు 'భారతీయ విద్యావిధాన పరిణామా'ల గురించి, 'పాశ్చాత్యుల సంస్కృత విద్యాధ్యయనము' గురించి ప్రత్యేక వ్యాసాలు వ్రాశారు.

ఇవన్నీ ప్రసాద్‌గారి రచనల్లోని విస్తృతమైన విషయవైవిధ్యానికి, విపులమైన విజ్ఞాన విశేషాలకు ప్రబల నిదర్శనాలు.

1980 వరకు పుంఖానుపుంఖంగా అనేక రచనలు సాగించిన ప్రసాద్ గారు వార్ధకం వల్లకాబోలు ఇటీవలి కాలంలో కొంత తటస్థత వహించినట్లు కనిపిస్తారు. ధర్మపత్ని శ్రీమతిపర్వతవర్ధనమ్మగారు స్వర్గస్థురాలు కావటం కూడా ఒకహేతువుకావచ్చు. సాహితీధర్మపత్ని మాత్రం ఆయనను విడనాడక జగ్గయ్యపేటలోని వారి శాంతిసదనంలో ఆయనకు నిత్య తృప్తిని కలిగిస్తూనే ఉండటం విశేషం.

## 'ఆర్ష కుటుంబము'

ఆర్ష కుటుంబపు సుఖశాంతు లెటువంటివో స్వీయజీవితంలో కూడా సుంత చవిచూచినవారు శ్రీ ప్రసాద్‌గారు. అందువల్ల 'ఆర్షకుటుంబ' మనే గ్రంథం వ్రాయడం వీరికి సుకరమైయుండవచ్చు. ఆ చిన్నెలు కొన్ని

ఈగ్రంథంలో గోచరిస్తాయి. ప్రసాద్‌గారు 55 ఏళ్ల ప్రౌఢవయస్సులో వ్రాసిన గ్రంథం ఇది. ప్రౌఢి అనేది వయస్సులో మాత్రమే కాదు; అనుభవంలో, ఆలోచనలో, ఆశయంలో, ఆదేశంలో కూడా.

'మహాత్ములకు లోకమే కుటుంబ' మనేది అభియుక్తోక్తి. లోకాన్ని కుటుంబంగా సంభావించటంలోనే కుటుంబ వ్యవస్థలోని ఔన్నత్యం స్పష్టమౌతుంది. ప్రాచీనమైన భారతీయ కుటుంబ వ్యవస్థకు ఆర్షకుటుంబం కుదురు. ఆర్షకుటుంబ మంటే ఋషి సంప్రదాయబద్ధమైన ఆర్యకుటుంబం.

'ఋషి'—అంటే జ్ఞాన పారమ్యం పొందినవాడు. జ్ఞానమనేది సత్య సందర్శనం వల్ల సిద్ధిస్తుంది. 'జ్ఞానస్య పారగమాత్ ఋషిః' 'ఋషయః సత్యవచసః' ఇవి నిఘంట్వర్థాలు. 'ఋగతౌ' ధాత్వర్థం.

'కుటుంబ' శబ్దం 'గృహ' శబ్దానికి పర్యాయం. కుటుంబి అంటే గృహస్థు. కుటము, కుటి, కుటుంగము—అనే పదాలు గృహవాచకలే. 'ఆకులు లోనగువానిచే ఆచ్ఛాదితమైన గృహభేదము' కుటుంగము (సూ.రా.అం.). ఆలుబిడ్డలతో గృహస్థులైన ఋషులు నివసించే కుటుంగములే కుటుంబములు. ఆశ్రమ ధర్మాన్ని బట్టి చూస్తే గార్హస్థ్యమునకు నిలయమైనవి కుటుంబాలు.

భారతీయులు చిరంతనంగా కృషిజీవులు. కుటుంబి అనేమాటకు ఆ అర్థంకూడా కుదురుకొనే వున్నది. కుటుంబీ (న్) కృషకః (శబ్దచంద్రిక)

కృషకః — కృషతి భూమిం యః — కర్షకః (మేదిని)

భూమిని దున్నేవాడు 'కుటుంబి'.

కుటుంబ సంరక్షణార్థం ప్రాచీనులైన ఋషులుకూడా కర్షక వృత్తినే అవలంబించేవారు. ఆర్యావర్తంలోని ఋషులు అనూచానంగా అవలంబించిన వృత్తి ఇదే. ఆర్య శబ్దంకూడా ఈ అర్థాన్నే స్పష్టీకరిస్తుందని గ్రంథకర్త తొలినివాళిలోనే వివరించారు. అంతేకాక, ఆర్య శబ్దం వృత్తినిరూపక గుణ

వాచకమే కాని సుతరాము జాతివాచకం కాజాలదని ఉపపత్తులనుకూడా చూపారు. ఆర్యులంటే ఎక్కడి నుండో ఇక్కడకు దిగుమతి అయినజాతి అనే వాదం అపార్థాలకు దారితీసింది. సుర–అసుర శబ్దాలు ఎట్లా ప్రవృత్తి నిరూపకశబ్దాలో ఆర్య–అనార్య శబ్దాలుకూడా అట్లా ప్రవృత్తి నిరూపకాలే.

సృష్టిలో జీవపరిణామచరిత్ర మానవజాతిచరిత్ర అన్వేషించుకుంటూ, కుటుంబవ్యవస్థ ఎప్పుడు ఎట్లా ఏర్పడిందో పరిశీలిస్తూ, ప్రపంచమానవ జాతుల కుటుంబవ్యవస్థలో భారతీయమైన ఆర్షకుటుంబవ్యవస్థ ప్రత్యేకత ఎటువంటిదో వివరించటమే ఈ గ్రంథముయొక్క పరమలక్ష్యం. తొలి అయిదు నివాళులూ ఇందుకు ఉపక్రమంగా ఉదయించినవే. ప్రపంచ మానవజాతుల కుటుంబవ్యవస్థలనుగూర్చి ప్రస్తావించే ప్రయత్నం జరగకపోయినా, ముఖ్యంగా భారతీయులకు సంబంధించిన అంశాలు గ్రంథంలో విపులీకరించబడినాయి.

భగవత్స్వరూపమైన కాలం అనాది, అనంతం. దానిపరిమాణం నిరూపణకు అందేది కాదు. ఎన్నెన్ని మహాప్రళయాల పరంపరలలో ఎన్నెన్ని సృష్టులు రూపుమాసినవో, ఎన్నెన్ని క్రొత్త సృష్టులు చివురించాయో ఊహకందే విషయంకాదు.

వేదాల కాలనిర్ణయం గూర్చి అంతే. మాక్స్‌ముల్లర్, వింటర్‌నిట్జ్, హెచ్.జి. వెల్స్, పి సి సేన్‌గుప్త, వి.వి. కేట్కార్, ధీరేంద్రనాథ్ మహోపాధ్యాయ, బాలగంగాధర్ తిలక్, జాకోబి, కె. యస్. రామస్వామి మొదలైన పలువురు పండితులు అనేక పరిశోధనాంశాలు వెల్లడించారు. వేదాలు అపౌరుషేయాలు అనే భారతీయ విశ్వాసంతో వేదకాలం ఇదమిత్థమని చెప్పటం కష్టమనే వారూ ఉన్నారు.

కృత త్రేతా ద్వాపర కలియుగాలలో ప్రస్తుతం నడుస్తున్నకాలానికి కృతయుగారంభం సుమారు పదివేల సంవత్సరములకు క్రిందటిది కావచ్చునని ఒక అంచనా. కర్షక సంస్కృతి వయస్సుకూడా ఇంతకు తక్కువేమీ కాదు.

భూగర్భనిక్షేప పురాతత్త్వ పరిశోధనలవల్ల క్రీ.పూ. మూడువేల సంవత్సరాలకు ముందే ఈదేశంలో సంస్కృతి సభ్యతలు వికసించిన వనుకొన్నా వేదప్రామాణ్యాన్ని అనుసరించి కృషి వాణిజ్యాది సామాజిక వ్యవస్థలు క్రీ.పూ. ఆరువేల సంవత్సరాల నాటికే నెలకొనివున్నట్లు స్పష్టం. ఆర్షకుటుంబ వ్యవస్థతోపాటే ఈ సామాజిక వ్యవస్థలుకూడా క్రమవికాసం పొందినవని భావించవచ్చు.

జీవుల ప్రాణధారణకు ఆవశ్యకమైంది అన్నం. దాని ఉత్పత్తికి ఆవశ్యకమైన సస్యం భూమినుండి పండించుకోవాలి. కృషికిగల ప్రాధాన్యం ఇక్కడే స్పష్టమౌతుంది. కృషికర్మప్రాధాన్యంగూర్చి ఋక్కులు అమోఘంగా గానం చేశాయి.

"క్షేత్రస్య పతినా వయం హితేనేవ జయామసి।
గామశ్వం పోషయిత్న్వాసనో మృళాతీ దృశే॥

"క్షేత్రస్య పతే మధుమంత మూర్మిం ధేనురివ పయో అస్మాసు ధుక్ష్వ।
మధుశ్చుతం ఘృతమివ సుపూత మృతస్యనః పతయో మళ్యంతు॥

"మధుమతీ రోషధీర్ద్యావ ఆపో మధుమన్నో భవత్వంతరిక్షమ్।
క్షేత్రస్య పతిర్మధు మాన్నో అస్త్వరిష్యంతో అన్వేనం చరేమ॥

(ఋ-4-57-1 నుండి 3వరకు)

అన్నానికి ఉత్పత్తిస్థానం క్షేత్రం. క్షేత్రాన్నీ అశ్వాన్నీ పోషిస్తూ క్షేత్రపతి మామేలు కోసం కృషిచేస్తాడు. ఆ బుద్ధిశాలి పవిత్రమైన విజ్ఞానం గడించి, మాకు సుఖం కలిగించుగాక! ధేనువువలె అతడు తియ్యని క్షీరధారలతో ఈ లోకాన్ని నింపుగాక! అన్నోత్పత్తికోసం ఆక్షేత్రస్వామి మధురగుణాస్పదు డగుగాక! ఓషధులు, సూర్యాదుల తేజస్సులు జలము, ఆకాశము మధురగుణ సంయుక్తము లగుగాక! హింసాప్రవృత్తిరాహిత్యమే మాప్రవృత్తి — కర్షకప్రవృత్తి అమృతవాక్కుల్లో అభివర్ణించబడిన సందర్భం ఇది.

చతుర్వేదాలలో అథర్వవేదం కడపటిదిగా పరిగణించబడినా వేదయుగపు సామాజిక చరిత్ర నందించటంలో అది ప్రథమగణ్యం. ఋగ్యజుస్సామముల కంటే అది సామాన్యజనుల దైనందిన ఆంతరంగిక జీవితాన్ని అద్దంలో చూపినట్లు చూపుతుంది. ఆహారవ్యవహారాలు, వివాహాది సంస్కారాలు, ఇళ్లువాకిళ్లు, పశువులు, పొలాలు, కులాలు మతాలు, ప్రభుత్వాలు, రాచరికాలు, వ్యాపారం, వాణిజ్యం, కళలు, పరిశ్రమలు, ఖగోళం, భూగోళం, వేదాంతం, విశ్వతత్త్వం మొదలైన అనేక విషయాలు అథర్వవేదం మనకు చక్కగా అందిస్తుంది. సామాజిక చారిత్రిక విశేషాలు అందించటంలో అథర్వవేదం అమూల్య నిక్షేపం.

మనుష్యుడు అన్నాది పదార్థాలను సంపాదించి ప్రాణుల్ని పోషించాలనీ, గోవృషభాశ్వాది జంతువులుకూడా అన్నగత ప్రాణులే కనుక ప్రాణిరక్షణకు మనుష్యుడు అన్న సంపాదన చెయ్యాలనీ చెప్పే ఈ క్రింది అథర్వమంత్రం వేదకాలపు కర్షక సంస్కృతికెత్తిన విజయపతాకగా కనిపిస్తుంది.

> "యస్యా శ్చతస్రః ప్రదిశః పృథివ్యా యస్యా మన్నం కృష్టయః సంబభూవుః।
> యా బిభర్తి బహుధా ప్రాణ దేజత్ సానోభూమిర్గోష్వప్యన్నే దధాతు॥"
> (అథర్వ-12 - 1 - 1-4.)

ఆదికాలాన వైశ్యులుకూడా కృషిజీవనులే అనటానికి వారికి గల 'ఆర్య' వాచకమే నిదర్శన మని గ్రంథకర్త సప్రమాణంగా పేర్కొన్నారు.

ఇన్నిమాటలెందుకు? 'భారతీయ సంస్కృతికన్న తొలికాన్పు కృషి'. నేటికీ భారతదేశం వ్యావసాయిక దేశమే. అయితే ఆర్షకుటుంబవ్యవస్థనుండి ప్రభవించిన నాటి జానపద కర్షక సంస్కృతికీ, యాంత్రిక పట్టణజీవిత ప్రభావితమైన నేటి ఆధునిక కుటుంబనాగరికతకూ ఎంతో అంతరం వుంది. నాటి ప్రశాంత జీవన పద్ధతులకూ, పరుగులూవారే నేటి బ్రతుకు తొందరలకూ సాపత్యం లేదు. సహజసిద్ధంగా లభించే నాటి సుఖశాంతులు నేడు విశ్వ

ప్రయత్నించేసినా అసాధ్యంగానే ఉన్నాయి. జనసంఖ్య నాడు పరిమితమనీ నేడు అపరిమితమైనందువనే జీవనసౌఖ్యం మృగ్యమైందనీ చెప్పటంతరుచుగా జరుగుతున్నది. నిజానికి—ప్రాచీనకాలపు ఆర్షకుటుంబవ్యవస్థలోని మేలిగుణాలను పేక్షించటంవల్లనే నేటి నాగరిక సంసారజీవనం సుఖశాంతులకు దూరమైనట్లు స్పష్టమౌతుంది. సంసారుల బ్రతుకుల్లో శాశ్వతమైన సుఖానందాలు సమకూడాలంటే నాటి ఆర్షకుటుంబవ్యవస్థను అవగతం జేసుకోవటం ఆవశ్యకం. ఇటువంటి విశాలాశయంతో ప్రసాద్‌గారు రచించినగ్రంథమే 'ఆర్షకుటుంబం'.

'కుటుంబ' మని అనగానే అనేక సభ్యులతోకూడిన ఒక వ్యవస్థ జ్ఞప్తికి వస్తుంది. కుటుంబి. కుటుంబిని, కుటుంబసభ్యులు, వత్సలు మాతాపితలు. అతిథులు, అభ్యాగతులు, కుటుంబపోషణ, అనూచానంగా వస్తున్న వృత్తులు, విద్యలు, అనుబంధపరిశ్రమలు, అధ్యయనపద్ధతులు, కళలు పండుగలు, పబ్బములు, శుభకార్యాలు, యజ్ఞయాగాదులు--సర్వం ఈ వ్యవస్థలో భాగాలే. అన్నిటినీమించి, అభిప్రాయ భేదాలు పొడసూపినప్పుడు కుటుంబసభ్యులను సమాధానపరచటానికి చెయ్యవలసిన ధర్మోపదేశాలు, ధర్మనిర్ణయాలూ అవసరమే. ఈమొత్తం కలిసి కుటుంబమనేది దానియంతట అదే ఒక చిన్న సామ్రాజ్యంగా కనిపిస్తుంది. ఈసామ్రాజ్యానికి కుటుంబయజమాని ప్రభువువంటివా డనవచ్చు. కాని అత డట్లా అనుకోడు. విధ్యుక్తధర్మనిర్వాహణం చేసే ధర్మప్రవర్తకుడనని మాత్రమే అనుకుంటాడు. కుటుంబసభ్యులందరి ప్రేమాభిమానాలు చూరగొంటూ వారి బాగోగులు చూస్తూ, వారి క్షేమం కోసం పాటుపడే బాధ్యతగల వ్యక్తి అతడు. గార్హస్థ్యధర్మం తెలిసిన ఆర్ష గృహస్థు లక్షణం ఇదే. దీన్ని దృష్టిలో ఉంచుకొనే ఈ గ్రంథరచయిత 'ఆర్ష కుటుంబ' రచనా ప్రణాళికను సంతరించారు 'ఆర్షకుటుంబ' సంప్రదాయానికి జోహారులర్పించే సౌమనస్యంతో ప్రతిపరిచ్ఛేదాన్నీ 'నివాళి' అని పేర్కొన్నారు.

ఇతరమైన కుటుంబ వ్యవస్థ లన్నిటికంటె ఆర్షకుటుంబ వ్యవస్థలో గ్రంథకర్త ఒకప్రత్యేకత గుర్తించారు అదే నిష్కామకృషి. కుటుంబానికి

సంబంధించిన "ఈ వ్యాపారం నాకోసమే కాదు. విశ్వవిభున కర్పిస్తున్నాను" (పుట 11) అనేహృదయస్పందనంకలవాడు ఆర్షకుటుంబి. అతని దృష్టి ధర్మ సంలగ్నం ధర్మస్వరూపం చాలావిలక్షణమైనది; విశిష్టమైనది. అది ఆప్తవాక్యంగా గ్రహింపదగింది. ఆప్తుడంటే ధర్మోపదేశం చెయ్యగల అధికారి. (ఆపదలో ఆదుకొనేవాడనేది సామాన్యార్థం) 'యఃసర్వాన్ ధర్మాత్మాన్ ఆప్నోతివా సర్వై ర్ధర్మాత్మభి రావ్యతే ఛలాదిరహితః స ఆప్తః'' సర్వధర్మాత్ముల్ని ప్రాపించేవాడు సర్వధర్మాత్ములకు ప్రాపించతగినవాడు ఆప్తుడు; కపటత మొదలైన దుర్గుణాలు లేనివాడు ఆప్తుడు. ఇందువల్లనేఆప్తవాక్యం ప్రమాణమైంది. ఇంతకూ ధర్మ లక్షణం ఏమిటి?

ఒక్కొక్కమతానికి ఒక్కొక్క విశ్వాసం ఉంటుంది. ప్రమాణగ్రంథా లుంటాయి. క్రైస్తవులకు బైబిలు, మహమ్మదీయులకు కొరాన్ అట్లాగే హిందువులకు వేదం. వేదంతోపాటు వేదాన్నిగుర్తుకుతెస్తూ ఆప్తవాక్యంగా చెప్పబడే స్మృతులూ ఉన్నాయి. మనుస్మృతి ధర్మలక్షణాన్ని ఇట్లానిర్వచించింది.

'వేదః స్మృతిః సదాచారః స్వస్యచ ప్రియ మాత్మనః
ఏత చ్చతుర్విధం ప్రాహుః సాక్షాద్ధర్మస్య లక్షణమ్'

[మ స్మృ 2– 2]

వేదము, స్మృత్యాదిశాస్త్రాలు, సదాచారం (సత్పురుషుల నడవడి) ఆత్మకు ప్రియమైన సత్యభాషణం – ఈనాలుగు ధర్మలక్షణాలుగా చెప్పబడినాయి.

ఆర్ష కుటుంబి అవలంబించే ధర్మముయొక్క లక్షణం ఇదే.

వివాహ మనేది వెయ్యేళ్ళపంట. ఇందుకే 'భార్యాభర్తలు పరస్పరం సుప్రసన్నులై యుండాలి. సంతుష్టాత్ములై యుండాలి. అప్పుడే ఆకుటుంబం నిత్యకల్యాణం, పచ్చతోరణంగా ఉంటుం' దంటాడు మనువు.

"సంతుష్టో భార్యయా భర్తా, భర్త్రా భార్యా తథైవచ,
యస్మిన్నేవ కులే నిత్యం కల్యాణం తత్ర వై ధ్రువమ్."

(మ.స్మృ. 3-60)

ఇక్కడ 'కుల' శబ్దం 'కుటుంబ' పర్యాయంగా వాడబడటం విశేషం. ఇది నేడు మనంవాడే బ్రాహ్మణాది కులవాచకం (Caste) కాదు. కులపతి అంటే కుటుంబిని, పంసారస్త్రీ అనేకదా అర్థాలు.

కుటుంబమంటే ఆలుమగలుమాత్రమే కాదు. పలువురు సభ్యు లుంటారు. పిల్ల, పాప, అన్న, తమ్ముడు, అక్క, చెల్లెలు, తల్లి, తండ్రి, ముసలి, ముదుక మొదలైనవారెందరో: వీరందరు పరస్పరం అవ్యాజమైన ప్రేమాను రాగాలతో మసలేందుకు మూలసూత్రాలేవో వాటిని విపులీకరించారు గ్రంథకర్త ప్రసాద్‌గారు.

కులవృత్తుల రూపంలో కొనసాగిన ప్రాచీనకాలపు గృహవిద్యలుకూడా కాంతులు వెదజల్లే నాటి లఘుపరిశ్రమలే. మహాత్ముడు కలలుగన్న కుటీర పరిశ్రమలు వాటికంటే భిన్నమైనవి కావు.

అయో దారు కాంస్య స్వర్ణ శిలా శిల్పాలు గ్రామసీమల్లో గృహవిద్యలుగా రాణించిన తీరు తెన్నులు ఈగ్రంథంలో పందర్భోచితంగా వివరించబడినాయి. (పుటలు 121 – 125) ఋభువులు, త్వష్ట, మయుడు మొదలైనవారు వాస్తు శిల్పయంత్రనిర్మాతలైన విశ్వకర్మ లనేఅంశం సుప్రసిద్ధం (పు 62, 63).

గ్రామసీమల్లో కుటుంబాలు కేంద్రస్థానంగా నాడు పర్ధిల్లిన సర్వభారతీయ పంస్కృతిని అద్దంలో జూపినట్లు గ్రంథకర్త సోదాహరణంగా వివరించారు. ఈమార్గంలో గ్రామపునరుద్ధరణం జరగవలసిన ఆవశ్యకంకూడా సూచించి నట్లైంది. గ్రామ పంచాయతులు నేడు ఉండవలసినంత ఉత్సాహోత్తేజాలతో లేవని గ్రంథకర్త అభిప్రాయం. దీనికి వీరుచూపిన కారణం ఇది.

"వ్యవహారమంతా ఉద్యోగబృందమే నడుపుతున్నది. ఉద్యోగుల పంఖ్య మితిమీరి ఉన్నది. ఇది ఆయమును మించిన వ్యయ మనకతప్పదు. ఈ ఉద్యోగముల జీతబత్తెములకే చాల ధనం వ్యయమౌతున్నది. వీరివేతనాల

కిస్తున్న ధనమును గ్రామాలకు వినియోగించివుంటే ఎంతో పని జరిగేది. అంతేకాదు, ఇంతింత పెద్దవేతనాల ఉద్యోగులు పంచాయతుల కవసరం లేదు. ఈ పరిస్థితులు మారవలెను."

గ్రంథకర్త శ్రీ ప్రసాద్‌గారు సూచించిన ఈమార్పులు, వీటిసాధక బాధకాలు పరిశీలనార్హములు.

నైతిక బలం, ధర్మదృష్టి సన్నగిల్లిననాడే పరిపాలన సామర్థ్యంకూడా కుంటుపడటం కద్దు. ధర్మప్రచారం కోసం, ధర్మనిర్వహణం కోసం నాడు అశోకుడు ఒక ప్రత్యేక ప్రభుత్వశాఖనే నెలకొల్పాడు. ఆశాఖ నిర్వహించే ఉన్నతాధికారుల్నే 'ధర్మమహామాత్రి' లనేవారు.

తిరిగి ఆ ధర్మమహామాత్రి పదవి పునరుద్ధరించబడటం జరిగింది. లోకాయుక్తాది విధులకంటె ధర్మమహామాత్ర విధులు ఎట్లా విశిష్టమైనవో వివరించవలసిన ఆవశ్యకంకూడా ఏర్పడింది.

ఈ గ్రంథం ముప్పైఏళ్ల క్రిందట వ్రాయబడిందే అయినా గ్రంథకర్త పేర్కొన్న అనేక సాంఘిక రాజకీయ విషయాలు నేటికీ నూతన విషయాలు గానే వుండి అనుసరణీయాలుగానే కనిపిస్తున్నవి. అటవీసంపదపరిరక్షణ మొదలైన అంశాలు ఇందు కుదాహార్యాలు.

ముఖ్యంగా రచయిత లక్షించిన 'కుటుంబధర్మసామ్రాజ్య' మనేది ఒక 'ఆదర్శరాజ్యం' వంటిది. అంతరంగశుద్ధిలేనిదే ఇది ఆచరణసాధ్యంకాదు.

పైగా అమలిన గంగానదివంటి అలనాటి గ్రామజీవనపు ప్రశాంతతకు, నేడు పొంగులువారుతూ నురుగులుగ్రక్కే నాగరికపు బస్తీ బ్రతుకుల సముద్రపు హోరుకు పొంతన లేకపోవటంవల్ల ప్రసాద్‌గారుద్దేశించిన ఆదర్శ గ్రామరాజ్యం ఆచరణలో అందిరావటం అసాధ్యమనిపించవచ్చు.

ఆర్షకుటుంబ సంప్రదాయాలను పద్ధతులను వడగట్టి, అందులోని మేలి మిని మాత్రమే తేర్చి, ప్రస్తుత గ్రంథరూపంగా మన కందించారు ప్రసాద్‌గారు. ప్రాతదంతా భవ్యమనీ, నవ్యమంతా గర్హ్యమనీ ప్రతిపాదించటంకోసం పుట్టిన గ్రంథం కాదిది.

ఉత్తమమైన క్రొత్త సంస్కారాలు సర్వదా వాంఛనీయమనే ధోరణి ఈ గ్రంథంలో స్పష్టంగా చూడగలం. అటువంటి సంస్కారాలకు దోహదం కలిగించే సందర్భాలనుకూడా ఆర్ష సంస్కృతినుంచి ఉద్ధరించి అందించే ప్రయత్నంచేశారు గ్రంథకర్త.

ఉదాహరణకు స్త్రీపునర్వివాహం (పుట 34).

"నష్టే మృతే ప్రవ్రజితే
క్లీబేచ పతితౌ పతౌ
పంచ స్వాపత్సు నారీణాం
పతి రన్యో విధీయతే"

(పారాశరస్మృతి 4-30)

వర్ణవ్యవస్థ, వృత్తులలోని న్యూనతాధిక్యముల భ్రాంతి, స్త్రీశూద్రాదులతోసహా సర్వులకు వేదాది విద్యావ్యాసంగం, వర్గవైషమ్యరాహిత్యం, ప్రజాస్వామ్యం మొదలైన అనేకవిషయాలలో గ్రంథకర్తకు స్పష్టమైనఅభిప్రాయాలున్నాయి. వీటిలో అనేకం వారి సంస్కారానికి ప్రబల నిదర్శనాలుగా గోచరిస్తాయి.

దేశముయొక్క సర్వసౌభాగ్యానికీ మూలం గ్రామసౌభాగ్యం. అది ఆర్య సంప్రదాయబద్ధమైన కుటుంబ వ్యవస్థమీద ఆధారపడివున్నది. కనుక ముందుగా కుటుంబవ్యవస్థను బాగుచేసుకోవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

అందుకు ఈ 'ఆర్షకుటుంబ' మనే గ్రంథం ఎంతైనా ఉపకరిస్తుంది.

శ్రీ ప్రసాద్‌గారిచేత 1954లో రచింపబడిన ఈ గ్రంథం వ్రాతప్రతిని 'ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయం పరిశోధనాలయం' వారు తమ 'వ్రాతప్రతుల కొనుగోలు సంఘం' ద్వారా ది 2–3–1977న కొనుగోలు చెయ్యటం జరిగింది*. దాని నిప్పుడు ముద్రించే అవకాశం కలిగింది.

భారతీయమైన సంస్కృతిపునరుద్ధరణకు దోహదంకలిగించే ఈగ్రంథం సంస్కృతిప్రియుల నందరినీ అలరించగలదని నా ఆశంస.

'ప్రాచ్యలిఖిత గ్రంథాలయం, పరిశోధనాలయం' ద్వారా ఇటువంటి గ్రంథాల ప్రచురణకు అవకాశం కలిగిస్తున్న ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి నా హృదయపూర్వక కృతజ్ఞతాంజలి.

వాసిలి వేంకట లక్ష్మీనరసింహారావు,
డైరెక్టర్,
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత
గ్రంథాలయం, పరిశోధనాలయం.

1–11–1983,
హైదరబాదు–7

---

* ఈ గ్రంథాలయంలో 'ఆర్షకుటుంబము' వ్రాతప్రతి ఆక్సెషన్ నంబరు-3710 కాల్ నంబరు – T 10–8.

# ఆర్ష కుటుంబము

## తొలి నివాళి

# ఆర్ష కుటుంబము అంటే?

ఋషియే ఆర్యుడు. ఆర్యపదమునకు — "పూజ్యుడు — ఆచార్యుడు — అతిథి — సంస్కారి — గృహపతి (కుటుంబి) — పెద్దమనిషి'' మొదలైన అర్థాలు కనిపించును. కొంచెమంత లోతుగా ఆలోచిస్తే ఇది కర్షకున కన్వయిస్తుంది. ఈ మాటను ఐతిహాసికు లంగీకరింపక పోవచ్చు, కాని దానిజాడ లుండనేయున్నవి. ఈ విశ్వాసము గలవా రుండినూ ఉన్నారు.

ఈ దేశములో (భారతదేశములో) ద్విజాతులో — బహుజాతులో ఉండి రనుట స్పష్టమైనది కాదనుకొందును. ఈ భావనలే సమాజములో పొరపులు పొసగించుచున్నవి. వాని దుష్పరిణామమూ అనుభవించినాము.

ఆర్యపదమును జాతిపరముగా మున్ముందుగా అనువదించినవారు మాన్యులు శ్రీమాక్సుముల్లర్ (Maxmuller) పండితులు. అయితే వీరుకూడ ''ఋ'' ధాతువు నుండి "ఆర్య'' రూపము పరిణమించినదని "ఋ" ధాతువునకు "దున్నుట" అర్థమని, "అర్య" అను హ్రస్వరూపమే "ఆర్య" అను దీర్ఘరూపముగా పరిణామమొందినదనీ అంగీకరించినదే! తరువాతివారు ఈ ధాత్వర్థము నట్లుదాహరించినవారూ ఉన్నారు.

నేడు విలక్షణంగా కనుపించినా వైశ్య లొకానొకనాడు కర్షక వృత్తి గలవా రనుట స్పష్టమే. ఆనాడు వారిని ''అర్యు'' లనేవారు. నేటికీ కొందరు తాము ఆర్యవైశ్యులమని చెప్పుకొందురు. కనుక ఆర్యులు కర్షకులు—రైతులు. ఈ ఆర్యుడను పదమే క్రమముగా "ఆర్య'' గా అయినది. భాషలో ఇట్టి పరిణామములు సహజమే. "అంధ్ర" పదము నేడు "ఆంధ్ర''గా వ్యవహరింపబడుచున్నదిగదా! ఇంకా ''అర్య''పద మెక్కడున్నా విశేషణముగానే కన్పి

స్తుందిగాని విశేష్యంగా లేదు. అందుచే "ఆర్య" శబ్దము ఒకదాని గుణముల తెలుపునదే యగును. కాగా ఈ ఆర్య శబ్దము కర్షక వృత్తి పరమే గాని జాతి పరముకాజాలదు.

## ఆర్షకుటుంబము

మన వేదవాఙ్మయంలో ఆర్యశబ్దము జాతిపరముగా నున్న ప్రయోగములు కనిపించవు.

ఇంకా తాము కర్షకులమనీ తమది కర్షకులదేశమనీ వారే సగర్వంగా చెప్పుకున్నారు. సంధ్యావందనములో "మిత్రః కృష్టీ రనిమిషాభిచష్టే" అని కలదు ఇందలి కృష్టిశబ్దమునకు సహజంగా కర్షకుడని అర్థము. అథర్వణ వేదములో "కర్షకు లెక్కడపుట్టిరో" (యస్యా మన్నం కృష్ట య న్వంబభూవుః- అథ 12.1.4) అది తమ దేశ మనిరి. సంస్కృతికన్న తొలికాన్పు కృషి. నాటికే కాదు, నేటికీ ఇది ప్రముఖమైనదే ఈ వృత్తి లేనిచో మనుగడే లేదు.

ఇంతటి ప్రధానమైన వృత్తిగాన వారు దాని నత్యంతమూ గౌరవించిరి. అవృత్తి నిర్వహించుట ఒక పవిత్రధర్మముగానూ తలచుచుండిరి. ఈ వృత్తి గలవారిపై గురుతరబాధ్యత లుండెను. ఇది కేవలము—తనకోసము — తనవారి కోసమే గాదు. లోకమును తినిపించి భూతతృప్తి గావించి తనవారు తాను అనుభవించవలసినది. త్యాగము, భూతభావన (తనవంటివే యితర ప్రాణులూ అనేదృష్టితో లోకమును పరామర్శించుట) విశ్వ సౌహార్దము లీవృత్తికిగల ధర్మ గుణాలు. ఈ వృత్తి ధర్మములు, గౌరవములు గూర్చి ఉత్తేజకములైన ఆదేశము లిచ్చుచున్నది. (ఋగ్వేదము—ఋ—4-57-1-3; X—'17). ఊర్జితములు, ఉదాత్తములు అయిన యీధర్మములనుబట్టియే "ఆర్య" శబ్దమునకు "పూజ్యత" మొదలైన అన్వయములు అర్థములు రూఢములై యుండును ఆ ధర్మముల దప్పినవారి నెల్లరనూ "అనార్యు"లనుచుండిరి. ఈ ధర్మముల పాలించుచుండువా రెల్లరూ ఆర్యులని వ్యవహరింపబడిరి. ఈ మర్యాదల ననుసరించి జీవయాత్ర సాగించు చుండు గృహస్థు కుటుంబము ఆర్షకుటుంబము. ఇటుపై దాని తీరు తిన్ననల తిలకింతము.

## ఆర్షకుటుంబము

# ఆర్ష కుటుంబము

## మలినివాళి

# ఎప్పుడు ?

ఈకాల మగమ్యము, అగోచరము. అంతటి పురాతన మది. ఇతిహాసపూర్వకాలమునుగురించిన దేది తడవినా ఇంతే! భారతీయ సాంప్రదాయిక విశ్వాసము కాలప్రవాహ మంతులేనిదని. అనేక ప్రళయాలు మహాప్రళయాలు జరిగిపోయినవి. ఆ ప్రళయాలు, మహాప్రళయాల పరంపరలో ఎన్నో సృష్టులో త్తిగిల్లిపోయినవి. అట్లే ప్రతిప్రళయ — మహాప్రళయముల వెన్నంటి మరల మరల — సృష్టులు మోసులెత్తినవి. ఇట్టీ కాలచక్రము అంతు లేకుండా క్రిందు మీదులుగా తిరుగుచున్న దందురు. ఒక మహాప్రళయము తరువాతి ప్రళయములలో చివరి ప్రళయపు నాలుగుయుగాలతోడి కాలమిపుడు నడుచుచున్నదని వారి మతము. ఈ చాతుర్యుగమానము ఆద్యంతములు 10-12 వేల సంవత్సరములు.

ఈ లెక్క ప్రకారము గడచిన ప్రళయము తరువాత మరల సృష్టి మొదలైన కాలము దాదాపు పదివేల సంవత్సరముల క్రిందట. అదే కృతయుగారంభము.

భూగర్భపరిశోధకులూ, నిక్షేపపరిశోధకులూ, చిట్టచివరి—హిమప్రళయపు కాలముగా వేసిన అంచనాలు దాదాపు ఈ కాలములోనే అందుకొంటున్నవి. మాన్యుడు హెచ్. జి. వెల్సు పండితుడు ఉత్త ఈ శిలాయుగంగా చెప్పు కాలమూ దాదాపు దీనికి సరిపోవును. మానవులు పాశవికావస్థనుండి సంస్కృతి వైపునకు మొగ్గుచున్న (వైజ్ఞానికుల మతం) తొలినాళ్ళవి. కాన ఇప్పటికి పదివేల యేండ్ల క్రిందటే కర్షక సంస్కృతి వెలసినది.

ఆర్షకుటుంబము

ఇక మనదేశమున పురాతనముగా సంస్కృతి నెలవుకొనియే యున్నది. ఆనాటి సాంస్కృతిక దేశముల సంస్కృతు లెంతటి పురాతనములో మనదేశ సంస్కృతీ అంతటి పురాతనమైనదే. క్రీ.పూ. 3000 సంవత్సరములకు ముందే యీ దేశమున సంస్కృతి సభ్యతలు వికసించియున్నవని పురాతత్వనిక్షేపములు తెలుపుచున్నవి. ఆనిక్షేపాలలో గోధుమలూ లభించినవి. ప్రపంచ వాఙ్మయ మంతటికీ పురాతనములు మన వేదములు. ఈ వైదిక కాలము గురించి వాద వివాద మెంతో కలదు. పాశ్చాత్యవిద్వాంసులు, వారి ననుసరించిన కొలది మంది భారతీయైతిహాసికులు, వైదిక కాలమును మిగుల కుదించిరి. వారి గుణకారములు సరియైనవి కావని మన దేశీయ విద్వాంసులు విమర్శించిరి. ఈ వైదికకాల గుణకారమును ప్రాచ్యవిద్వద్వతంసము లోకమాన్య బాలగంగాధర్ తిలక్ మహాశయు లొకక్రొత్త యుపపత్తితో నిరూపించిరి. అది ఖగోళ గణితము. ఉన్నదిగదా నానుడి! “పంచాంగాలు పోయినా నక్షత్రాలు పోవు” అని. అట్లే వేదాలలో పేర్కొనబడిన ఆయా నక్షత్రాల స్థానముల గుణకారముతో ఆ కాలమును నిరూపించిరి. ఋగ్వేదములో “విషువు” పునర్వసులో ఉండుట పేర్కొనబడినది. కాగా క్రీ. పూ. 6 వేల ఏండ్ల క్రిందటే అట్టిస్థితి పొసగును. కాన వైదిక కాలము క్రీ పూ. ఆరువేల సంవత్సరములకు తగ్గదని వారు నిరూపించిరి. వేదములలో కృషి, పాశుపాల్యము, వాణిజ్యము, సామాజిక వ్యవస్థలు వికసించి, సంస్కృతి పుష్టిగొన్నతీరు స్పష్టంగా కనిపిస్తున్నది. క్రీ.పూ. 6 వేల సంవత్సరముల నాటికే మన ఆర్షప్రజ కుటుంబ వ్యవస్థ కుదురుకొన్న దనదగును.

# ఆర్షకుటుంబము

## మూడవ నివాళి

# ఎక్కడ?

ఇతిహాసకాలమున కెంతో యెంతో పూర్వముగాన ఈ విషయమూ నిక్కచ్చిగా నిరూపింపరానిదే. ఈ విషయమున వాదవివాదా లెన్నో ఉన్నవి. ఇట్లు గజిబిజిగా నున్న వాదాలలో నిశ్చయ మెట్లు కుదురును? అయితే నేదేమో "ఆర్యులు ఈ దేశీయులు గారు వలస వచ్చినవా"రనే వాదము చెల్లుబడి యగు చున్నది. ఆబాల్యంగా పాఠశాలలలో ఈ భావము విద్యార్థుల మస్తిష్కాలపైన ముద్రిస్తున్నారు. అందుకే ఆ చెల్లుబడి. నిజానికి మన దేశ చరిత్ర ఇప్ప డున్నది నిండైన దనలేము. ఇంకెంతో పరిశోధనలు జరిపి నిగ్గు తేల్చవలసి యున్నది. మన పురాణాలనెంతో తరచి, మన సాంప్రదాయక విశ్వాసాలతో సరితూచి పౌరాణిక కథల కన్వయములు, అన్వర్థములూ కుదురుకొల్పవలసి యున్నది. అట్లే వైదిక ఋషులు, రాజన్యుల విషయమున పరిశోధనలు గావింపదగియున్నవి. ఇంకా అతిపురాతనముగా ఈ దేశమున కానాటి సభ్య దేశములతో సంబంధమున్నది. కాన ఆ సభ్య దేశాల పురాతన చరిత్రనూ సంప్రతించదగును. వైదిక రాజన్యుల రాజ్యములు మధ్య ఆసియా, ఆఫ్రికా మొదలైన చోటులకూ వ్యాపించినవని కొందరు తలంచుచున్నారు. వైదిక రాజన్యుల పేరులు, ఆ రాజవంశములు, మధ్య ఆసియాలో కనుపించుచున్నవట. అదట్లుండనిండు!

అసలు ఆర్యులు తామెక్కడినుండో ఈ దేశమునకు వలస వచ్చినామని వారి వాఙ్మయంలో ఒక్కముక్కైనా చెప్పుకోలేదు. అయినప్పుడు వారిని వలసవచ్చినవారుగా ఏల దలచవలెను? ఇండాలజిస్టైన జిమ్మరుగారు( zimmer the Indologist) అంటారు. "వైదికార్యుల నిజనివాస మింకెక్కడో వెలుపల నున్నదని చూపుటకు వేదాలలో నేమీ కనిపించదు," అని. శ్రీ జెనైడి, ఎ. రగోజిన్‌గారి (Sri Zenaide A. Ragozine) మాటలువినండి "ఇంకా

వారు అసంస్కృతులో అర్ధ సంస్కృతులో అనిగాని దేశద్రిమ్మరులనిగాని నిరూపింప వీలు పడదు. వారి విజ్ఞాన వికాసములబట్టి వారు దేశద్రిమ్మరు లన రాదు''. వారిది పశుసంపద. అవి మేకలు, గొఱ్ఱెలవలె దేశద్రిమ్మరితనమున కనువైనవి గావు. కనుక ''పశుసంపదగల ఆర్యులు దేశద్రిమ్మరులు గారు'' అని. ఇంకా శ్రీవివేకానందులవారు (పారిస్ ఎగ్జిబిషన్ 1899—1900 శ్రీ వివేకానందుల ఉపన్యాసము), శ్రీ కావ్యకంఠగణపతిశాస్త్రి గారూ, మొదలైన వారు కొందరు, ఆర్యులీదేశీయులే(భారతదేశమునబుట్టి భారతదేశమున పెరిగిన వారే) ఏదేశమునుండో యీదేశమునకు (భారతదేశమునకు) వలస వచ్చిన వారు కారని విశ్వసించు సుప్రసిద్ధులింకా కొందరు కలరు.

అసురులు—అనార్యులు- మొదలైన కొన్ని పదాలను వాఙ్మయమునుండి యెత్తిచూపి వీటి నేమంటా రని ప్రశ్నింతురు. ఈ మాటలను బట్టి వారు భిన్న జాతిగా భావిస్తున్నారు. అసురులూ అనార్యులూ భిన్నజాతీయులుకా రందురు. వారు ఆర్యులలోని భిన్నసంప్రదాయముగల గణముల (తెగల) వారేగాని వేరు కారు. ఇంద్రుని గూడ "అసుర" అని సంబోధించిన దొకచోట ఋగ్వేదము. ఆర్యుడన్న మాటను గురించి వెనుకనే (ఒకటవ ప్రకరణంలో) వివరించితిని. ఆర్యధర్మములు పాలించని వాడల్లా అనార్యుడే. రాక్షసులు వేరుగారు, ఆర్యుల బాంధవ్యం స్పష్టంగా కన్పిస్తున్నది వారికి. చూడండి : రావణుని తండ్రి పులస్త్యు డార్యుడే. కంసుని తండ్రి ఉగ్రసేను డార్యుడే. శిశుపాలుని బంధువు లార్యులే. ఇంతదేనికి ? శ్రీకృష్ణభగవానునికే వీరు రక్తసంబంధులు. ఇట్లే నాగులు, గరుడులు మొదలైనవారూ ఆర్యులలోని భిన్నగుణాలవారు. అది చెప్పవలెనంటే చాలా పెరుగుతుంది.

ఇంతకూ ఆనాటి భారతీయు లీజాతి భేదము నెరుగరు. ఆర్య సంస్కృతి సభ్యతల ననుసరించిన వారంతా ఆర్యులుగానే వ్యవహరింపబడిరి. ఆ ఆర్య సంస్కృతి కర్షక సంస్కృతియని వెనుకనే తెలిపితిని. ముక్కు, మూతి, నుదురు, తలలతీరుతీయములతోగాని ఒడలి చాయలతో గాని ఆర్యత్వపు టవ ధుల నాకట్టలేదు వారు.

ఆర్యకుటుంబము

# ఆర్షకుటుంబము

## నాల్గవ నివాళి

# మానవావతరణము మానవోదయము

మానవ సమాజమంతా మూలములో ఒకే మిథునమున (స్త్రీ—పురుషుల జంట)కు కలిగిన సంతానపరంపరనుండి విస్తరించినదని మొన్నమొన్నటి దాక విశ్వసించుచుండిరి. ఈ విశ్వాసము ననుసరించి ఆది నర సమాజమేదో ఒకే చోట వెలసిన దనవలెను. ఆ ఆదిమ నరజన్మడోలిక యేచోటనో నిశ్చయించుటకూ కొందరు యత్నించిరి. ఆ కృషిచేసినవారు నరుని పురిటిల్లు నిరూపించుటలో తల కొకతావును చూపిరి. మన కాశ్మీరమునకూ ఆ గౌరవస్థానము పొందించిన వారు ఉన్నారు.

ఈ తలపులు తగవని ఇటీవల క్రొత్త వాద మొకటి వెలసినది. శ్రీ డార్విన్‌గారి పరిణామ వాదము ననుసరించిన దిది. మానవ సమాజ మొకే మిథునపు సంతానము గాదు. అనేక మిథునము లాదికాలముననే తమతమ సంతానముల పెంపొందించిరి. నరు డొక్కసారిగా ఊడిపడలేదు. పరిణామశీలమైన దీజగత్తు. ఈ జగత్తులో పరిణామ పరంపరల పట్టుగొనియే నరుడూ తన రూపమును దాల్చినాడు. ఇతరజీవు లన్నిటి వలెనే నరుడూ పరిణామ మొందిన జీవియే. అయితే పరిణామ సోపానాలలో నరు డింకా పైమెట్టున మెట్టినాడు. వానరపు దాయాదియే నరుడు. కోతిగా పరిణమించిన జీవులు అటుపైన మరికొన్ని పరిణామ దశలను క్రమముగా నందికొని నరులుగా పరిణమించినవి. వీని యీపరిణామ పరంపరలో వానరమునకు నరునకు నడుమింటి పరిణామ దశలందు వానర—నరుల కలగలపు రూపము లుండియుండును. వారిని వానరనరు లనవచ్చును. అయితే ఆరూపముల తెలుపగలవి లభించుటలేదు. ఆకొక్కెములూడి కనుమరుగైనవి. ఇంకా ఆదిమానవు లొకేతావుననే అవతరించనూ లేదు. వానరులు నరులుగా పరిణమించ దగినట్టు

లెప్పుడెప్పుడు, ఏ ఏ తావుల పరిసరాల పరిస్థితులు ప్రబలునో అప్పుడప్పుడు ఆయా తావులనల్లా నరులు వెలసినారు.'' అని ఆవాదము.

డార్విన్[1] గారిపరిణామవాదము నంగీకరిస్తే వీరి యీనిరూపణము సంభావ్యమే ఇది యొప్పిదమైతే ఆ వెంటనే నరు లొకేతావున గాక వేరువేరు తావుల వెలసి రనక తప్పదు. ఇట్లు ఆది మానవ పరిణామ మంతా ఒకే తావున గానట్లేయొకే సమయాన జరిగినదీ కాదనవలె. వేరు వేరు సమయాలలో జరుగుటా సంభవమే.

ఆదిమనరులు సమజీవులుగా నుండిరని కొందరుతలచుచుండగా ఎవరంతట వారే జీవించువారని మరి కొందరు తలచుచున్నారు. అంటే నరుడు సమాజ జీవియని, కాదని వివాదము. ఇది తెమలనిదే. అయినా ఒక విషయ మాలోచింపదగును. సృష్టిలో సమాజ జీవితమే ప్రకృతి నియమమేమో! జీవులలో అనేకము సమాజజీవులే. తిర్యక్కులు, పక్షులు, తుదకు, పిపీలికములు, మక్షికములు సంఘజీవులే. కాగా బుద్ధి విశేషంగల నరుడు సంఘజీవి కాకుండెనా?

నరుడు సంఘజీవియే యనుకొందము. కాని ఆ ఆదికాలపు సాంఘిక జీవితమంతగా నిబ్బరమైనది, నిలుకడైనదిగా నుండక పోవచ్చు. అవసరమైనప్పుడు విడిపడి యొంటరిగా తనవెరవు దాను చూచి కొనుచూ ఉండి యుండవచ్చును. ఇంకా ఒకే సంఘము నంటిపెట్టుకొని యుండక ఎప్పటి కేసంఘము అందుబాటో, ఆ సంఘమున జేరుచుండుటా సంభవమే. వ్యక్తులు సేకరించిన సంభారాలను సమిష్టిగా ననుభవించు టనునదీ లేకుండి యుండును.

ఆనాడు నరుడూ మృగాలవలెనే యెప్పటి భుక్తి కప్పుడు సేకరించుకొని దాని ననుభవించుటే నేర్చెను. రేపటి కనేచూపుతో సంపాదించి దాచికొనుట నెరుగడు. ఆపైన స్త్రీ పురుషుల బంధాలు లేవు. పోషించువాడు పోషింప బడు

---

1. డార్విన్‌గారి సిద్ధాంతములు నిర్దుష్టములుగా వనువా రున్నారు.

వారు అనే బాధ్యతలు, సత్వాలు(హక్కులు) లేవు కనుక ఎవరి పొట్టతిప్పలు వారివే. కాగా నెవరికందినవి వారే అనుభవించుచుండి రనదగును. ఈ తీరున కేవలమూ, వ్యక్తి జీవితము కాని విలక్షణ జీవితముగలవా రనుకొందము.

ఆనాటి వీరి అవసరములూ చాలా పరిమితమే. నాడు వారికి కావలసిన సంబారములు ప్రకృతి కొల్లలుగా నొసగుచుండెను. సంఘమున కంటె ఎంతో విశాలముగా నాడు దేశ ముండేది. కాన ఒకచోట సంబారాలు సన్నగిలితే అవి పుష్కలముగా గల మరొక తావునకు తరలువారు. ఎవరి అవసరములు వారే సేకరించుకోవలె గాన అందరూ శ్రమచేయుచుండిరి. అందుచే వారు దృఢ కాయులు, ఆరోగ్యవంతులుగా నుండిరి సాహసులుకూడ. దీర్ఘజీవులై, స్వేచ్ఛా ప్రియులై యుండిరి. అవసర వస్తు సంచయము ప్రకృతియే కొల్లగా నిచ్చు చుండగా - ఆస్తి పాస్తుల ఆరాట మెందుకు ? ఆ గొడవ లేనందునా, స్త్రీ పురుషుల బందాలు, పోషణ బాధ్యతలు లేనందున, లోభము, మోహము, క్రోధము—ఈ పీడ వారెరుగ రనవచ్చును. వీని బెడద లెప్పుడు లేవో అపుడే వా రాడితప్ప నవసరముండదు. ఇట్లు సత్యసంధులగుటచే వారి కానా దేవ్యవ స్థల యక్కరా లేకుండెను. మనదేశమున నిట్లు కృతయుగపు చరమ కాలా ననే సంఘజీవితము, కుటుంబములు కుదురుకొనసాగినవి.

ఐదవ నివాళి

# కుటుంబము

అంబుజసూతి యేర్పడ గృహస్థ సమర్థముగాఁ బ్రవృత్తి ధ
ర్మం బొనరించె నార్యజన మాన్యము, దాని తెఱంగు చాల సూ
క్ష్మం బతికాంక్ష లేక తగు కాలమునన్ సమచిత్త వృత్తి ని
త్యంబున ధర్మముఖ్యముగ నర్థముఁ గామము నల్పు టొప్పగున్.
(భార - అను - ఆ - 5, ప ॥ 30)

క్రమ క్రమముగా సంఘము పెద్దదైనది. వివేకమూ వికసించినది. సకల జీవకోటికి సమాదరణీయము ఆహారము. దాని కాలంబనము కృషి, ఆద్య వృత్తి ఈ వృత్తి నభ్యసించిరి. దానితో వారి జీవిత విధానములో, మార్పు వచ్చినది. స్థిరావాసములు వివాహ బంధములు మొదలైన సంస్కారము లేర్పడినవి. తత్త్వాభినివేశము గలిగినది. వీనితో ''కుటుంబ'' మనే సంస్థ రూపొందినది.

ఈ కుటుంబ సంస్థ అన్ని దేశాలలోనూ ఉన్నది. బాహ్యలక్షణములబట్టి పరికిస్తే అన్ని దేశాలలోని కుటుంబాలు ఒకే మచ్చువిగా కనుపిస్తవి. ఆస్తి పాస్తుల నార్జించుట రక్షించుట ఆలు బిడ్డల పోషించుట పాలించుట, సంతానము గనుట, మొదలైన ధర్మాలే అన్నిదేశాల కుటుంబాలలోనూ సహజంగా గోచరిస్తవి. లోతుగా చూస్తే ఈ కార్యకలాపాలన్నిటా ఆర్షకుటుంబపు లక్ష్యం వేరుగానే కనుపించును.

ఆర్షకుటుంబి ఆస్తిపాస్తుల నార్జించినా, దానిని రక్షించినా, ఆలు బిడ్డల పాలన పోషణములు జరిపినా, సంతానముగన్నా మరేమి చేసినా వాట

న్నిటా ''ఈ వ్యాపారం నా కోసమే కాదు. విశ్వవిభున కర్పిస్తున్నాను" అనే హృదయ స్పందనం స్ఫురిస్తూఉంటుంది. అదే నిష్కామ వ్యవసాయము.

ఇట్లు విలక్షణమైనది ఆర్షకుటుంబము. ఆర్ష సమాజమున కదే పునాది. ఆర్ష సమాజపు సర్వస్వమూ దాని నుండియే అనలు సాగినవి. వారి సాంఘిక ఆర్థిక రాజనైతిక ధార్మిక ఆధ్యాత్మికాది సమస్త సంస్కృతికీ, సంస్కారములకూ ఇందే ఒజ్జబంతులు. ఈ సంస్థ బాధ్యతలూ హెచ్చే. సమాజపు ధారణ పోషణలే (ఉనికి — మనికి) ధర్మము ఈ ధర్మము, ప్రేయము — (ఐహికము = ఇంద్రియాలకు హాయి యనిపించునది.) శ్రేయము (ఆధ్యాత్మికము= ఆత్మకు నిజమైన తుష్టి కలిగించేది) అని రెండు తీరులది. వీనిలో శ్రేయో ధర్మమే లక్ష్యము కాదగినది. అయితే ప్రేయోధర్మమును తిరస్కరింపమని కాదు. శ్రేయోధర్మమునకు వికటింప కుండునట్లు ప్రేయోధర్మమునూ దిద్దికొని యనుభవించు కౌశలమును సాధన చేయుట యీ కుటుంబ సంస్థ లక్ష్యము.

వీరి సాంఘిక వ్యవస్థలు క్రమవిభజనమనే సూత్రముతో రూపొందినవి. వీరి సమాజమున కాద్యవ్యవస్థయైన కుటుంబముననూ ఈ శ్రమ విభజన కుదురుకొని యున్నది. వారి తాత్త్వికభావనలే వారి కీశ్రమ విభజనపు ప్రేరణ గలిగించిన వనుకొందును. ఈ విశ్వవ్యాపార మపారము. బృహత్తరమైన ఈ సమిష్టి వ్యాపారమునంతా భూత పంచకము నిర్వహిస్తున్నది. ఆ నిర్వహణములో నొక్కొక్క భూత మొక్కొక్క వ్యాపారము ధర్మము శ్రమను పంచుకొని పూటపడి నడుచుచున్నవి. ఇంకా అవి దేనివ్యాపారం, శ్రమ ధర్మం, దానిదే తప్ప మరొక దాని వ్యాపారములో కల్పించుకొనవు. అట్లని, వేని కవి యెడ పెడ మొగములుగానూ మెలగవు. పరస్పరము సహకరించుకొంటూ సమిష్టి విశ్వవ్యాపారమును క్రమము దప్పక నిర్వహిస్తున్నవి. ఇట్టివి నియమ నియమితము సమిష్టిహితమును గమనించి దేని వ్యాపారము నది నిర్వహించుటచే విశ్వకల్యాణ మొదవుచున్నది. జీవి శరీర విధానము పరిశీలించినా, ఈ శ్రమ విభజనమే కనిపించును. మానవునే చూడుడు. మానవుని జీవయాత్ర విశాలము. ఈ సమిష్టి వ్యాపారము వేరు వేరు అంగ ప్రత్యంగాల వ్యాపా

లెప్పుడెప్పుడు, ఏ ఏ తావుల పరిసరాల పరిస్థితులు ప్రబలునో అప్పుడప్పుడు ఆయా తావులనల్లా నరులు వెలసినారు.'' అని ఆవాదము.

డార్విన్[1] గారిపరిణామవాదము నంగీకరిస్తే వీరి యీనిరూపణము సంభావ్యమే ఇది యొప్పిదమైతే ఆ వెంటనే నరు లొకేతావున గాక వేరువేరు తావుల వెలసి రనక తప్పదు. ఇట్లు ఆది మానవ పరిణామ మంతా ఒకే తావున గానట్లేయొకే సమయాన జరిగినదీ కాదనవలె. వేరు వేరు సమయాలలో జరుగుటా సంభవమే.

ఆదిమనరులు సమజీవులుగా నుండిరని కొందరుతలచుచుండగా ఎవరంతట వారే జీవించువారని మరి కొందరు తలచుచున్నారు. అంటే నరుడు సమాజ జీవియని, కాదని వివాదము. ఇది తెమలనిదే. అయినా ఒక విషయ మాలోచింపదగును. సృష్టిలో సమాజ జీవితమే ప్రకృతి నియమమేమో! జీవులలో అనేకము సమాజజీవులే. తిర్యక్కులు, పక్షులు, తుదకు, పిపీలికములు, మక్షికములు సంఘజీవులే. కాగా బుద్ధి విశేషంగల నరుడు సంఘజీవి కాకుండెనా?

నరుడు సంఘజీవియే యనుకొందము. కాని ఆ ఆదికాలపు సాంఘిక జీవిత మంతగా నిబ్బరమైనది, నిలుకడైనదిగా నుండక పోవచ్చు. అవసరమైనప్పుడు విడిపడి యొంటరిగా తనవెరవు దాను చూచి కొనుచూ ఉండి యుండవచ్చును. ఇంకా ఒకే సంఘము నంటిపెట్టుకొని యుండక ఎప్పటి కేసంఘము అందుబాటో, ఆ సంఘమున జేరుచుండుటా సంభవమే. వ్యక్తులు సేకరించిన సంభారాలను సమిష్టిగా ననుభవించు టనునదీ లేకుండి యుండును.

ఆనాడు నరుడూ మృగాలవలెనే యెప్పటి భుక్తి కప్పుడు సేకరించుకొని దాని ననుభవించుటే నేర్చెను. రేపటి కనేచూపుతో సంపాదించి దాచికొనుట నెరుగడు. ఆపైన స్త్రీ పురుషుల బంధాలు లేవు. పోషించువాడు పోషింప బడు

---

1. డార్విన్‌గారి సిద్ధాంతములు నిర్దుష్టములుగా ననువా రున్నారు.

ఈ కుటుంబ సంస్థ ఆస్తులపై స్వామ్య మదొక తీరైన దనవచ్చు. కుటుంబ సభ్యులకు శాస్త్రీయంగా వారివారి భాగా లేర్పడును. కానీ ఆ భాగాలు విభజింపబడవు. అందువల్ల ఈ వస్తువు లేదా యీ భూభాగం ఈ వ్యక్తిదని నిర్దిష్టంగాదు. కనుక కుటుంబపు టాస్తిని దేనినీ ఏ వ్యక్తీ పూర్ణ స్వామ్యంతో వ్యవహరింపలేడు. అంటే వ్యష్టి సమష్టి స్వామ్యముల మిశ్రమస్వభావ మున్నది. ఇందువల్ల కుటుంబపు టాస్తికి చాల వరకు రక్షణ యున్నది. కుటుంబపుటాస్తులను కుటుంబములోని స్త్రీ పురుషులందరి హితము కోసము కుటుంబ నిర్వాహకుడు పాలిస్తూ, ఆయమును అందరి హితము కొరకు వ్యవహ స్తుంటాడు. కుటుంబ సభ్యులు వ్యక్తిగతంగాను (ఎవరికివారు) వేరువేరుగానూ ఆస్తుల నార్జించవచ్చు. అట్టి దాయా సభ్యులకు పూర్ణ స్వామ్యము కలది. అయితే ఈ స్వార్జితమునకు మూలము పైతృక ధనము(పూర్వు లార్జించి పెట్టి నది — కుటుంబ ధనం.) కారాదు. అట్లు పైతృకధనము పొత్తుంటే ఆ ఆర్జించినదీ పైతృకమగు కుటుంబధనమే యగును. కనుక వైయక్తికపు టాస్తులు చాల పరిమితము. వివాహాదులలో నిచ్చెడి బహూకరణములవంటివి యుండును.

కుటుంబములో స్త్రీలకు మాత్రము వైయక్తికంగా ఎవరికివారికి ఆస్తు లుంటవి వారివారి ఆస్తులపైన ఆయాస్త్రీలు పూర్ణస్వామ్యము గలిగి యుందురు. వీరి యీ ఆస్తులను స్త్రీ ధనమని సామాన్యంగా వ్యవహరింతురు. వివాహ కాలమున వధువునకు వైవాహికాగ్ని దగ్గర నిచ్చునవి. బంధువులు, హితైషులు ఇచ్చుబహూకరణములు స్త్రీకి సొంత ఆస్తిగా వైదిక వాఙ్మయంలో కనిపిస్తుంది. ఈ యాస్తిపై నామెకుగల అధికారము (స్వామ్యం) సూత్ర కాలమున నింకా పుష్టిగొన్నది. స్మృతి కర్తలేమో యీస్త్రీధనమును రెండు తీరులదిగా విడమరిచి నట్లున్నది(i)వైవాహికాగ్నిదగ్గర నిచ్చునది(ii) వధువు నూరేగించు నప్పు డిచ్చు నవి, వివాహసమయాన వధువుకు ప్రియపూర్వకముగా నిచ్చునవి. వధువుకు ఆమెసోదరులు తల్లి తండ్రి ఇచ్చునవి స్త్రీషాడ్గుణ్య మంటాడు మనువు. "అధ్యగ్న్యధ్యావాహనికం దత్తంచ ప్రీతి కర్మణి భ్రాతృమాతృ పితృ ప్రాప్తం షడ్విధం స్త్రీధనం స్మృతమ్ (మనుIX–194.). ఈయాస్తి నామె స్వేచ్ఛగా

నుపయోగించుకోవచ్చు. వివాహానంతరం తనవంక బంధువులవల్లనేగాని భర్త వల్లనేగాని భర్తవంక బంధువులవల్లనేగాని స్త్రీకి వచ్చు బహూకరణములు ఆమె యనంతరము ఆమె సంతానమునకు జెందును. ఆమెభర్త జీవించియున్నా భర్తకుచెందదంటాడు మనువు

"అన్వాధేయంచ యదత్తం పత్యా ప్రీతేన చైవ యత్
పత్యౌ జీవతి వృత్తాయాః ప్రజాయా స్తద్ధనమ్ భవేత్."
(మనుIX-195).

స్త్రీధనము: వృత్తి, ఆబధ్యము ననిరెండురకాల దంటాడు కౌటిల్యుడు. జీవనాధారము కోసర మేర్పడినది వృత్తి. అలంకారములు (నగలు మొదలైనవి.) ఆబధ్యము. జీవి కనుపైన యేర్పాటు చేయకనే భర్త దేశాంతరములకు పోతే భార్య ఈ ఆస్తులతో సంతానమును పోషించ వచ్చునట. ఇంకా ప్రతిరోధక (నిబంధించబడినపుడు), వ్యాధి దుర్భిక్ష భయాలను నివారించుకొనుటకూ ధర్మకార్యాలకూ భర్తకూడ ఈఆస్తులను వినియోగించ వచ్చునంటాడు కౌటిల్యుడు. అయితే భర్తవినియోగించుటకు కొన్నినియమాలను విధించినాడు. ఆభర్త ధర్మవిధిని వివాహమాడినవాడు గావలె. అట్లు వివాహితులైన దంపతులు సంతానవంతులై యుండవలె. ఆదంపతులు మూడు సంవత్సరాలుగానైనా, సయోధ్యతతో (సఖ్యతతో) సంసారము చేయుచుండవలె. ఆపైన భార్య అనుమతించవలె. గాంధర్వ వివాహితులైన వారైతే వృత్తిని (జీవనాధారం) దంపతులు కలిసి వినియోగిస్తే భర్త ఆధనమును వడ్డీతోకూడా భార్యకిచ్చుకోవలె. రాక్షస పైశాచిక వివాహితులైతే ఆ సొత్తును భర్త అపహరించినట్లే యెంచి భర్తను శిక్షింపవలె.

వివాహ సమయాన హోమాగ్ని దగ్గర వరుని వంకవారు వధువుకిచ్చు బహూకరణములు 'సౌదాయ'మని మితాక్షరు డన్నాడు. "ఈసౌదాయముపైన భర్తకు గాని, సంతానమునకుగాని, హక్కులేదు. ఆమె దానిని యధేచ్ఛగా వినియోగించుకోవచ్చు." అని మితాక్షరు డన్నా సౌదాయముగాక ఇతర సమ

యాలలో స్త్రీకి వచ్చు బహూకరణములు మొదలైన ఆస్తులను భర్త వినియోగించుకోవచ్చునంటుంది స్మృతిచంద్రిక. అయితే భర్త వినియోగించుకోవటము సామాన్యమూ, సామాన్య పరిస్థితులలోనూ గాదు. కౌటిల్యుడు చెప్పిన పరిస్థితులలోనే, ఆనియమాలకు లోబడే.

అసలు స్త్రీఆస్తిని పవిత్రముగా భావించుట అనూచానపు సంప్రదాయంగా నేర్పడినది. స్త్రీఆస్తిని వినియోగించుకొంటే వానికి సంఘంలో గౌరవముండదు. స్త్రీఆస్తిని వినియోగించుకోవటం పురుషకారమైన జీవితంగా నెంచరు

అది వివాహితలైన కన్యలకూ, కుటుంబపు సాముదాయకపుటాస్తిలో భాగ మున్నదంటవి కొన్ని స్మృతులు. కుటుంబస్త్రీ సభ్యుల పోషణా, బాధ్యతా కుటుంబపు టాస్తిని పెన్నాడి యుండును.

ఇక కుటుంబపు ఆస్తి పై వచ్చెడి ఆయము నాకుటుంబము వారు మాత్రమే భోగించుటకుగాదు. అతిధి అభ్యాగతులు, ఆర్తులు అనాథలు మొదలైనవారి నాదరించుటకు, ప్రజోపయోగమునకైన ధర్మకార్యాలకూ వ్యయించవలసిన బాధ్యత యున్నది. ఇంకా భూత (పశు — పక్షి — పిపీలికాది-జీవులు) తృప్తికీ పాలుపంచి యీయవలెను. కలవారాయాస్తులకు ధర్మకర్తలని పూజ్యులు మహాత్మాగాంధీజీ అన్నమాట కిది యదికియున్నది. మహాత్మాజీ ఆస్తిఈశ్వరునిదని అన్నారు. "ఈశావాస్యోపనిషత్తు" దీనిని కొంత బలపరుస్తుంది. అయితే నేడు కొందరు వ్యక్తి స్వామ్యమును వికల పరచగోరుచూ మహాత్మాజీ అన్న ఆమాటను పేర్కొనుట తగియుండదు. ఈశావాస్యోపనిషత్తు ప్రవచించినది.

"ఈశావాస్య మిదగ్ం సర్వం యత్కించ జగత్యామ్ జగత్"
తేన త్యక్తేన భుంజీథా మా గృధః కస్యస్విద్ధనమ్"[యజు-అ40మం.1]

'ఈసృష్టిలో నేదేది యున్నదో వాటిఅన్నిటా ఈశ్వరుడు నిండియున్నాడు. కనుక త్యాగభావము కలిగి నీవనుభవించు. ఎవరి సొత్తునకు ఆశపడకు. దీనిలో ఆస్తి కలిగియుండరాదని లేదు. లోకంలో అంతా నీవే ఆకట్టుకోవలె ననే తృష్ణ అహంకార మమకారములతో గూడిన ప్రవృత్తి నిషేధించుచున్నది.

ఆర్ష కుటుంబము

నీ కేది ప్రాప్తించినదో దానితో తృప్తిగొనుమనును. నీవు నీకుటుంబమేగాదు నీతోడి మానవులూ ఉన్నారు. అంతేగాదు, ఇతర ప్రాణులూ ఉన్నవి. వీరంతా నీవంటి ప్రాణులే. వారియెడల నీబాధ్యత లున్నవి. అవి నిర్వర్తించు' అని ఉపదేశము.

దీనినిబట్టి కుటుంబిగాని, కుటుంబ సభ్యులుగాని వారివారి పోషణ ధారణాదికములకు వ్యక్తిగతములైన వ్యయాలకు ఆస్తిని బొత్తిగా వినియోగించరాదని గాని, దైన్యపు జీవితముతో వెళ్ళబుచ్చమని గాని కాదు. లౌభ్యము (లోభము) చూపక త్యాగబుద్ధితో అనుభవింప దగినవి. అట్లని దుర్వ్యయాలు దుబారావ్యయాలు కూడా తగవు. అవి త్యాగాలు గావు. వ్యసనాలు. సత్పాత్రమైన వ్యయమే త్యాగము. కుటుంబమందలి ప్రతి వ్యక్తి కుటుంబము కోసరమేదో పని చేయుచుండనే వలె. నిర్వ్యాపారిగా కూర్చుండరాదు. అంగవికలుడో, ఆర్తుడో అయిన దప్ప ఈసేవ చాలవర కైచ్ఛికమే. బాధ్యతల గుర్తించిన ప్రవర్తనము. అసలు ఆశైశవముగా దిద్దెడి తీరే వారి కట్టి కార్యాసక్తి గలిగిస్తుంది. అది తన బాధ్యత (ధర్మము) అన్న భావము, అప్రయత్నంగానే అలముకొంటుంది. ఇతర రంగాలలోనూ ఐచ్ఛిక సేవకు ఇదే ప్రథమ శిక్ష. శ్రమ విభాగ జీవితమున కిదే ఆద్యభావం కావట్టి.

క్రమక్రమముగా వారి విజ్ఞానము కళలు వ్యాపారాలు వికసించినవి. వృత్తులు పెక్కైనవి వ్యాపకమూ ఎక్కువైనది. కాగా సమాజమును, వ్యవస్థీకరించుట కొకపథకము కావలసి వచ్చినది. దానితో వర్ణవ్యవస్థ వెలసినది. కుటుంబములో చిన్న యెత్తుననున్న శ్రమ విభాగమే పెద్దయెత్తున కుదురుకొల్పగా వర్ణ వ్యవస్థ అయినది. వర్ణ వ్యవస్థ కిట్లు కుటుంబమే యొరవడి, మాతృక యనదగును. కుటుంబపు శ్రమ విభాగము, ఆ కుటుంబ కార్యములకూ, ఆ కుటుంబవ్యక్తులకూ పరిమితము. వర్ణవ్యవస్థలో శ్రమను కొన్ని కొన్ని కుటుంబాలకు పంచిరి. ఒకే రకపు శ్రమను నిర్వహించు చుండెడి కుటుంబా వారి నందరినీ ఒక వర్ణముగా పేర్కొనిరి. కాలక్రమమున నీ వ్యవస్థలో సంకుచిత దృష్టి నెలకొన్నది. నాటి నుండి ఇది వికారమై

వికలము కాసాగినది. ఒకనా డీవ్యవస్థ నిర్వహించిన ధర్మము విస్మరింప జాలము. నా డది దేశ సుఖశాంతుల భద్రపరిచినది.

ఇదేకాదు; శ్రేణి-పూగము-నిగము మొదలైన వృత్తి,వ్యాపార, ధార్మిక, నిధి, నిర్వాహకాది సంస్థలేమి, గ్రామ పంచాయతి, నగర, పట్టణాదుల పాలక సంస్థలేమి, రాజ్యాంగ సంస్థ, సైనిక సంస్థ మొదలైన వేమి ఈకుటుంబపు మచ్చుననే వెలసిన వనవచ్చు. శ్రమ విభాగ మనేదే యిందలి ప్రధానసూత్రము. ఒక్కొక్క సంస్థ నొక్కొక్క కుటుంబముగా తలచండి. అందలి కార్య విస్తృతిని బట్టి వేరు వేరు కార్యాలను నిర్వహించుటకు కుటుంబ వ్యక్తుల స్థానంలో వేరువేరు ఉప సంఘా లుండి వాటివాటి పంతు కార్యాలను అవి నిర్వ హించేవి. ముఖ్యంగా ఈ తీరు, రాజ్యాంగంలోనూ, సైనిక సంస్థలోనూ కని పిస్తుంది. మౌర్య చంద్రగుప్తుని నాటి పరిపాలనా విధానములో సంఘాలు వాటి ఉపసంఘాలు, వాటికి, వాటికి పంచబడిన కార్యకలాపాలు చూస్తే కుటుం బానికి అందలి సభ్యులకు గల సంబంధము బాగా స్ఫురిస్తుంది. ధార్మిక (మత సంబంధమైన) సంఘాలు ఉండేవి. ముఖ్యంగా బౌద్ధులవి. వాటితీరు ఈలాగే ఆయాకార్యాలను పంచుకొని నిర్వహించుటగానే యున్నది.

ఆర్షకుటుంబము ఆలుమగలకు యుక్తవయస్సు నందుకొనని సంతా నమునకు మాత్రమే పరిమితము గాదు. అది చాల విస్తృతము. కుటుంబి, ఆయన మాతాపితలు, అవివాహితలైన కుమార్తెలు, కోడండ్రు, మనుమలు, మనుమరాండ్రు, మునిమనుమలు, మునిమనుమరాండ్రు, పితృవ్యులు, వారి పత్నులు, సంతానము, మొదలైన పరివారము, సోదరులు, వారిపతులు, సుతులు కుమార్తెలు, కోడండ్రు మొదలైన పరిజనము, కలసిమెలసి కళకళ లాడుతూ ఒకేకుటుంబముగా మెలగుచుందురు. సామాన్యంగా మూడుతరాల వరకు సమష్టి కుటుంబముగా నుండెడివారు. శ్రాద్ధంలో నాల్గవ తరాన గాని పిండ విచ్ఛిన్నము కాదు. ఇది పురాతన సమష్టి కుటుంబపు పరిధిని సూచిస్తున్నది. మూడు తరాల దాక కుటుంబాలు విభక్తములుగా నున్నట్టు కౌటిల్యార్థ శాస్త్రము (పుట. 60) నిరూపిస్తున్నది. మనదేశమున ఒక శతాబ్ది క్రిందటిదాక నిట్టి విశాల కుటుంబా లుండేవి. అనా డీవిశాల కుటుంబాల ప్రయోజన మెంతో యుండేది.

కుటుంబ వ్యయ మెంతో కూడి వచ్చెడిది. నిత్యకృత్యాలను చాలవరకు కుటుంబపుయజమానే నిర్వహించేవాడు. వ్యష్టి దృక్పథము కంటె సమష్టి దృక్పథము బాగా వికసించెడిది. అందువల్ల సామాజిక హితము కోసరమైన సాముదాయిక కార్య కలాపాలలో పరస్పరము సహకరించుకోవలెననే విశాల భావం సుళువుగా హత్తుకొనేది. కుటుంబసభ్యు లేదేని కార్యతత్పరులుగా నుండు వారు. కాన పోరుపొక్కుల రెక్కలుపు పొల్లు తలపుల కవకాశము తక్కువ. అలసుల తలపులు వేలకువేలు వెట్టి తలలు వేస్తవి. "బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయో౽వ్యవసాయినామ్" అని గీతయన్నట్లు ప్రొద్దుపోని సోమరులలోనే కీచులాటలు. "ప్రొద్దుపోని మంగలి పిల్లితల గొరుగుతాడు" అన్న సామెతగా. సదా కార్యతత్పరులై యుండగా వారికి పోరుపు లెక్కడ? వారి వారి పనుల దిద్దుకొని, విశ్రాంతి గొను నపుడు అంద రొకచోట జేరి ప్రేమ ప్రిదిలిపార నొండొరుల బలకరించు కొనుచు హృదయాలు విప్పి తమ తమ పనులలో తమకు తమ కొదివిన అనుభవాలను కష్ట సుఖాలను బాగాము లను సాధక బాధకాలను కార్యపథకముల మార్పు కూర్పులను యోగక్షేమ ములు మొదలైన వాటిని గూర్చి మాటాడు కొనుచుందురు. ఈ తీరున కుటుంబ నివేదికలు, పథకాలు, కార్యవిధానాలు, ఎప్పటి కప్పుడు సాగిపోతూ ఉంటవి. ఇదంతా మౌఖికంగానే. వారి హృదయాలూ మస్తిష్కాలే వారి మినిట్సు— యాదాస్తు పత్రాలు.

ప్రేమ దేవతకు ప్రథమార్చనా కుసుమ మిక్కడనే. ప్రేమ పవిత్రము. "ప్రేమింపదగినది కేవలము భౌతికముగాదు. దానియం దంతర్నిహితమై యున్న ఆత్మ తత్త్వము. అది పరమాత్మాంశ. సర్వతోగతము. కాన దానిని ప్రేమింప గలిగి యుండవలె. గృహస్థు తన దారసుతులను పరివారమును ఆస్తిపాస్తులను ప్రేమించినా, ఇష్టదై వాల నర్చించినా ఈ దృష్టితో వ్యవహరించుటే అలవరచి కోవలె'' అని యాజ్ఞవల్క్యుడు మైత్రేయి కుపదేశించెను. (బృహదా-5, బ్రా 4,5)

ఈ కుటుంబ సంస్థ యొక చిన్న ప్రజాస్వామిక రాజ్యము. ఇది సహజమైన సంయోజనము. సహకారముల పొలుపము గలది. దీని నిర్వహణ తంత్రము సూక్ష్మము. దీని నీతిలో తృష్ణను తొంగి చూడనీయరాదు. అట్లని

అర్థమును, కామమును తన్నివేయరాదు. అయితే వాటిని వాటికి తగిన సమయాలలోనూ-అవి ధర్మానికి వెలిగాకుండానూ-అనుభవింపదగును. ఈ రాజ్యమునకు కుటుంబి గేస్తు అధ్యక్షుడు*. ఆరాజ్యమునకు కుటుంబిని మంత్రిణి లేదా కార్యదర్శిని. ఇరుగు పొరుగు కుటుంబాలు సామంతరాజ్యాలు. గ్రామ మండలి కుటుంబాలు రాజ్యమండలి. ఈ కుటుంబ రాజ్యపు బాహ్యవ్యవహారాలు నిర్వహించ వలసిన బాధ్యత అధ్యక్షునిది. ఆంతరిక వ్యవహారాల నిర్వహించ వలసిన బాధ్యత మంత్రిణిది (కుటుంబినిది.) గేస్తురాలిని "అర్ధాంగి" అని వ్యవహరిస్తారు. పురుషుని అంగములో (శరీరములో) స్త్రీ సగభాగమనీ దానివల్ల స్త్రీని అర్ధాంగి అనుట అని సామాన్యంగా చెప్పుదురు. ఈ అన్వయ మదికియున్నదా? పురుషుని శరీరములో స్త్రీ సగమగు టెట్లు? కుటుంబ సంస్థ యొక్క సగము పురుషుడు పూని యుండగా మిగతా సగము బాధ్యతనూ స్త్రీ పూనియున్నది. కాగా ఆ కుటుంబ సంస్థకు అర్ధ (సగము) + అంగము (అవయవము=భాగము) శక్తి (బలము) స్త్రీ ఇట్లు అర్ధభాగముగా నైనది గాన "అర్ధాంగి" అని నేనంటాను. ఈ రెండు అర్ధాలు (సగాలు—స్త్రీ—పురుష బాధ్యతలు) కలిస్తేనే నిండైన కుటుంబ సంస్థ. ఇట్టి కుటుంబ రాజ్యాల సమాఖ్యలే శ్రేణులు (వృత్తుల సంఘాలు). ఆ శ్రేణుల సమాఖ్యలే గ్రామం. ఈ సంస్థలన్నీ ప్రజాతంత్రాలవే. అయితే వీటి యెన్నికల తీరు, పోటీలు కక్షల కతీతంగా పరస్పర సౌమనస్యము ఆంతరిక దృక్పథం గల చింతనలతో కుదురొందినవి. పూర్వ మీసంస్థలు నిర్వహించిన బాధ్యతలు, చేసిన లోకసేవ, న్యాయారాధనము, ధర్మానురక్తి చరిత్ర ప్రసిద్ధములు—చిరస్మరణీయములు.

ఈ కుటుంబ సంస్థకూడ కాలప్రవాహపు టొరిపిడుల నొందక పోలేదు. ఆటుపోటు లనుభవించినవే. ఆయాకాలముల కనువైన మార్పులూ కూర్పులూ కలిగినా ప్రధానమైన ధర్మధార తెంపులేక దానిలో జాలువారు తూనే ఉన్నది.

---

*. "కుటుంబాధ్యక్షః"—ఈ ప్రయోగము కౌటిల్యార్థశాస్త్రం 4 అధి. 84 అధ్యా. కంటకపరిశోధనం—సర్వాధికార రక్షణంలోది.

వారి సంస్కృతి, విజ్ఞానము, తత్త్వాభిలాష, కళాభినివేశము, రసోపాసన, త్యాగ జీవనము ఆధర్మములో గర్భితములై యుండనూ యున్నవి.

ఆర్షకుటుంబపు తీరుతీయములు కొంత తెలిసి కొంటిరి గదా! దాని కర్మ క్షేత్రపు వైశాల్యము నొకింత పరికింపుడు. ఆతురాలయము, అధ్యయన మందిరము, యజ్ఞశాల, ధర్మాసనము, పరిశ్రమాలయము, కళానిలయము. ఆర్షకుటుంబమంటే—ఇవే.

వానికి నఖిలాశ్రమ సువి
ధానంబులకును గృహస్థతయ నెలవగుటన్
దాని పదాలవ పాలి స
మానముగా దరయ నాశ్రమం బెయ్యదియున్.

(భార-అను-56.22ప.)

# ఆర్ష కుటుంబము

## ఆరవ నివాళి

# కుటుంబి

కుటుంబి ధ్యేయ మానందము పూబొత్తుల పానుపుల బొరలుటలోనూ, ఎక్కిదక్కిగా మెక్కుటలోనూ, వింతలు వినోదాలు విలాసాల వియ్యాలలోనూ లేదు ఆనందము. చెమట నోడ్చి జీవించుటలో-చెట్టుక్రింది కాపురాలలో-దరిద్ర నారాయణుల సేవలో నానంద జ్యోతి లేదూ? తన విశ్వాసం కోసరం, స్వతః స్వతంత్రతా ప్రవృత్తి కోసరం సామ్రాజ్య శక్తిని ధిక్కరించి, ఆలు బిడ్డలతో అడవుల వసించిన, మహనీయ స్వాతంత్ర్య ప్రియుడు రాణాప్రతాపుడా? విప్లవముపై విప్లవము నెమరుకొనుచూ జీవితమంతా సతమతమగుచుండిన మొగల్ పాదుషా ఔరంగజేబా? ఎవరు? హాయి నొందినవారు? త్రాసుముల్లు మొదటివారి వంకకే మొగ్గును. ఏల? ఆనంద మాధిభౌతికము కాదుగా! కొంత వఱకది మానసికము. ఇంకా చొచ్చుకొని చూస్తే ఈ రెండింటికీ దాటిన ఆధ్యాత్మికము. అది బ్రహ్మయే. "ఆనందో బ్రహ్మేతి." (తైత్తి-భృగు-వ-అ6.) అని యున్నదే గదా ఉపనిషద్వాక్యము! ఆనందము క్షణికములైన ఆధిభౌతిక సుఖాల పరిధిని దాటినది. స్వార్థమున కందు చోటు లేదు. స్వార్థపు డాగులంటని త్యాగము. సాత్త్వికపు టీవి ఆనందము కష్టాలు కాపురము పెట్టినా, నిర్వేదింపక, ఉద్వేగ మొందక, డిల్లపడక, కార్యతత్పరుడై, ఉత్సాహియై శ్రమించి, కష్టాలనే సుఖాలుగా దిద్దగల ఉపజ్ఞత ఆనందము.

ఆకుటుంబి కర్మక్షేత్రములో సామాన్యంగా నాతని నిత్యవ్యాసంగము: బ్రాహ్మీముహూర్తాన (ఉషఃకాలాన)నే మేల్కొనును. ఈశ్వరుని స్మరిస్తూ లేచును. కాలకృత్యములు దీర్చుకొనును. పిదప స్నానము చేసి శుచియై ఈశ్వరు నుపాసించును. అంతట కులవృద్ధులను పితరులను దర్శించి, వినయాభివందన మొనర్చి సగౌరవముగా వారలను పరామర్శించును. ఆతురుల నరసి.

కుశలాదిక మడిగి, వారికి వారికి కావలసిన సౌకర్యములు చికిత్సాదుల కేర్పాటులు చేయును. అటుపై గేస్తురాలు ఇల్లాలితో ఆనాటి కార్యక్రమా లాలోచించి నిశ్చయించును. ఇంటికి అవసరమైనవి ఆమె వలన దెలిసి కొని వాటి వాటికి దగిన యేర్పాటు లొనర్చును. ఆ కార్యముల నిర్వహించుట కాయా వ్యక్తులను నియోగించును. ఇక స్వాధ్యయనము (తనవృత్తి విద్యను తాను నిర్వహించుట) అధ్యాపనము (తనశిష్యగణము—కుటుంబపు బాలురూ ఇతర బాలురకుకూడ) తన వృత్తి విద్యను నేర్పుట జరుపును. ఈ అధ్యయన అధ్యాపనములే బ్రహ్మ యజ్ఞము.

కాస్త తీరిక చేసికొని ఇల్లు వెడలి పౌరవృద్ధుల గోష్ఠులకు బోవును. ధర్మకార్యాలను గూర్చి, పౌరహితమును గూర్చి మాటామంతి జరుపును. అవసరమైనపుడు ధర్మాసనములలోనూ వ్యవహరించును. మరల నిలుజేరి విధుల ననుష్ఠించి అతిథి అభ్యాగతుల కర్ఘ్యపాద్యము లిచ్చి యర్చించి ఆదరించును. అంతట భూతబలు లిచ్చును. (పశు—పక్షులు—పిపీలికాదుల కాహారము లిడుట.) అతిథి అభ్యాగతులతోనూ, కుటుంబ సభ్యులతోనూ గూడి భుజించును. అటుపై దేశ దేశాంతరాగతులు, విజ్ఞులైన అతిథి అభ్యాగతులతోనూ నాయాదేశముల విశేషములను గూర్చి ఆయావిద్యల మర్మములూ ధర్మముల గూర్చి గోష్ఠి జరుపుచూ విశ్రాంతి నొందును.

పిదప మరల వృత్తిని కాస్త నిర్వహించును. కర్షక కుటుంబి అయితే పొలము, పశుగణము మొదలైన వాటిని పరామర్శించి వచ్చుచుండును పరిజనుల పరామర్శించి వారి వారి శక్తియుక్తుల గమనించును. వారిలో జబ్బుపడిన వారికి చేతనైన సహాయ మొనర్చును; ఆదరించును. మాపట నాయాకార్యముల నిర్వహించెడి కుటుంబ సభ్యులతో గోష్ఠి నెరపును. మునుముందర వారి వారి యోగక్షేమాలు వారి వారి సతీసుతాదుల యోగక్షేమాలు వారల వారల అక్కరలు విచారించును. వారలవారల అభిమతాల దీర్చుటకు తగినయేర్పాటు లొనర్చును. అవి పొసగింప వీలుపడనిచో వాటి వాటి సాధక బాధకములను సహేతుకముగాను సాంత్వనంగాను ప్రియభాషణతో వారికి వారికి దెలియ జెప్పును. కుటుంబి ఆర్జవమే (సరళ

స్వభావం) కుటుంబసభ్యుల కాయనయెడల విశ్వాసము ప్రేమ కుదిరించును. ఇంకా కుటుంబి ఆయా కుటుంబ సభ్యులు నిర్వహించెడి ఆయా వ్యవహారాలను గూర్చి ఆయావ్యవహారాల నిర్వహిస్తున్నవారితో సంప్రదించును. ఆయా వ్యవహారాల సాధక బాధకాలూ వాటికి వాటికి తగిన నివారణోపాయాలు చర్చించి నిశ్చయాలొనర్చి వారికి వారికి సలహా లిచ్చును.

తరువాత కుటుంబ సభ్యులతో కూడి భుజించును ఆపైన విశ్రాంతి గొనుచూ అచ్చటచ్చట కుటుంబ సభ్యులతో కుటుంబపు టాదాయ వ్యయాలు న్యాయంగా న్యాయమును పెంపొందించు పెంపులు ఆలోచించును. కుటుంబ సభ్యుల కేయే విషయాల అభిరుచులు అభినివేశాలు ఉన్నవో గ్రహించి వారిని వారి నాయాకార్యాల నియోగించును.కాసేపు పిల్లలతో వినోదించును. కొంచెము సేపు గ్రంథావలోకనము. ఆ సమయమున కులవృద్ధులు స్త్రీలు పిల్లలు గూడ సమావేశమగుదురు. ఆకాసేపు అదొక వైజ్ఞానిక సభ. ఆ సందర్భంలో అనేక ఇతిహాసాలు, శాస్త్రచర్చలు, ధార్మిక నైతిక ప్రసంగాలు దొరలిపోవును కుటుంబపు పిల్లలంతా కూడి భజనలు, కోలాటలు, బాలక్రీడలు నెరపు చుండ చూచి పెద్దలు వినోదింతురు.

ఇంకా సామూహిక వినోద సమావేశాలనూ కుటుంబులు పదుగురు కలసి జరిపింతురు. ఇట్టి వినోదాలలో నిత్యమూ జరుగునది పురాణ శ్రవణము. ఇదిగాక అప్పుడప్పుడు జరిపించునవి గానసభలు, విద్వద్గోష్ఠులు, బొమ్మలాటలు, వీథినాటకాలు మొదలైనవి. ఇట్టి నిత్య నైమిత్తికములైన క్రీడలు ఉత్సవాల నింకెన్నిటినో వాత్స్యాయనుడు వివరించెను.

ఇట్లు కుటుంబి దినమంతా పరిశ్రమించి, విశ్రమించి, వినోదించి, ఈశ్వరుని స్మరిస్తూ శయనించును. ఇంతకార్యకలాపం! ఇందుకే ఇదొకచిన్న ప్రజాతంత్ర రాజ్య మన్నది.

దీనిని నిర్వహించు బాధ్యత సామాన్యంగా తండ్రి నుండి జ్యేష్ఠ పుత్రునకు జెందుతుంది.కుమారులు యుక్త వయస్కులుగాకున్న యెడల కుమారుల,

పెదతాత పినతాతలో, తండ్రి సోదరులో ఈ బాధ్యత నిర్వహించుచూ కుమారులు యుక్త వయస్కులైనపుడు జ్యేష్ఠున కాపెత్తన మప్పగింతురు. కొన్ని సందర్భాలలో ఆభారము నట్లప్పగింపక ఆ పెత్తన దారి జీవించి యున్నంత కాల మట్లే సాగనిత్తురు. ఇంకా ఒకకుంటుంబములో ఈ పెత్తనము జ్యేష్ఠుడు గాక ఇతర సోదరు లెవరైన నిర్వహింప బూనుట గలదు. వీటిని బట్టి చూస్తే "ఎవ డెందుకు తగునో వానికే ఆ పని" అన్న సూత్రమును వా రనుసరించి నట్లగుపడును. అందువల్లనే దక్షతగలవాడే ఇంటిపెత్తనమును ఈదబూను వాడు. అందుకెవరును అసంతృప్తులైనట్లు గాని, తగవులాడినట్లుగాని యగపడదు. దీనిని సంబాళించుట సుళువా?

సాంప్రదాయికపు వాసనలు, గురుస్థానపు గౌరవము, పరిసరాలు, ఎంతగా గుది గూర్చిపట్టినా వైయక్తిక తత్త్వము, స్వభావ ప్రభావము కొంత ఉంటుందిగా! అందుచే వైయక్తికాభిరుచులలోని ఏదో కొంత వైలక్ష్యమూ ఉంటుంది. కాగా ఇట్టి భిన్న రుచులను సమన్వయించి వాటికొక సమస్థాయిని ప్రతిపాదించి వ్యవహరింపవలె కుటుంబి.

కట్టగుడ్డలు కావలె నంటూ ఒక కుటుంబ సభ్యుడు. చంటి పిల్లకు జలుబని యిల్లాలి కబురు. పశువులు పంటచేను మేసినవని జీతగాని విన్నపం. పాలికాపు పా లెగబెట్ట నున్నాడని ఒక సోదరుని ఫిర్యాదు తన పొలం దమ్ము కోసరం డబ్బు ఇమ్మని మరొక సోదరుని అభ్యర్థనం. తీర్థయాత్రకు సన్నాహములు చేయింపుమని పితృదేవతల ఆదేశం. రాచకార్యములు దిద్దుటకు రమ్మని పురవృద్ధుల పిలుపు. యాచకుల యాచనలు. ప్రకృతి పిదప చూపు. ఇట్టి సమస్యలు చిన్నవీ, పెద్దవీ యెన్నో కుటుంబిని నిత్యమూ ముసిరి కొంటూ ఉంటవి. ఇలాంటి తాపులంది తకిబికియైనాడు పాపమొక కుటుంబి. ఆయన సొద వినండి.

"గురువులరాక, దాసి మృతి, గుఱ్ఱపు దాడియు, నల్లునలుకయున్,
వరసతి గర్భవేదన, వివాహము, విత్తులు చల్లు కార్తెయున్,
పొరుగున నప్పు బాధ, చెవిపోటును, వీథిని దొమ్మరాటయున్,
కఱవు, దరిద్ర, మాద్దికము కల్గనొకప్పుడు కృష్ణభూవరా॥

ఇరుగు పొరుగు కుటుంబాలు ఉపాంత రాజ్యమండలం. వారితో వ్యవహరించుటలో కుటుంబి సహనము, సౌమ్యము, సరళత్వము, దక్షత కలిగి మెలగ వలెను. ఆ ఇరుగుపొరుగుతో కుటుంబి సఖ్యము, సౌమనస్యము, విశ్వాసముల పెంపొందించుకోవలెను. వారి కష్టసుఖాల తెలిసికొంటూ వారికి తనచేతనైన సహాయ మొనర్చుచుండవలెను. ఇరుగు పొరుగు పరస్పరము సహకరించుకొనుట శాంతిమయ జీవితమున కవసరం. ఇట్టి శాంతిమయ జీవితము నభిలషించుసముదాచారమును కుటుంబులు ఉపాసించవలెను. 'శాంతి' మిగుల విలువ గలది. అది కన్న కానుపు అభ్యుదయము. ఆధ్యాత్మిక సాధనకు శాంతిమయ పరిసరా లవసరమేగదా! అల్లే ఐహికోన్నతికీ శాంతిమయ పరిసరా లవసరమే; కక్షలవల్ల కలిసి వచ్చేది లేదు. అనర్థా లన్నిటికీ అదే ఆకరం.

మునిముందుగా మనసు మలిన పడును. బుద్ధి పెడతల బట్టును. ఆరోగ్యము భంగపడును. అర్థమా వ్యర్థమగును. ఈ వ్యయంవల్ల సృజింపబడేది ప్రాణికోటికి ఉపయోగించేది యేదీ ఉండదు. అభివృద్ధికరాలు, కల్యాణకరాలు నైన కార్యపథకాల నాలోచించుటకుగాని, నిర్వహించుటకుగాని తీరికా ఉండదు. డబ్బుకూ ఇబ్బంది. గౌరవము, పరపతీ దెబ్బతినును. కనుక వైమనస్యాలకు తిరుగుడుగా ప్రేమ నారాధింపవలెను. పరహృదయము నాకళించు కొనెడి ఉపజ్ఞతే పొలుపు గూర్చును. కచ్చలూ, మచ్చరాలూ కావు. తరతరాలుగా ఈ సత్యమునే మనవారు చాటుచున్నారు చూడండి.

"ఏమి గతిఁ దలంచినం బగకు మేలిమి లేమి ధ్రువంబు కేశవా!" [ఉ.ప 3ఆ.21ప] అని యుధిష్ఠిరుడు పరితపించినాడు" "+వైరం వల్ల వైర

---

+"నహి వేరేన వేరాని సమ్మంతీధ కుదాచనం ।
అవేరేనచ సమ్మంతి ఏస ధమ్మో సనంతనో" (ధమ్మపదం)

"నహి వైరేణ వైరాణి శామ్యంతీహ కదాచన
అవైరేణచ శామ్యంతి ధర్మ ఏష సనాతనః" ధర్మపదమ్ —
యమక—5 శ్లో

మెప్పుడూ పోదు. మైత్రి వల్లనే అది శమిస్తుంది'' అని బుద్ధభగవానుని ఉప దేశము. సుహృల్లోకపు సహకారము, సంప్రదింపులు, సమన్వయాలతో సర్దు బాటులతో పొరపులను తొలగించు కోవటము ఆర్ష సంప్రదాయం.

శ్రేణులు (వృత్తుల సంఘాలు) గ్రామపంచాయతులు మొదలైనవి వరుసగా ఉన్నతోన్నత సమాఖ్యలు. వాటితో కుటుంబి పూర్తిగా సహకరించు చుండును. ఆ సమాఖ్యలు నిర్వహింప బూనిన కార్యకలాపాలలో ఆయా కుటుంబి తన శక్తి ననుసరించి చేయగలిగినది చేయవలసినది తాను చేయును. అది ఆర్థికంగాను కావచ్చు. శ్రమపూర్వకంగాను కావచ్చు. ఇంకా ఉభయ రూపాలా సహకరించుటా కలదు. ఇవి కుటుంబి విధులుగాను గౌరవించువారు.

అతడు లోకాని కాశ్రయ దాతయని ముందుగా ప్రస్తుతించినారు. విరు దింపుగానే ఉన్నది. బాధ్యతలో క్రుంగదీసేది. ఆ బాధ్యత లెన్ని తగిలించిరో చూడండి. ''*ఉత్తముల సంపద ఆర్తుల కుపకరించుట'' కని కాళిదాస మహా కవి వచించిరి ఋగ్వేదం+ చుట్టునచుఅక లంటిస్తున్నది లోభులకు.

కుటుంబి నిత్యమూ సాయంప్రాతముల విధిగా పంచయజ్ఞాలు నిర్వర్తింప వలెను. అవి (1) బ్రహ్మయజ్ఞం (2) దేవయజ్ఞం (3) భూతయజ్ఞం (4) పితృ యజ్ఞం (5) మనుష్యయజ్ఞం. యజ్ఞాలంటే పశువులను వేల్చుట కాదు. తమ తమ వృత్తులను, విద్యలను తెంపులేకుండా కొనసాగించుట. లోకసంగ్రహ బుద్ధితో దివ్య శక్తులను, తమతమ పూర్వ పితరులను స్మరించి అర్చించుట. జీవకోటిని, పేదసాదలను, అతిథి అభ్యాగతులు మొదలైన వారిని తృప్తి పరుచుటకే యీ యజ్ఞాలు. వీనిని గూర్చి తెలుపవగిన దెంతో ఉంది. అవి వేరుగా వివరింతును. ఆయా కుటుంబాల కుండు స్థితిగతులను బట్టి ఉంటుం దీయజ్ఞాల నిర్వహించెడి విస్తృతి. ఆకుటుంబపు జీవిత వ్యాపారమును కుంటు

---

*ఆపన్నార్తి ప్రశమనఫలాః సంపదో హ్యుత్తమానామ్. పూ-మే-57

+ ఋ. మం. 10—సూ 117

పరుచునంత బాహుళ్యముగారా దివి. అందుకే ఏ సందర్భంలోనూ "స్వాధ్యాయ ప్రవచనము మరవరాదని" తైత్తిరీయపు ప్రవచనం [తై–శి–అ॥–మం1]. ఇంటిలో ఇతర కార్యాలు నిర్వహించుటకు చాలిన హంగులు లేకుంచేనూ, "జీవన స్థితి కేన తావలమ్ము" అన్నట్టు తన తెక్కలపైనే కుటుంబ పోషణ జరుగవలసి యుంచేనూ ఈ యజ్ఞాలు సంగ్రహంగా జరుపవచ్చు. మొత్తాన యజ్ఞాల నేదోతీరున జరుపవలె; మానరాదు. వీనిసంగ్రహరూపమును మంత్రి అప్పన చూపెను. ఇట్లు—

క॥ "పెక్కండ్రు లేక యున్నను
నొక్క డిరువురైనఁ బంక్తి నొగిఁగుడువక తా
నొక్కండ భుక్తి గొను టది
యెక్కుడు నింద్య మనిచెప్పి రిద్ధ చరిత్రుల్॥ (చారుచర్య)

కుటుంబి బాధ్యతలను భారత మిట్లు నిరూపిస్తున్నది.

"శయనంబును, భీతున కభయంబును, దృషితునకు జలంబును, బుభుక్షితునకు నన్నంబును, శ్రాంతునకు నాసనంబును నిచ్చుట సనాతనంబైన యుత్తమ గృహస్థధర్మంబు." భా ఆ 1—31

పశువులకు గడ్డి నీరు ఇచ్చుట, ఇంటికి వచ్చినవారిని ఆదరించుట, ప్రియముగా మాటాడుట, ఇవితేలికగా అందరూ నిర్వహింప దగినవి. తనకోసరమే వండుకొనుటను, ఎవరూ చూడకుండా దాచుకొని తినుట, నిష్ప్రియోజనముగా పశువులను వధించుట నింద్యములు. వృద్ధులను చక్కగా పరామర్శింప వలెను. అతిథులను, బంధువులను, విద్వాంసులను, గురువులను, మిత్రులను, స్త్రీలను, చక్కగా ఆదరింప వలెను పశువులకు, పక్షులకు, కుక్కలు మొదలైన జంతువులకు ఆహారము పెట్టవలె. ఇది వైశ్వదేవము. నిత్యమూ సాయంప్రాతముల కుటుంబి నిర్వహింప వలెను (భార.అర. 6.1వచ.31.). మిత్రులను, పరివారమును, భృత్యులను, భుజింపజేసి అటు పిమ్మట కుటుంబి భుజింప వలెనట. ఇట్లందర నాదరించి పూజించి తృప్తుల జేయగా మిగిలినదే అమృతము—విఘసన మట. అట్టిది భుజించు వాడే అమృతాశి—విఘసాశనుడు.

ఇవిగాక కుటుంబి అప్పుటప్పుట చేయుచుండు దానాలు ధర్మాలు ఉండును. ఇవి ముఖ్యంగా ఏడు తీరులవి. వాటినే సప్త సంతానము అన్నారు. వీటితీరు చూస్తే ప్రజాహితైక దృష్టితో ప్రోత్సహించిన వని తేలును. ఈ తీరున మానవులలో గర్భితము లై యున్న సౌజన్యము, ఆర్ద్రీభావము, త్యాగ గుణములకు గిలిగింతలు పెట్టి లోకహితముల పూరించిరి. ప్రభుత్వ సహాయం కోసం పరిదేవనము చేయక ఆయాస్థానికపు టవసరాల నీతీరున ఎక్కడి వారు అక్కడే సాధించుకొనువారు. త్యాగము నిట్లు ఉన్నత స్థాయి నొందించిరి. దాని సత్ఫలితములను సమాజముచే ననుభవింప జేసిరి.

శిష్యుడు కృతార్థియై, అధికారియై (ఆయావిద్యల ప్రజ్ఞ గూర్చికొని) గురువుగారినుండి సెలవుగొనునప్పుడు ఆచార్య లుపదేశిస్తారు. ఆ శిష్యుడు భావిలో జీవిత క్షేత్రమున అడుగిడు పెట్లు మెలగదగునో సూచిస్తుం దాఉప దేశం. అదే స్నాతకం. వివరా లింకొక చోట తెలుపుదును.

పురుషుడు నాలుగు ప్రయోజనాలను సాధింపవలెనట. 1. ధర్మము, 2. అర్థము, 3. కామము, 4. మోక్షము. ఇవే పురుషార్థాలు. వారికి పరమగమ్య మేమో నాల్గవదైన మోక్షము. వారి జీవితసర్వస్వమూ దీనిలో కేంద్రీకరింప బడినది. వారివిద్యలేమి? శాస్త్రిలేమి? కళలేమి? అన్నీ దానిలో పర్యవసించును. పోగా మిగిలిన మూడిటిని ఒకదానికొకటి డీడిక్కొ లాడకుండను, ఒకదాని నింకొకటి చెరప కుండను, పొనగించి, పొందించి మూడింటినీ అనుభవించ మనును ఆర్షశాస్త్రాలు. అదే కర్మకౌశలము. ఎప్పుడైనా, ఏ సందర్భంలోనైన పొవగింపు కుదరకపోతే ధర్మమునకే ప్రాముఖ్యము. ధర్మము వారికి ప్రాణా ధిక ప్రియము. ధర్మం కోసరం వారు మహత్తర త్యాగాలు చేసిరి. ధర్మమే సత్యముగా, *సత్య, ధర్మములే ఈశ్వరుడు గానూ ఉపనిషత్తులు ప్రతి పాదించినవి. అంతటి ధర్మాభిమానము.

---

*"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" తైత్తి–బ్ర–అ–1, మం–1
"తత్సత్యస్య పరమం నిధానమ్" ముండకో 3–1–6
"బ్రహ్మణోనామ సత్యమితి" ఛాందో–8–3–4

కక్కుర్తిపడి యేతీరుననైన ధన మార్జించి, విఱ్ఱవీగుటను ఆర్షము సహింపదు. *ధర్మము దప్పకుండానే సంపాదింపవలెను. అట్లు సంపాదించిన దానిని జాగ్రత్తగా కాపాడి న్యాయంగా పెంపొందించి యోగ్యము లైన కార్యాలకే వ్యయింపవలెను. అర్థము నార్జించుట మొదలు వ్యయించుటవరకూ నియమబద్ధమే. అయితే యిది యేవో ఒత్తిడుల కొగ్గికాదు. ధార్మిక చింతతో ప్రసన్నమైన స్వబుద్ధి ప్రేరణమువలన. అట్టులార్జించిన ధనము నెందుకోసర మెంతెంత వ్యయింపదగునో వారివారి మతాలలో తెలుపబడినవి. [1]ఆయమును మూడు భాగాలు చేసి, ఒక పాలు ధర్మం కోసరము, ఒకపాలు కామం కోస రము, ఒకపాలు దాచి పెంపొందించుటకు వినియోగింప వలెనట.

(భీష్మమతము)

"సచ్చేడి [2]ఆయమున సగభాగముగాని, మూడవ పాలుగాని, నాల్గవ పాలు గాని, ధర్మము, అర్థము, కామాల కోసరం వినియోగించి మిగిలినది దాచమని'' నారదమతం. తన కుటుంబం [3]జీవించుట కెంతకావలెనో అంతా

---

*"ధర్మావహం పాపనుదం భగేశం" శ్వేతా 6—6.

''స ధర్మ స్పత్యంవై తత్" బృహదా—1—4—14.

*''అలబ్ధ మీ హేద్ధర్మేణ లబ్ధం యత్నేన పాలయేత్
పాలితం వర్ధ యేన్నిత్యా వృద్ధం పాత్రేషు నిక్షిపేత్"యాజ్ఞవల్క్యులు,

1. ధర్మేణార్థ స్సమాహార్యో, ధర్మలబ్ధం త్రిధా ధనం
కర్తవ్యం ధర్మ పరమం మానవేన ప్రయత్నతః
ఏకేనాంశేన ధర్మార్థే కర్తవ్యంభూతి మిచ్ఛతా
ఏకేనాంశేన కామార్థమేక మంశం వివర్ధయేత్' భార. అను

2. "కచ్చి దాయస్యచార్థేన చతుర్భాగేన వా పునః
పాదభాగై స్త్రిభిర్వాపి వ్యయ స్సంశోధ్యతే తవ''
(భార — సభా— నారదోపదేశము)

3, యావ ద్విత్తస్య వృద్ధౌచ జీవనం పుత్రపౌత్రపౌత్రయోః ।
తావ ద్ధనం స్థాపనీయం శేషద్రవ్యం ప్రదాపయేత్॥
—వృద్ధమనువు.

వడ్డీరాగల మూలనిధి నుంచుకొని మిగతా ధనమును ధర్మార్థ కామములకు విని యోగింప వలెను అంటాడు వృద్ధమనువు.

కుటుంబ సంస్థ బాధ్యతలు దాని నిర్వహణలో గలభారము చూచితిరిగా. దీనిని చక్కగా నిర్వహించుట కెంతటి దక్షతకావలె! కేవలమూ యుక్తి ప్రయుక్తులే చాలవు; తంత్రశక్తి చాలదు. నైతిక సూత్రాలు నిండుగా చాలవు. ఇవన్నీ భౌతికపుటవధులుగా దాటినవి గావు. వారి లక్ష్యమో యీ అవధులు దాటి యున్నదని తొలుతనే తెలిపినారు. ఆ ధర్మక్షేత్రములో వ్యవహరించవలె నంటే, ఆంతరికదృష్టి, విశ్వవ్యాపకమైన ప్రేమలూ గావలె. ఇందుకు కుటుంబి క్రమంగా సంస్కారము నొందవలెను. కొన్ని వ్రతాలను సాధనచేస్తూ క్రమ క్రమంగా కుటుంబి తన జీవితమును ఉన్నతోన్నతముగా పరిణతి నొందించు కొనును. ఆ సాధనలు లేదా సంస్కారాలనే పతంజలి యోగసూత్రాలలో అష్టాంగాలన్నారు. అవి. 1. యమము, 2. నియమము, 3. ఆసనము, 4. ప్రాణాయామము, 5. ప్రత్యాహారము, 6. ధారణ, 7. ధ్యానము, 8. సమాధి. బౌద్ధులు వీటినే శీలము లన్నారు. వీటిని వివరింప బూనితే అసలు విషయము గజిబిజి యగును. కాన వేరొకచోట వీటిని గూర్చి వివరింతును.

వీటిలో యమ నియమాలు ఆయావ్యక్తుల, ఆధ్యాత్మిక వికాసాన్నేగాదు సమాజ వ్యవస్థీకరణనూ ప్రత్యక్షంగా ప్రభావించునవి. ఆసనాలు ప్రాణా యామాలు లౌకిక జీవితానికేమి ఉపకరిస్త వంటారు. ఆరోగ్యమున కవి అమూల్య ప్రక్రియలు. కాసువీసము ఖర్చులేనివి. ఆచరణలో వాటి ప్రభావ మగ పడినది. వాటిని సాధన చేసినవా రాలాభము ననుభవిస్తూనే ఉన్నారు. వాటిని ప్రశంసిస్తూనే యున్నారు. ప్రచారమూ చేస్తున్నారు. అయితే వీటిని పుస్తక జ్ఞానముతో సాధింతామంటే సాగదు. అట్లు సాహసిస్తే ప్రమాదాలు కలుగవచ్చు, కాన గురువు పర్యవేక్షణలో గురుశిక్షణలో క్రమక్రమముగా అభ్యసించవలెను. ప్రత్యాహారం వల్ల ఉద్వేగాలు తొందరపాటు శమిస్తవి. ఇట్లు ఇంద్రియములు నిగ్రహించుట వల్ల ఆరోగ్య మొదవునుగదా ! ధ్యానం వల్ల మనః ప్రసన్నత, శాంతి, ఆత్మోన్నతి, విషయ వైశద్యము, సమబుద్ధి కలుగును. వీటి అన్నిటి పర్యవసానమైన స్థితియే సమాధి—ఆనందము.

ఆర్షకుటుంబము

శాంతి ప్రియుడు, లోకహితాభిలాషి, దేవానాంప్రియుడు, ప్రియదర్శి అయిన అశోకవర్ధనుడు జనాళి కిచ్చిన సందేశమేమి?

బంధు మిత్రుల యెడల బ్రాహ్మణుల యెడల పరివ్రాజకుల యెడల నౌదార్యముగా నుండవలెను (1వ శిలాశాసనము) "అహింస, పొదుపు,వాక్ప్రియత్వములు, మిగుల శ్రేయస్కరములు. అనృత మాడకుండుట, భూతదయ, ఆచార్యుల యెడ వినయము అనుసరింపదగును. (మూడవ శిలాశాసనము.)

"ఇంద్రియ వశీకరణము, ఆత్మవిజయము, చిత్తశుద్ధి, కృతజ్ఞత, విశ్వాసము—ఇవి మానవులకు దుస్సాధములు గావు" (రెండవ లఘుశిలాశాసనము)

"సద్ధర్మాచరణ ముత్కృష్టమైనది. ధర్మమంటే ఏమిటి? మనశ్శుద్ధి, దయ, సత్యము, శౌచము. పరోపకార పారీణతయే." (ఏడవశిలా శాసనము.)

ఇవి ఆర్షసాంప్రదాయికము లైన యమనియమాదుల సంగ్రహమే.

కుటుంబి ఈ తీరున తన బాహ్యాభ్యంతర వృత్తులను క్రమక్రమంగా సంస్కరించుకొని ఆంతరిక దృష్టి నలవరుచికొని క్లిష్టమైనకుటుంబ సంస్థలోనూ ఆనంద మనుభవించును. అతడు కర్మకుశలి, స్థితప్రజ్ఞుడు, ధన్యజీవి.

> ధర్మముఁ బల్కుచుం దగిలి, ధర్మపథంబునఁ జేసి యర్థమున్
> బేర్మియు గాంచి ధర్మవిధి బెండ్లియునై ప్రజలన్ సృజించి స
> త్కర్మములం బ్రశస్తములుగాఁ గ్రతువుల్ పొనరించు సజ్జనుల్
> ధర్మజ : యిందు నందును ముదంబునఁ గాంతు రభీష్టసంపదల్.
>
> భార—అర—అ4—వ. 178

# ఆర్ష కుటుంబము

## ఏడవ నివాళి

# కుటుంబిని

ఆనందాభిముఖంగా సాగినాడు కుటుంబి. ఈ ధర్మయాత్రలో అతనికి తోడు నీడ ఉన్నది కుటుంబిని. ఆమె సర్వదా సహకరిస్తుంది. ఈ యాత్రలో కుటుంబి సాధన సంపత్తు (శీలాదులు) లెంత ఉదాత్తములు! ఊర్జితములు! అతని సహచారిణి కూడా అంతటి ఉదాత్తములూ, ఊర్జితములూ అయిన సాధనాలు గలది కావలదా! ఆర్షసాంప్రదాయిక వివాహమునకు లక్ష్యమిదే. ఐహిక సుఖాల జుర్రుకోవలెననిగాని, ఇంద్రియాల లాలింపవలెనని గాని, కామతృప్తి కోసంగాని కాదు. వారు సంతానము నభిలషించినా ఆ ఉన్నతాశయముతోనే. వంశపరంపరకూడా వికసిస్తూ వచ్చి తమకు సంక్రమించి తాము కౌశలముతో కొనసాగించిన "స్వాధ్యాయ-ప్రవచనాలు" తమతోనే తునిగిపోకుండా కొనసాగి ముందుకు ముందుకు అల్లుకొని పోవలెననే అభిలాష. బహు సహస్రాబ్దుల క్రిందటే వెలిగింపబడిన జ్ఞాన జ్యోతి మలిగిపోకుండా మనదాకదెచ్చి అందించగలుగుట ఈ లక్ష్యప్రభావముననే. ఈ తీరున తమతమ కుటుంబాల సత్సంప్రదాయాలు, వృత్తి విద్యలు, శాస్త్రాలు, కళలు, వాటి వాటి మర్మాలు తరతరాన చికిలి దీరుస్తూ తరతరాలుగా తరలించు కొని వస్తూ ఉన్నారు.

''భార్యతో చరించుటలో గాని, సంతానముగనుటలోగాని, పాలించుటలో గాని స్వాధ్యాయ ప్రవచనాల మరవకుము'' అని ఉపనిషదాదేశము.

''ప్రజాచ స్వాధ్యాయ ప్రవచనేచ ప్రజనశ్చస్వాధ్యాయ ప్రవచనేచ
ప్రజాతిశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ" (తైత్తి-శిక్ష 9-1)

దీనిభావమూ అదే.

ఐహికములు కామ రాగాలముడులు. సత్సంతానము పడయుట కివి సాధనాలు గావు. ఉదాత్తమైన ఆశయాలు గలసంతానము కావలెనంటే దంపతులు

ఉత్తమోత్తమ సంస్కారముల నొందవలె. అవి ఇంద్రియ పూతములే గాక ఆత్మ పూతములుగానూ ఉండవలె. ఆ సంస్కారా లింకా పరస్పరమూ ఒకరితో నొకరికి బాగా పరిచితములు, ఆకళించు కొన్నవి, అనురూపాలు పెనగొన్నవి, ఆస్వాదించినవిగానూ కావలెను. దంపతుల హృదయాలు సమైక్యంగా హత్తికొని పోవలెను. ఈ ఋక్కు దానినే ప్రవచించినది· "ఈ నీ హృదయము నాదియగును గాక! నా హృదయము నీది యగును గాక!" "యదేత్ హృదయం తత్ హృదయం మమ।యదిదం హృదయం మమ తదస్తు హృదయం తవ." (మం X అష్ట 8. సూ 85—ఋ 44.41)

చిరకాల సాహచర్యము వల్లగాని ఇంతటి సమైక్యము సిద్ధించదు. డాక్టర్ గార్డెన్ విట్జ (Dr. Garden witz)గారు అంటారు*

"ఇట్టి చిరసాహచర్యమువల్ల దంపతుల ఆలోచనల సంవేదనలలోనూ, సౌమనస్యములోనూ, అభిప్రాయాల విశదీకరించుటలోనూ, అలవాట్లలోనూ, చాలా సామ్య మేర్పడును."

ఈ మహాశయమును లక్షించే వివాహము పవిత్ర ధర్మము (Sacrament) గాను, విడదీయరాని అనుబంధముగాను నిర్వచించినవి ఆర్ష శాస్త్రాలు. "ఒక మారు వివాహమైతే అది కలకాలము అట్టే ఉంటుంది." అని ధర్మ సూత్రం. ఇది ఏకపాక్షికం గాదు. వధువు కెంతగానో వరునకూ అంతగానూ వర్తిస్తుంది. శాంతిదూత మహనీయుడు ఏసు వివాహ బంధమునుగూర్చి యిట్టిభావమే కలిగియున్నట్లు కనిపిస్తుంది. ఉత్తమము, పవిత్రమునైన ఈ యాదర్శము కోసమే పాతివ్రత్యం-ఏకచారిణీ (ఒకే భార్యను కలిగి యుండుట) వ్రతాలను చాలా ప్రశంసించిరి. వాటికి ఉచ్చ స్థానము,

---

*"That husbands and wives in the course of years very frequently resemble each other, physically and that the growing harmony in their views and habits of that expresses itself in their physical features"-

'A New Race Theory' (Modern Review, August 1921)

గౌరవమును ఇచ్చిరి. అరుంధతి-సీత-సావిత్రి మొదలైన పతివ్రతా మతల్లుల పూజించిరి. అట్లే ఏకచారిణీ వ్రతులు శ్రీరామచంద్రాదులు మన్ననల నందిరి. ఇంకా ధర్మవ్యాధుడు తన శీలమును దెలుపుటలో ఏకపత్నీకతావ్రతము* నొక విశిష్ట శీలముగా చెప్పి కొన్నాడు. ధర్మవ్యాధున కున్న గౌరవము లోకప్రసిద్ధమేగా !

అయితే ఇంద్రియ దౌర్బల్య మున్న దాయె! సార్వజనీనకంగా ఇంతటి ఉత్కృష్ట ధర్మపాలనము సాధ్యమా ! అది వారు గుర్తింపక పోలేదు. ఈ కారణంగా సమాజపు వ్యవహారంలో ఒదవిన సమస్యలనూ వా రుపేక్షించ లేదు. అందుకే ఈ లక్ష్యమునకు కొన్ని అపవాదములు (మినహాయింపులు) అంగీకరించిరి. వాటికి వాటికి మర్యాదలు చేసి శాస్త్రీకరించిరి. కొన్ని సందర్భాలలో[1] కొన్ని నియామాలకు లోబడి వివాహాలు విభేదించుకోపడము (విడగొట్టుకోవటం) స్త్రీలూ పురుషులూ కూడా పునర్వివాహాలు ఆడుటకు సమ్మతించిరి. పౌరాణిక (మధ్యయుగం) కాలం నుండి మాత్రం ఈ వాస్తవిక దృక్పథం లోపించసాగినది. అయినా వేరువేరు పరిస్థితులలో వివాహ ప్రమాణాల[2] నతి

---

* సతతోపవాస నియమ
వ్రతములఁ జరియింతు నేక వనితా ప్రియుఁడన్
ఋతుకాలరతుఁడ నిందా
స్తుతులందు మనంబు నాకుఁ దుల్యత నుండున్ (అర-5-35.)

1 భర్త జాడ తెలియకపోతేనూ, భర్త మృతుడైతేనూ, సన్యసిస్తేనూ, నపుంసకుడైతేనూ, కులంనుండి వెలివేయబడితేనూ-ఈ అయిదు సందర్భాలలో స్త్రీ పునర్వివాహము చేసికోవచ్చునని నారదుడు (నారద-XII-103-97)

2 మనువు IX-17.

క్రమించి నందుకు భర్త కంటుకొనే నేరపు పరిమితికి విస్తృతమైన నియ మాలే చేసినాడు మనువు. ఆనా డంకురించిన సంకుచిత తత్వము క్రమ క్రమముగా పెంపొంది ఈ నాటికి స్త్రీస్థితిని దుస్సహంగా చేసింది. జన సామాన్యంలో మాత్రం ఆ పురాతన సంప్రదాయము నేటికీ వెల్లడిగా ఉన్నది. ''మారు మనువు'' అన్నది కొన్ని తెగలలో ఆచారంగా ఉంది. తొలి కాలాన అంతగా బహుపత్నీకత[1] అగపడనట్లున్నది. మధ్య యుగా ననే ఇది బలుపొందినట్లున్నది. కాని విశృంఖలంగా లేదు. భార్య గుణ వతియై యుండి వంధ్య అయితే ఆభార్య అనుమతి లేకుండా మరొక భార్యను వివాహమాడరా దంటాడు మనువు. భార్యపైభార్యను పెండ్లాడుటకు ఇతర సందర్భాలలోనూ చాల నియమా లున్నవి. వాటన్నిటినీ బట్టి ఆలోచిస్తే మొదటి భార్య అనుమతి పొందిగాని మరొకతెను వివాహమాడ వీలుపడ దనిపిస్తుంది.

---

1 బహుపత్నీకతను గూర్చి నా అభిప్రాయం.

ఇది ముందుగా పాటకపు జనులలో తలచూపి వుంటుంది. అది వారికి ఆర్థిక సౌష్ఠవము కోసం. సామాన్యంగా శ్రామికపు జనుల కుటుంబాలకు జనబాహుళ్యము అవసరం. ఎంతమంది జనులుంటే అంత ఎక్కువ పని నిర్వహించి అంతయెక్కువ గడింప వీలుపడును. ఆ కుటుంబానికి స్వార్జనం మీద పెత్తన ముండి, ఆ ధనమును వినియోగించుటలో కలిసి వస్తుంది. కాన బహుభార్య లుండుట వాంఛింతురు. ఆపైన రాజలోకంలో ఇది పాటు కొని వుంటుంది. వీరి వివాహాలకు రాజకీయప్రాధాన్య ముండును. 16 తీరుల ''సంధులలో'' సంతాన సంధి ఒకటి (కపాల ఉపహారాచ్చ సంతానస్సంగత స్తథా॥ ....కామందకం 9 సర్గ-2) బలియుడైన రాజు నకు తన కూతునిచ్చి పెండ్లిచేసి చుట్టరికము నెరపి ఆ మూలాన సంధి కూర్చు కొనుట సంతాన సంధి. ఇదే క్రమంగా కాముకతా భోగలాలసతలను మరి గించి యుండును. ఇట్లు శ్రమోపజీవుల కిది సంపాదన కోసంగాను. శ్రీమంతుల కిది విలాసంగా మారినది.

"భార్యా ఏకచారిణీ గూఢ విస్రంభా"[1] అన్నాడు వాత్స్యాయనుడు. దానికి "భార్యేతి గూఢ విస్రంభా" అని యశోధరులు. "భార్య అయిన స్త్రీ (అనగా పురుషుని చేపట్టిన యువతి) ఏకచారిణిగా నుండునట్టిది. తక్కిన నాయికల వలె కపట వ్యవహారాలు గలిగి యుండక గూఢమగు విశ్వాసము గలదియై" అని శ్రీపంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు వివరించిరి. వీటిని బట్టి యేమి యూహింపగలము? బహుపత్నీకతలో కంటే ఏకపత్నీకత (ఒకే భార్యతో నుండుట) లోనే ప్రేమమాధుర్య మున్నదనవలె. ఆ ఏక పత్నీకత— ఏక చారిణీత్వమే వాత్స్యాయనుని కాలాన సముదాచారముగా, మాననీయముగా నుండె ననవచ్చునా!

ఋగ్వేద కాలాన సహగమనము గాని, విధవల విరూపిణుల జేయుట గాని కనిపించదు. అథర్వణ వేదంలో సహగమన మగపడుట నిజమే. అయితే అది నిర్బంధమైన విధిగా నున్నట్టు లేదు. ఆయా స్త్రీలు ప్రేమవివశలై పతి వియోగమును సహింపలేక సాహసించి పతి ననుగమించుటగానున్నది.

స్త్రీ శీలమును[2] గూర్చి వారు పరాకాష్ఠగా నుండిరి. అయితే కృత్రిమ రక్షణ కూడదనిరి. ఆమె శీలమును ఆమెయే రక్షించు కోదగునని స్పష్టంగా చెప్పిరి. స్త్రీలకు పరదా (ఘోషా) లేదు. ఆట పాటలు మొదలైన వినోదాలను దర్శించుటకు బహిరంగంగానే వెళ్లువారు. ఉత్సవాలు, క్రీడలు, మొదలైన వాటిలోనూ పాల్గొనుచుండిరి. యుద్ధయాత్రలలోనూ రాజులతో వెళ్లుచుండిరి. రాజులతోపాటు రాణులు సభలలో కూర్చుండు వారు. ముస్లిం యుగపు తొలి కాలాన కూడ నిట్లే జరుగుచుండెను.

కుటుంబిని నిత్యకృత్యములు గమనించండి. కుటుంబి వలెనే యీమె వేకువనే ఈశ్వర పరమైన మనస్సుతో మేల్కొనును. నిత్యకృత్యముల దీర్చి కొనును పిదప ఇంటి శౌచము నిర్వర్తించి అలంకరించపలెను.

---

1 వాత్స్యాయన కామసూత్రమ్-ఏకచారిణీ వృత్తమ్.

2) "స్త్రీని బలప్రయోగంతోగాని నిర్బంధంతోగాని కావగలవా డెవడూ లేడు. వారిని వారే కాచికోవలె" మనువు. ॥.అ.

వాటిని వాత్స్యాయనుడు ఇట్లు నివరించినాడు[1] ''చెత్తా చెదారము, పాచి చుట్టూ చిమ్మివేసి శుభ్ర పరచవలెను. నేల గోతులు గొగ్గులు లేకుండా చదును చేసి నునుపు దీర్చి అలికి ముగ్గులు పెట్టవలెను. ఈ ముగ్గులను తండుల బలి వికారా లన్నాడు. అంటే ఇవి ముంగిళ్ల అందము శోభ గూర్చుటకే గాక. చీమలు, చిన్న పిట్టలు మొదలగు జీవుల కాహారము కోసము కల్పింపబడినవి. ఏయే చోట–ఏ.యే తీరుపూలు–ఏ.యే రకాల దండలు – చెండ్లు అందగించునో గుర్తించి చూడనింపుగాను, ఉల్లాసము గొలుపునట్లుగాను ఇంటిని తీర్చి దిద్ద వలెను· దేవ గృహాము (దేవుని గది, పూజా మందిరం) బాగా అలంకరింప వలెను.

ఇంటి ఆచారాలు, మర్యాదలు, సంసారంలోని సాధకబాధకాలను గూర్చి తగిన సలహాలనిస్తూ మార్గము చూపువారు అత్తమామలు-కులవృద్ధులు. వారికిని తగిన గౌరవముతో సత్కరించి, వినయంతో అభివందనాది సముదాచారమును జరుపవలెను. మాటలలోను, చేతలలోను వారి హిత చింత చూపవలెను.''

వాడుకకు నీరు తెచ్చుట, నిత్యమూ వాడుకొనెడి గుడ్డల నుదికి దెచ్చుట, వంట చేయుట, పిల్లల పోషణ, పాలనము, వంట పాత్రల శుభ్రపరుచుట, వృత్తికి సంబంధించిన పనులలో భర్తకు తోడ్పడుట, కుటుంబ సభ్యులను, వారి పిల్లలను, పరామర్శించుట మొదలైన కార్య కలాప మెంతో ఉన్నది. ఆయాకుటుంబాల ఉపపత్తి, కుటుంబ బాహుళ్యమునుబట్టి, కార్య బాహుళ్యమూ ఉంటుంది. కుటుంబంలో పురుష సభ్యులవలెనే, స్త్రీ సభ్యులూ, కుటుంబపు ఆంతరిక కార్యకలాపములను తలకొకటిగా నిర్వహించుచుందురు. కలిగిన కుటుంబమయితే పరిచారికలూ ఉందురు.

ఇట్లింతతో దీరినదా కుటుంబిని బాధ్యత ? వాత్స్యాయను లింకా చెప్పి నారు. ''వంట యింటిని శుచిగాను, గాలి వెలుతురు ధారాళంగా వెలయింప వలె. శుచిగా చూడనింపుగా నుంచవలె.'' వంట పరికరాలు, సంబారాలు, ఎప్పు

---

1 వాత్స్యాయన కామసూత్రం:- ఏకచారిణీ వృత్తాధ్యాయమ్.

దేవి కావలసివస్తే అప్పు దది చప్పున వందికొనుటకు వీలుగా వంటయింటిలో అమర్చవలెనని మంత్రి అప్పన చెప్పినాడు. భోజన శాలను గేస్తురాలు అలంకరించి యుంచవలెనట: ప్రసన్న హృదయముతో భుజించినదే ఆరోగ్య ప్రదమట. వాత్స్యాయనుని మాటలు ఇంకా ఉన్నవి వినండి. ఆమె (కుటుంబిని) తన శరీరమును సర్వదా శుచిగను, శోభస్కరంగాను ఉంచికోవలె. పాడి పశువుల్ల పోషణపాలనముల విచారింటు చుండవలె. తన చేతి క్రింద పనులు చేయు పరిచరులు మొదలైన వారికి తగిన ఆదరం చూపుతూ వారి యెడల ఔదార్యముతో వ్యవహ-స్తూ మాటలలోను, చేతలలోను వారికి హితము చూపవలెను. ఏనాటి ఆయవ్యయాలు ఆనాడు లెక్కించి వాటిని సరిపుచ్చుచుండవలెను.

ఆతురుల పరామర్శించుట. భిక్షుకులను పరామర్శించుట, దేవతాదులకు పూలు గ్రుచ్చుట, అలంకరించుట, శయనాలు, ఆసనాలు మొదలగు వాటిని విచారించుట కూడ ఈమె పనులే.

ఇవిగాక, అప్పటప్పట నిర్వహించవలసిన పను లున్నవి. పీటలు, పెట్టెలు, చాపలు మొదలైనవీ, కొయ్యసామానులూ, వంట పాత్రలూ, నీళ్ల కాగులూ, పళ్లెములు, ఉట్లు, చేపలు పశువులు కట్టు త్రాళ్లు మొదలైన నార సామాన్లు. ఇంకా ఇట్టివి అన్ని తీరుల గృహోపకరణాలూ, ఎప్పుడెప్పుడు, ఏవేవి, యెక్కడెక్కడ సరసంగాను మేలైనవిగానూ దొరకునో, అప్పుడప్పుడు వాటిని ఆయా తావుల కొని కూర్చి యుంచవలెను. ఇంటి వాడుకకు కావలసిన ఉప్పు, పప్పు, నెయ్యి, నూనె మొదలైన సంబార ద్రవ్యాలనూ పైలాగే ఆయా తావుల ఆయా సమయాల సరసంగా కూర్చియుంచవలె. చిట్కా వైద్యాల కుపయోగించు శొంఠి, వాము, పిప్పలి మొదలైన ద్రవ్యాలను, అసాధారణములైన సైంధవ సౌవర్చాది లవణాలు, కొవ్వులు మొదలైన స్నేహ ద్రవ్యాలు, కటుకౌషధాలు, చందనాది సుగంధ ద్రవ్యాలు సేకరించి చెడిపోకుండా దాచవలె. ఆకు కూరలు, దుంప కూరలు, కాయగూరలు, మొదలైన కూరల విత్తనాలను, ఆయా కాలాలలో సేకరించి పాడుగాకుండా భద్రపరచి ఉంచవలెను.

ఇంటి పెరటిలో ఆయా ఋతువులలో ఆయా కూరల విత్తులను, విత్తి పైరు చేయ వలెను. ఒక ఓరను అపురూప ఔషధములను (ఓషధులను) పెంచు చుండవలెను. పూలచెట్లు, పొదలు, పండ్ల చెట్లు, వాటి మనోహరమైన పూదోట లను వెలయింపవలెను. ఇది, ఉద్యానముగా* అందచందాలు దిద్దుటకు కుటుం బపుటుపపత్తి చాలకపోతే ఏపాటిదైన, పుష్పవాటికైన నెలకొల్పవలెనట. అట్టి చిరుతోటలో విలాస వినోద స్థానముల కంతగా అవకాశ ముండదు. అయినా కనీసం విశ్రాంతి కోసం వేదికనైనా నిర్మింతురు.

ఇక ఆర్థిక రంగంలో ఆమెతీరు చూడండి. ఆయవ్యయాలను గమనిస్తూ ఆయమును మించకుండ, వ్యయమును సరిపుచ్చవలసిన బాధ్యత ఆమెదట. ఇంకా వినండి. ఉత్సవాలు, క్రతువులు, సంతర్పణములు మొదలైనవి జరిపి నపుడు, వాటిలో మిగిలెడి ద్రవ్యాలు, సంబారాలు వమ్ముగాకుండా ఆమెయే సొమ్ముచేయవలెనట. ఆయా సందర్భాలలో మిగిలెడి వెన్న, నేయి, నూనెల వంటి వాటిని దాచి ఉపయోగించుట, పాలు, ఆవాలు, నూనెలు, చెఱకు వంటి వాటిని కూర్చి, వాటి వాటి నుండి నేయి, నూనెలు, బెల్లం మొదలైన వస్తువు లను కల్పించి ఇంటికి వాడుట, విక్రయించుట. ఇట్లే నిత్యమూ ఇంటిలో వాడు కొనువస్తువుల నుండి యేర్పడెడి ఆయా ఉపద్రవ్యాలను, వృథాగానీక యేదో తీరున వినిమయం చేయవలె. మచ్చుకు గంజి, పుల్లనీళ్ళు మొదలైన వాటిని సేక రించి ఉపయోగింప దగును. ఇవి పుష్టికరమైనవి, ఆరోగ్యకరములు. వీటిని పశువులకు కుడితిగా పెట్టవచ్చు. ధాన్యము దంచుటలో వచ్చునూకలను పశువు లకో, కోళ్ళకో ఆహారముగా వినియోగింపవచ్చును. అందుండి వచ్చెడి చిట్టు, తౌడు పశువుల కాహారమునకు ఉపయోగింపవచ్చును. ఊక—బుసగ

---

* ఉద్యానాలలో వినోదించుటకు విలాస స్థానము లెక్కువగా నుండును. అవి : వేదికలు, లతాగృహాలు, తీరుతీరుల దోలలు, ధారాగృహాలు, కొలకులు, విహారనౌకలు, క్రీడాశైలాలు మొదలైనవి. అవి మనోహరములైన శిల్పాలు; హాయిగొల్పునవి. వీటి అందచందాలు వివరించుట కిట తావులేదు. ఆ తీరు తీయములను ఉద్యానకళలలో చూపితిని.

పొలుసుల వంటివి ఇంధనముగాను, గోడపూతలకును ఉపయోగించును. కుమ్మరి ఆవముల కోసరము అమ్మనూవచ్చు. పొయ్యిలో మిగిలెడిబొగ్గులను. కంచరి, కమ్మరి, స్వర్ణకారులు మొదలగువారికి అమ్మి సొమ్ము చేయదగును. పాతగుడ్డలకు రంగులు వేయించి పరిచారకులకిచ్చి వారి సద్భావము పొంద నగును. అందుకూ కొఱగాని పాతలను పొత్తిళ్ళకు, ఇంకా పీలికలైనవాటిని దీపపు వత్తులకు కూడా ఉపయోగింప నగును. ఎంతటి పొదుపు ! ఏ వస్తువూ వృధాకారాదు ! ఏదో తీరున వాటిని, చిగురంట వినిమయము చేయవలసినదే.

భర్త పరివారమును, ఇతర పరిజనులను దయతో చూస్తూఉండవలె. కుటుంబ మిత్రులను సగౌరవంగా ప్రియంగా మధురభాషణములతో ఆద రిస్తూ ఉండవలె. ఏయే పరిజనులు ఏయే పనులు నిర్వహింపజాలుదురో చక్కగా గుర్తించి వారిని వారిని ఆయాకార్యములకు వినియోగిస్తూ ఉండవలె. పండు గలు పబ్బాలలో వారివారి యోగ్యతలకు తగినట్టు వారికివారికి భోజన పానీయ ముల నిచ్చి ఆదరిస్తూ ఉండవలె.

ప్రత్తిని సేకరించి, ఏకించి, ఏకులుచేసి, వడికి, గుడ్డలు నేయింప వలెను. కుటుంబపు వాడుకకు కావలసిన గుడ్డలన్నీ యేకుటుంబమునకు ఆ కుటుంబము వారే తయారు చేసుకుంటూ ఉండేవారు. వంట యెంత ప్రధానము. ఆవశ్యకమూ నైన కార్యమో గుడ్డలకుగాను నూలు వడకుటా అంతటిప్రధాన కార్యముగా నుండెను. [1]భార్యలు భర్తలకు, మాతలు బిడ్డలకు కావలసిన గుడ్డ

---

1. వాసో యత్పత్నీభి రుతతన్నయోన ముపస్పృశాత్.

(అథ-14-2-51)

భార్యనేసిన వస్త్రము నాకు సుఖదాయకమగుగాక !

"వితన్వతి ధియో అస్మా అపాంసి వస్త్రా పుత్రాయ మాతరో వయన్తి"

(ఋ-5-47-6)

తల్లులు బిడ్డలకోసం నేస్తున్నారు.

లను నిర్మించుచుండిరి. చొక్కాలు, లాగులు, రవికెలు, మొదలైనవి బహు పురాతన కాలానికే ఉన్నవి. వాటిని కుట్టుట కుటుంబినుల పనే. దారములతో అల్లికపనులు (లేసులవంటివి) బుటేదారుపనులు చేయువారు.

ఆమెకు తీరిక ఉంటేనూ, ఓపిక ఉంటేనూ ఇంటికి చెందని పనులనూ నిర్వహించవచ్చునట. అయితే ఈ పనులకు బూనుకొనుటకు భర్తతో సంప్రతించి ఆయన అనుమతి పొంది మరీప్రవేశించ మంటాడు వాత్స్యాయనుడు. ఆ వ్యాపారాలు ఇవి.

1. పశువులు, గుఱ్ఱాలు, మేకలు, గొఱ్ఱెలు మొదలైన వాటిని పరామర్శించుట, వాటిపోషణ మొదలగు పనులను విచారించుట;

2.కృషి చింత: వ్యవసాయమునకు సంబంధించిన ఆయాపనుల (పరిమాణమును నిరూపించుట)విచారించుట, ఆయాపనులు చేయు పరిజనుల జీతాలు, బత్తెములు—ఆయాపనుల పరిమాణములను నిరూపించుట, నిర్ణయించుట.

3 వాణిజ్యచింత: వ్యాపారమునకు సంబంధించిన ఆయాకార్యాలను పరామర్శించుట. ఇవి పురుషులు నిర్వహింప దగినవి. ఇంటిలో ఉండి నిర్వహించుట కందుబాటైనవి కావు. కనుక భర్తకార్యకలాపములలో తాను కలుగజేసికోవటం ఆయన అనుమతి లేనిదే తగదని వాత్స్యాయనుడు నిరూపించుట యుక్తమే.

ఈ కుటుంబ రాజ్యాధిపతికి ఈమె మంత్రిణి అన్నాముగా! ఆ మంత్రాంగ మెట్టిది? భర్తతో పిల్లల పోషణ పాలన విద్యాదికములనుగురించి సంప్రతిస్తూ, ఆయాసమయాలలో తగిన నిశ్చయములు చేయించును. ఇంటిలో జరుప వలసిన ముదాచారములూ. శుభాశుభ కార్యాలూ, ధర్మకార్యాలూ మొదలైన వాటిని గురించి భర్తకు సలహాలిస్తూ వుంటుంది. కుటుంబములో అప్పటప్పట పొటమరించెడి సమస్యలను సర్దుటలో భర్తకు ఆలోచనలందిస్తూ సహకరిస్తుంది. భర్తగాని, కుటుంబము వారుగాని, సంకల్పించిన ఆయాకార్యాల యోగ్యత అయోగ్యత, వాటి వాటి ఫలితాలు, పరిణామరూపాలు మొదలైనవి భర్తతో చర్చించి, సలహాలిస్తూ ఉంటుంది. కుటుంబపుటార్థిక పరిస్థితులగూర్చి

కూడా చర్చించి, సలహాలిస్తూ ఉంటుంది.[1] భర్త తమకుటుంబపు శక్తికి మించి వ్యయిస్తేను, అపాత్రదానాలు, అనర్థకరపు వ్యయాలు చేస్తూఉంటేను భార్య భర్తకు హితం చెప్పవలెనంటారు వాత్స్యాయనులు. ఈహితబోధ భర్త మనస్సు నొచ్చకుండా మధుర భాషణతో హేతుగర్భితంగాను నీతినిపుణంగాను రహస్యంగా భర్త ఒంటరిగా నున్నప్పుడు ఈవలికి పిలిచిచెప్పవలెనట[2] ఇంకా భర్తప్రవర్తనలో లోపములు కన్పించిన ప్రసంగసందర్భము కల్పించు కొని భార్య భర్తను మృదువుగా మందలించవలెను.[3] ఆ మందలింపు ఆవే శంతో రుసరుసలాడుతూ ఆడిపోయునది గారాదన్నాడు. గంభీరంగాను, తట బాటు లేకుండాను కొంచెమంత కినుక దెలుపునదిగాను ఉండవలెనట ఆ మందలింపు:

ఇట్టి, ఇంటిగుట్టులనుగాని, తమ ఆస్తిపాస్తుల స్థితిని గాని, పరులచెవి కెక్కనీయరా దన్నారు వాత్స్యాయనులు. ఇట్లు పరులకెరుకపడ నీయరాని వింకా ఉన్నవని చూపుచున్నది నీతిశాస్త్రము* ఆయువు (వయస్సు), తమకలిమి, కుటుంబపు పౌరుషులు, మంత్రం(భర్తతోచేసినఆలోచనలు), తమ దగ్గర నున్న మందులు, కామ విషయాలు, తాము చేసిన దానాలు, ధర్మాలు, తమగొప్ప, తమకు గలిగిన అవమానము ఇవన్నీ రాజ్యములకూ గుట్టుగా నుంచదగినవే. ఈ కుటుంబ రాజ్యమునకూ అదేనీతి. రాజ్యములకు వీటి గోపనబాధ్యత మంత్రులది గదా! అట్లే కుటుంబ రాజ్యమున వీటిని గోపనముగా నుంచు బాధ్యత దాని మంత్రిణి అయిన కుటుంబిని దన్నారు.

---

1. అతివ్యయం అపద్వ్యయంవా కుర్వాణం రహసి బోధయేత్ (902–4–1–14)

2. నాయకాపచారేషు కించిత్కలుషిత నాత్యర్థం నిర్వదేత్ (907-4-1–19)

3. సాధిక్షేపవచనం మిత్రజన మధ్యస్థ ఏకాకినం వాప్యుపాలభేత నచమూల కారీస్యాత్ (908-4-1–20)

* ఆయుర్విత్తం గృహచ్ఛిద్రం।మంత్ర మౌషధ సంగమం దాన మానావమానాశ్చ।నవగోప్యా మనీషిభిః.

ఇంత శ్రమకు కాస్త విశ్రాంతి, కాస్త వినోదమూ ఉండవద్దా ; అందుకే పుష్పవాటికలు, పుష్కరిణులు. పురుషులు, స్త్రీలు గూడ నిత్యమూ ఇంటి తోటలో విహరించుచుండువారని వాత్స్యాయనుడు చెప్పెను. పాటలు, పిల్లల ఆటలు, పురాణ శ్రవణము, పచ్చీసు, చతురంగము వంటి ఆటలతో వినోదింతురు. ఈ ఆటలెన్నో తీరుల ఉన్నవి. వాటిని వాత్స్యాయనులు వివరించినారు. ఇవి నిత్యమూ అనుభవించెడివి. ఇవిగాక అప్పటప్పట అనుభవింప దగిన వినోదాలను చాల తెలిపినారు వాత్స్యాయనులు, ఇవి నైమిత్తికము లన్నారు. పండుగలూ సామాన్యంగా ఇట్టివే. వసంతోత్సవం, వనభోజనం, జలవిహారాలు మొదలైన వీతరగతివి. ఈ ఉత్సవాలలో ఆటలు పాటలు నృత్యాలతో వినోదింతురు. కుటుంబినులు నృత్యగీతములు నేర్చియుండు వారనీ, ఉత్సవాలలో వారూ వాటిని జరుపు వారనీ చూపజాలిన నిదర్శనము లెన్నో ఉన్నవి. రాసక్రీడ, జలక్రీడలు సర్వసామాన్యము. నేటికీ ఉత్తరదేశాన ఇవి కనుపిస్తున్నవి. వీరి యీ వినోదాలలోనూ ధర్మ ప్రచారం తావుగొన్నది. నిత్యమూ ప్రతి వ్యక్తి ఇంటితోటలో విహరించి మనః ప్రసన్నత నొందుటేగాక ప్రకృతి శోభగల విశాలోద్యానాలకూ, అప్పటప్పట మిత్రులు బంధువులతో యాత్రలు పోయి హాయి ననుభవించువా రని యిది మనకు చూపుచున్నది.

ఆమె ఇంత శ్రమించి కొంత విశ్రాంతి వినోదముల నొందినది. సరే! ఆమె ప్రతిపత్తి (హోదా) దిగజారిన యీనాటి హైందవ కుటుంబిని స్థితిని బట్టి నిర్ణయింపదగదు. "సహధర్మిణి'' అన్న పదమునకు అపసవ్యపు అర్థము నతికించవగదు. భర్త యేయే గుణశీలాలు, తత్త్వము (సాత్త్విక–రాజస–తామసములు) గలవాడో భార్యకూడ చాలవరకు ఆయా తీరుల గుణ శీలాలు, తత్త్వము గలదిగా నుండ దగునని మాత్రమే దాని భావము. అట్టి సమధర్మములు ఆదిలోనే (వధూవరుల అన్వేషణ వరణము లప్పుడే) విచారించి అనురూప ధర్మాలుగల వారే వివాహమాడు టుచితము. ఆపైన డాక్టరు విట్జు గారు నిర్వచించినట్లు– చిరంతన సాహచర్యం వల్లనూ కొంత వర కీసమధర్మాలు కుదురుకొంటవి. అందరూ నిర్వచిస్తున్నట్లు మానవత్వ

మును మంట గలిపి భర్తకు తొత్తుగానో భోగపరికరంగానో పడియుండుటగా అన్వయించుట సరళము గాదు. వైదిక కాలము నుండి దాదాపు ముస్లిం యుగందాక ఆమె ప్రతిపత్తి ఉజ్వలము. చూడండి: వివాహంలో భార్య భర్తకు "నేను నీకు విధేయురాలిని[1]" అని పూట పడ నక్కరలేదు. అట్లు పూట పడకపోగా "నీతో సమాన ప్రతిపత్తి గలిగి ఇల్లు దిద్దుదును." అనే భావంగల మంత్రం వివాహ తంత్రంలో వధువు పఠిస్తుంది ఇట్లు "సుఖము గోరి కుడి ప్రైపును నేను స్వీకరిస్తున్నాను. ముది ముప్పుల దాక (ఈయన) నాతోకూడి యుండుగాక! అర్యమా! భగా! సవితా! ప్రమోదీ! వీనితో గూడి నేను గృహమును పాలింప న న్ననుగ్రహింపుము."[2]

ప్రజాపతి మాకు సంతానమును అనుగ్రహించుగాక! వార్ధకము దాక మమ్ములను సమైక్యముగా అర్యముడు ఉంచుగాక! శుభ ప్రదముగా భర్త గృహమును ప్రవేశింతుసు. ఓ వరుడా! మన వారికి, మన పశువులకు శుభ మగుగాక!" "ఈమె యీ ప్రతిపత్తిని వరుడు వివాహంలో అంగీకరిస్తూ, ఇట్లు ప్రతిజ్ఞ కూడ చేస్తాడు "ధర్మంలోగాని అర్థంలోగాని కామంలో గాని భార్య నతిక్రమించి నడవను." "ధర్మే ష్వర్థేషు కామేషు భార్యాం నాతి చరా- మ్యహమ్"

వధువు తొట్టతొలిగా భర్త యింట అడుగిడు నపుడు ఆమెను కొత్త చుట్టాలు ఆహ్వానిస్తారు ఆ సందర్భంలో వారి స్వాగత వచనాలు: "సంపద సంతానము గలిగి నీ విక్కడ ఆనందింపుము. ఈ యింటిని శ్రద్ధాళువవై చూచికొమ్ము. పతితో ముది ముప్పులదాక వెళ్లబుచ్చుము. గృహమును పాలింపుము. ఇప్పు డిందున్నవా రెవ్వరూ ముందు పాల్గొనువారు గారు. దీర్ఘ కాల మానందింపుము. కుమారులను మనుమలను కనుచూ ఆనందింపుము. నిండు మనసుతో నీ యింట నుండుము".

---

1 ఇది క్రైస్తవుల వివాహంలో వధువు చేయవలసిన ప్రమాణం.

2 ఋ—వే—X—85.

''పిల్లలను' పిల్లలకు పిల్లలను ప్రజాపతి మీకు ప్రసాదించుగాక ! అర్యముడు మీకు ముది ముప్పులదాక ఐశ్వర్యము గలుగ ఆశీర్వదించు గాక ! పతి గృహాంగణము మెట్టుము. ఇంటి పరివారము పశువులు ప్రబలుగాక ! కుటి దృష్టి లేకుండుగాక! దాంపత్యానురాగము తఱగ కుండుగాక! పశువు లకూ సుష్ఠుగుగాక ! మార్దవహృదయము వికాస వదనము గలిగి వీరులను కంటూ దేవతల నర్చిస్తూ సుఖాల జూరగొనుడు.''

"దయాళూ ! ఇంద్రా! సుఖము,సంతానము గలుగ ఈ వధువును అను గ్రహింపుము. ఆమెకు పదుగురు పాపల నిమ్ము. పదునొకండవ వాడుగా ఉంటాడు భర్త వారిని పరిపాలింపనిమ్ము. పతియొక్క తల్లిదండ్రులు,సోదరీ సోదరులపైన ఆమె పెత్తనము చెల్లనిమ్ము.''

గృహస్థ ధర్మం తప్పబలికిన భర్తను భార్య మందలిస్తుంది. ఆ కథ ఇది[1]. పద్ముడనే కుటుంబి కార్యాంతరమున నెచటికో పోయినాడు. అదే సమ యానికి భృగువు పద్ముని దర్శించి ధర్మ మర్మములు ఆయనవలన దెలిసికొన దలచి పద్మునియింటికి వస్తాడు. పద్ముడు ఇంటలేడని విని ఖిన్నుడై సమీ పారణ్యమును జేరి కొంటాడు. పద్మునిరాక కెదురెదురు చూస్తూ ఆ అడవిలో తపిస్తూ ఉంటాడు. వారం దినాలకు పద్మ డిల్లు చేరికొంటాడు. పద్మునిసతి భృగుని రాకను భర్తకు నివేదించి మీరు పోయి, భృగుని సత్కరించి ఇంటికి తీసికొని రావలసిం దంటుంది. పద్మునికేమో రాజసం బలుస్తుంది. తనకల్మికి గర్విస్తాడు. ఒకరిని చూచే కర్మం నాకేమిటని కసరికొంటాడు. అపుడు భార్య ''కోపము నాపుకోండి. అది పాపిష్ఠిది. శాంతంగా సముదాచారమేమిటో ఆలో చించండి. ఆశాశలతో వచ్చిన అర్థిని అవమానిస్తారా? తిరస్కరిస్తారా? కుటుంబి కిది ధర్మమా!'' అని హితం చెప్పుతుంది. ఎంతటి మెత్తని మంద లింపు ! దానితో పద్మని తిక్క దిరిగినది. తన పొరబాటు దిద్దికొన్నాడు. కోపపు పాపము నుండి నన్ను తెమలలాగినా వని సతిని ప్రశంసిస్తాడు.

---

1. భార-శాంతి. 66. : పద్ముని దర్శింప గోరిన అభాగ్యుని కథ

మరొకకథ[1]. కౌశికు డొక బ్రాహ్మణుడు. మహాకోపి. అత డొకనాడు భిక్షకోసం ఒక యింటికి పోవును. "భిక్షాందేహి" అనును. కుటుంబిని ఆ అభ్యర్థనం విని భిక్ష తీసుకుని వస్తూ వుంటుంది. ఆ తెచ్చేలోగానే కౌశికునకు నిలుపు లేకపోయినది. తీండ్రించి భర్త్సనగర్భంగా (బెదరింపు లొడిగిన మాటలతో) ధర్మోపన్యాసాలకు దిగినాడు. ఇంతలో కుటుంబిని భిక్షగొని వస్తుంది. ఆ కౌశికుని తీరు చూస్తుంది. "నాయనా! ఈ దుందుడుకుదనం బ్రాహ్మణ్యం కాదయ్యా!" అంటూ మృదువుగా హేతుగర్భంగా మందలిస్తుంది. పిదప ఆ సాధ్వీమతల్లి బ్రాహ్మణధర్మపు నిజస్వరూపమును కౌశికునకు ఉపదేశిస్తుంది. "ధర్మవ్యాధు డున్నాడు. ఆయన దగ్గరకు పో! ఆయన ధర్మస్వరూపాన్ని నీ కింకా చక్కగా తెలియజెప్పుతాడు." అని అంటుంది. ఇక ఇప్పుడు తీరుపీయండి– స్త్రీ భర్తకు తొత్తా! ధర్మసచివయా!

గృహ కృత్యాల నిర్వహించుటలో ఈమె ప్రతిపత్తి తెలిసినదిగదా! ఇక ధార్మిక రంగంలో చూతాము. కుటుంబి యేక్రతువు చేసినను భార్యతో కలిసియే చేయవలె. లేనిచో ఆ క్రతువు పూర్తియైనట్టుకాదు. నిత్యవిధులుపంచ యజ్ఞాలు పురుషులట్లే స్త్రీలు నిర్వహింపవలెను. ఇంతేగాదు: క్రతువులు మొదలైన ధార్మిక కార్యాలలోనూ పురుషులట్లే స్త్రీలు అయాప్రముఖ పదవుల నధిష్ఠించిరి. ఆయాకార్యాల నిర్వహించిరి. బ్రహ్మస్థాన మధిరోహించిన స్త్రీలున్నారు. (ఋ – 8 – 33 – 19) బ్రహ్మస్థాన మంటే సామాన్యము గాదు క్రతువిధి విధానము నంతా పరిశీలిస్తూ దోషాలను పరిహరిస్తూ వుండే అధికారస్థానం. ఈ సందర్భంలో ఆ బ్రహ్మపదస్థుని తీర్పు తిరుగులేనిది. యజ్ఞము కోసరము అగ్నిని రగుల్చుటలో అరణిని మథించుటకు భర్తకు ఈమె సహాయపడుతుంది. ఈ క్రతుకలాపాలలో ఆమె స్థానము పూర్వము భర్తకు కుడివైపునకునుండేది. నేటి కది తారుమారైనది. కాని వాటి సంప్రదాయపు గురుతులు నేటికీ పూర్తిగా మాసిపోలేదు. వివాహంలో నేటికీ యజించునపుడు మాత్రం కన్యను వరునకు కుడివైపుననే కూర్చుండబెట్టుదురు.

---

1. భార–అర–అ–5. కౌశికునికథ

అప్పు డామెకూడ యజించనూ యజిస్తుంది. ఆ యజనము కాగానే ఆమెను ఎడమ వైపునకు మారుస్తారు. యజ్ఞాలలో భార్య మంత్రాలు పఠింపవలె నంటవి శ్రౌత సూత్రాలు. భర్త ఇంట లేకున్నా నిత్యవిధుల నాపక వాటిని భార్య నిర్వహిస్తూ ఉండవలె. దీనికి ప్రసక్తించినకథ.[1] పద్మడనే కుటుంబి కార్యాంతరమున బోవును. కొంతకాలమైన పిమ్మట పద్ముడు తిరిగి రాగా భార్య తగిన సత్కారాలు నెరపి విశ్రమింపజేస్తుంది. అట్లు విశ్రాంతిగొనుచు పద్ముడు భార్యను మునిముందుగా ప్రశ్నిస్తాడు. "సతీ! కుశలమా! దేవతాది పూజలు సరిగా సాగుచున్నవా?" అని. అందు కామె* "మీ తీరు పున్నదిగా అంత తెలియక పోవటము పొసగదు. దేవపూజలు, అతిథిపూజలు అన్నీ సక్రమంగా ఎప్పటికి వలెనే సాగుతూ ఉన్నవి. సుహృజ్జనులహితము ప్రియము ఎప్పటిలాగే యేమీ తేడాలేకుండా సాగిస్తూ ఉన్నాను'' అని బదులు చెప్పినది.

పురుషుల వలెనే స్త్రీలు అన్ని తీరుల దానధర్మాలు చేయువారు. ఆత్మోన్నతికి, ధార్మిక జీవితమునకు, సువ్యవస్థకు సాధనాలు శ్రేయము ప్రేయము. వాటిని గూర్చిన పైన అష్టాంగాలను, శీలాలను పురుషులవలెనే స్త్రీలు సాధన చేయదగును. శాతవాహనుల కాలానగూడ స్త్రీలస్థితి దిగజారలేదు.

కుటుంబి సాగించిన ఆ ఆనంద యాత్రలో, ధర్మయాత్రలోతగిన సహాధ్యాయినిగా లేదూ కుటుంబిని? ఇందు ఇరువురకూ ప్రాముఖ్యమూ, ప్రాతినిధ్యమూ, ప్రతిపత్తీ సమానాలే. అనివార్యములూ అవిభాజ్యములూ. ఎవరి ఆధ్యాత్మిక ఆదిభౌతిక గుణధర్మాలు వారికి ఉన్నట్లు కనుపించినా పరస్పర మవి దోహదించుకొంటూనే ఉండును. జీవితంలో వారిరువురూ భిన్న వ్యక్తులు గానే

1. భార-శాంతి-అ 6-పద్మనికథ

* "అతనితోడ నిట్లనియె అంత యెఱుంగమి రాదు. నీదు శి
క్షాతిశయంబు కల్మి, భుజగాధిప ! నాకుఁ దగన్ సమస్త దే
వాతిథిపూజనంబులు సమగ్రములై నడచున్ సుహృజ్జన
ప్రీతియు మున్నువోలె నవిభేదత నొప్పఁగ నిర్వహించితిన్''

భార-శాంతి-అ6-పద్మనికథ

కన్పిస్తారు. ఆ భిన్నత్వము చాటున ఏకత్వ మొదిగియున్నది. ఇంకా కొన్ని సందర్భాలలో ఒకటి దానికి రూపు కల్పిస్తూఉన్నది. మరొకటి రూపురేఖలు తీర్చి దిద్దుతూ ఉన్నది.

"అతడొ ఋ;క్కీ_మెయో వాక్య; మాత డేమొ
ఆకసం; బీమెయో పృథ్వి; యతడొ పురుష;
డీమె స్త్రీ; కల్గు పాపలకేమొ తల్లి
దండ్రులై యొద్దిక నిలు దిద్దంగ శుభము."

# ఆర్షకుటుంబము

## ఏనిమిదవ నివాళి

# కుటుంబసభ్యులు

''కరి తురగాది ఘట్టనయు గాలియు నోంపదె యొంటియున్న య
త్తరువు, ననేక భూరుహవితానము గుంపయి పేర్చి బాధలన్
బొరయునె యన్నదమ్ములును బొందిన నేరి కసాధ్యు లట్లుగా
కెరవయి నిల్చినం గెలని కెల్లిదమై పరిపోదు రెంతయున్''

(భార–ఉద్యో–ఆ–2–ప 88)

వీరిస్థితి యేమిటి ? కుటుంబ సంస్థను గూర్చి తెలుపుటలోనే యొకింత తడివితిని. ఇపు డింక కొంత. నిత్యవిధులు, శీలాలూ అందరూ పాలించవలసి నవే. కుటుంబములోని యితర సభ్యులు దానధర్మాలు, క్రతువులు చేయువారు. వారి కట్టి అర్హత యున్నది. ఈ కార్యముల కోసం కుటుంబపుటాయము నుండి వ్యయించు స్వత్వము (హక్కు) వీరి కున్నది. అయితే ఆ వ్యయాలు కుటుంబ స్థితికి తగినంతగానే యుండదగును. కుటుంబపు కార్యకలాపాలను కూడా సమీక్షిస్తూ, వాటికి సమన్వయం కూరుస్తూ పొసగించి ఇల్లు నడుపుచుండు వాడు కుటుంబి.

కుటుంబినులనూ వివరించితిని. కుటుంబమంతటినీ దిద్దెడి కుటుంబి కుటుంబినులకూ, కుటుంబపు ఆయాకార్యాల నిర్వహిస్తూ ఉండే కుటుంబ సభ్యులకూ గల సంబంధము ఒక అధికారికీ ఆయన క్రింది ఉద్యోగులకూ నడుమనుండు సంబంధమును బోలినది కాదు. కృతక నియమ నిబంధన లిట లేవు. అంతఃకిరణాలు సోకగా విప్పారిన హృదయాలు క్రుమ్మరించు ప్రేమయే వారి నియమాలు, నిబంధనలు. ఒకరి ఉత్తరవుల కోసం ఎదురెదురు చూస్తూ ఉండనక్కరలేదు. వారివారి కార్యకలాపాలలో వారువారు స్వతంత్రులే. ఏపనిని ఎప్పుడు ఏ తీరుగా చేయవలెనో ఎవరికి వారే నిర్ణయించు కొందురు. నిర్వహింతురు.

అయితే కుటుంబ నిర్వాహకునకు అప్పటప్పట ఆయా కార్యాలను తెలుపుతూ ఉంటారు. కుటుంబ నిర్వాహకుల (కుటుంబి కుటుంబినుల) సలహాలూ సంప్రదింపులు ఉంటూనూ ఉంటవి. కుటుంబ నిర్వాహకులు సామాన్యంగా వారి వారి కార్యాలలోని సాధకబాధకాలు మంచిచెడ్డలు వారలతో సమాలోచించు చుందురు. కాని, వారి వారి కార్య కలాపాలకు అడ్డుకోరు. ఆయాకార్యకలాపాలలో లోపాలో, ప్రమాదాలో తోస్తే వాటిని ఆయాకార్య నిర్వాహకులకు తెలియునట్లు చూపిస్తారు. ఆ తీరు మిగుల మార్దవంగా ఉంటుంది. అసలు దోషాల నుపలక్షించుటలో కుటుంబాధినేతలేమి, ఆ అధినేతలు చూపెడి వాటిని అవగతంచేసికోవటంలో కుటుంబ సభ్యులేమి, ఒక ధర్మ సూత్రంతో వ్యవహరిస్తారు. *"ఇతరులు నీపట్ల ఎట్లు ప్రవర్తించవలెనని అనుకొంటావో నీవు ఇతరుల పట్ల అట్లా ప్రవర్తించు" అన్న దాధర్మసూత్రం. దీనివల్ల ఎదుటివారున్న స్థితిలో నేనే వుంటే యేమి చేసేవాడిని అని ఆలోచించుట అలవాటగును. అంటే: ఒక విషయపు మంచిచెడ్డలు ఆలోచించుటలో తనదృక్కోణంనుండేగాక యెదుటి వారి దృక్కోణమునుండి చూచి తూచి మరీ నిర్ణయించుట కలవడుదురు. ఇందుచే సహజంగా సహనమూ, నిదానమూ, సామరస్యమూ, క్షమా పెంపొందును. కుటుంబములో ఈ తీరుగా మొదలిడిన ధర్మసాధన క్రమంగా, విస్తృతమై, విశ్వ విశాలమగును.

కుటుంబసంస్థకూ దాని సభ్యులకూ క్రమశిక్షణ, వినయము, విధేయత అవసరమే: కుటుంబాధినేతల యెడల సభ్యులు గౌరవము, వినయము, విధేయత గలిగి యుందురు. ఏ సంస్థకైన అదుపు ఆజ్ఞ అవసరమేగదా. ఆ సంస్థలో వారు దాని అధినేతలను గౌరవించుట, ఆయన ఆదేశాలను మన్నించుట అవసరమేగా: అలా కాకుంటే ఆ సంస్థ కకావికలై పోతుంది. అయితే ఈ కుటుంబ

---

* ఒరు లేమేవి యొనర్చిన
నరవర యప్రియము దన మనంబున కగుఁ దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమ ధర్మపథముల కెల్లన్'' భా—శాంతి-5-220

సంస్థలోని వినయ విధేయతలకు ఇతర సంస్థల క్రమశిక్షణకు తేడా ఉన్నది. వినయమంటే చాలా అపోహలున్నవి. దీనిని గూర్చి చెప్పవలసినవి చాలా ఉన్నవి. అందు కిది స్థానము గాదు. సారమాత్రంగా తెలుపుదును. వినయ శబ్దానికి అర్థం: విశేషము + నయము (నీతి). ఈ వినయం తెచ్చిపెట్టి కొంటే వచ్చేది కాదు. 'చిత్తం దేవరా! బాబూ!' అంటూ చేతులు నలుపుకొంటూ నటించటం కాదు. 'జీ! హుజూర్!' లూ కాదు! బాహ్యములైన ఈ లక్షణాలు కపట వర్తనం, వంచన! ఇంకా వినయమంటే స్తబ్దతా కాదు. విరామం లేని పరిశ్రమ, విశ్వవ్యాప్తమైన దృక్పథం, విశ్వైక్యభావం. అనంత విశ్వంలో నేనెంత? అనుసత్యమును గుర్తించి తా ననుమాట (అహంకారము) మరచి సేవానిమగ్నుడై పోతాడు వినయి. అదీ నిజమైనవినయం. ఈ పృథగ్భ్వాతా హము నతిక్రమించి సేవానిరతితో మహదహంలో లీనమగుట వినయం.

కనుక వినయ ధర్మము నారాధించుటలో తబ్బిబ్బులు పడడు. సామాన్యంగా అత డెంతసాధువో అంతదృఢవ్రతుడు కూడ. తనకెంత ఆప్తుడు మిత్రుడు, బంధువు కూర్చువాడైనను ధర్మపాలనలో మొగమాట పడడు. ధర్మపక్షముననే నిలుచును. అట్టికథ లనేకం. మచ్చుకు : వాజశ్రవస ఋషి క్రతువు చేసి భూరిదానా లిస్తాడు. ఆదానాలలో గోదానాలూ ఉన్నవి దానాలుగా నీయబడుచున్న గోవులను చూచునరికి ఆ ఋషి కుమారుడు నచికేతువు మనస్సు చివుక్కుమన్నది. "చూడు! పాడిలేని ఈ బడుగు గొడ్లనా దానము? వీటి నేమి చేసికోను? మానాయనగారు చేసే యీ పని మంచిదికాదు. ఇది అధర్మం. వారికిది శ్రేయస్సు కాదు.'' అని చాల బాధపడ్డాడు. అది ఆపుకోలేకపోయాడు. "నాయనగారూ! నన్నెవరెకిస్తారు?" అని ముమ్మారు అడిగినాడు. తండ్రి చీకాకు పడ్డాడు. ఆ ఆవేశంలో ''నిన్నా! యమునకు'' అని నోరు జారినాడు. ఆ వెంటనే పశ్చాత్తాప మొందినాడు తండ్రి. మరల తండ్రి మరొక అధర్మమునకు పాల్పడ నున్నాడని నచికేతువు పొడగట్టినాడు. "నాయనగారూ! అనృతం మహాదోషం. మీవాక్కు అమోఘం కావలె. ధర్మం తప్పకండి. నేనుయమునివద్దకే

పోతాను'' అని అట్లే చేస్తాడు. అతని ధర్మానురక్తికి యముడు ముగ్ధుడై, ప్రసన్నుడై నచికేతుని మరల తండ్రిదగ్గరకు పంపును.

ఇంకొకటి: ధృతరాష్ట్రునకు విదురుడు మిగుల ఆప్తుడు; విధేయి. కాని ధర్మము చెప్పవలసి వచ్చినప్పుడల్లా నిర్మొహమాటంగా నిక్కచ్చిగానే చెప్పువాడు. "జూదపు గెలుపు ధర్మంగాదు. అప్పటికీ పాండవు లాడిన మాటదప్పక నడచుకొన్నారు. వారి పాలు వారికి పంచియియ్యకుండా దిగమ్రింగ దలచుట ధర్మమా! దురాశకూడదు. మీరు ధర్మం తప్పుతున్నారు." అనిచెప్పుచునే ఉండెను. ఈ కారణంగా ఒకమారు ధృతరాష్ట్రుడు విదురుని వెళ్ళిపొమ్మనుట, విదురుడు వెళ్ళిపోగా మళ్ళీ పిలిపించుకొనుట కూడా సంభవించినది. ఇట్లు ధర్మమును ప్రతిపాదించుటలో ఏఅడ్డు ఆపు లేక జంకుగొంకు లేక ప్రవర్తించెను.

తెలిసినదిగదా కుటుంబపు అధినేతల యెడల కుటుంబ సభ్యుల కుండు వినయము! దాని అవధులు! కుటుంబములో సాధన చేయమొదలిడిన ఈ సేవానిరతి క్రమక్రమంగా బంధువర్గం, సంఘం, దేశం మానవాళి, విశ్వం— వీటికి సేవగా పరిణమిస్తుంది. అప్పుడతని శుద్ధబుద్ధి తనకుటుంబపు హద్దుల దాటి "వసుధైకకుటుంబం''గా విస్తృతి నొందును.

తగినంత ఉపపత్తి లేనికుటుంబమైతే కుటుంబపు పనులను కుటుంబ సభ్యులే స్వయంగా చేసికొందురు. ఒకపాటి ఉపపత్తి ఉన్నా కార్యవిస్తృతి కుటుంబ సభ్యులకు మించి లేకుంటేనూ స్వయంగానే చేసికొంటూ ఉంటారు. మగవారిలో ఒకరు పశువుల కాపుమేపులు చూస్తూఉంటే మరొకరు పొలం దున్నుట మొదలైన కృషికార్యాలు నిర్వహిస్తూఉంటారు. ఇంకొకరు సరుకులను ఆయాసమయాల గమనించి సొమ్ము చేయుట మొదలైనవ్యవహారాలను చూస్తూ ఉంటారు. స్త్రీలలోను ఒకరు వంటచేస్తూఉంటే మరొకరు నీళ్లుతెస్తారు. ఇంకొకరు పశువులకు పచ్చిగడ్డి తెచ్చుట మొదలైన పనులను చేస్తూ ఉంటారు. ఇదే తీరుల ఇతర వ్యాపారాలనూ. ఇతర కృషికుల కుటుంబములో కూడ పనులను

పంచుకొని నిర్వహించెదరు. కుటుంబాధినేతలూ కుటుంబ సభ్యుల వలెనే పనులు చేయవలసినదే వారి విశేష మేమిటా? అన్నిపనులను సమన్వయించుట.

శ్రమ జీవనమునకు గౌరవముండెను. కనుకనే కుటుంబపు పని పాటులలో సామాన్యంగా పరిచారకులపై ఆధారపడుట తక్కువ. కుటుంబ కార్యకలాపములు తమకు మించినా కూడ పరిచారకులను వినియోగించుటకంటే జరుగుబాటు తక్కువగా నున్న బంధువులో ఆప్తులో ఉంటే వారిని సహాయకులుగా తెచ్చికొనుట కిచ్చగింతురు. ఇది ఉభయ తారకం.

"భగిని, గురుని, మిత్రుఁ, బండితు, వంశజుఁ,
బేదపడిన వానిఁ బ్రియము తోడఁ
దనగృహమునఁ గల్మి కనురూపముగ బ్రోవఁ
బెనుపుసేయు నాయువునకు సిరికి"

(భార-అను-ఆ-4)

తగునుగదా ఇది !

ఇలా వచ్చిన కుటుంబమూ వీరికుటుంబంలో భాగంగానే కలసిపోతుంది. వారికి గ్రాసవాసోదైన్యం లేకుండ (కుడువ కట్ట కొఱతలేకుండ) చూచుటే కాదు. అన్ని విధాలా తమ కుటుంబములోని వారిని లాగే ఆదరిస్తూ ఉంటారు. వారికి జీతబత్యాల నిర్ణయమంటూ ఉండదు. వారి శ్రమవల్ల వచ్చు దానినీ ఇతర సభ్యుల శ్రమార్జనమును వలెనే సమష్టిగా అనుభవిస్తూ ఉంటారు. ఆవచ్చినవారి పిల్లలు మొదలైన వారి శుభకార్యాలు ఈ కుటుంబంవారే జరుపుదురు. అంతేగాని ఈ వచ్చిన వారు కూలికి కుదిరినవారనీ తినవచ్చినవారనీ కుటుంబంవారు యజమానులనీ ఇటువంటి తలపులు వారికిగానీ. వీరికిగానీ ఉండవు, కుటుంబికి తనవ్యాపారం కలిసివచ్చి వృద్ధిగా ఉంటూ ఉంటే ఆ అండగా తెచ్చికొన్నవారికీ తన దానిలో ఒకపాటి పాలు ఇస్తారు. ఇట్లా అండ వచ్చినవారికి కాస్త కూడగానే దానికి తగుపాటిగా అతడూ, సొంతంగా వ్యాపారం జరుపుకొనుటకూ ఈ

కుటుంబి ప్రోత్సహిస్తాడు. ఇప్పటికీ జైనులలో ఈ ఆచారము కొంత కన్పి స్తుంది. తమవాడు—చివరకు వంటకు వచ్చిన వాడైనా సరే-అతనికి తమవ్యాపా రంలో ఏ మాత్రంగానైన ఇస్తూ అది కూర్చికూర్చి తగినంత కూడిన తరువాత ఆవచ్చినవాని కిచ్చి యేదో స్వతంత్ర వృత్తి చేసికొన ప్రోత్సహిస్తారు. ఇలాంటి వారు దొరకక పోతేనూ, కుటుంబపు వ్యవహారాలు మిక్కుటంగా ఉంటేనూ పరిచారకులు తప్పనిసరి. అప్పుడు పరిచారకుల నియోగిస్తారు.

శ్రమజీవులు విస్తృతకుటుంబాలనే కోరువారు. పనిపాటులలో గూడ కుటుంబ సభ్యులంతా ఒకేముఠాగా పనిచేస్తూ ఉంటారు. ఆ ముఠాకు కుటుంబి నాయకుడు. ఏపని నిర్వహించినా ముఠావారంతా కలిసే నిర్వహిస్తారు. ఈ తీరున వీరు శ్రమించగా వచ్చెడి లబ్ధిలో 'ఇది నీవంతు, అది అతనివంతు. ఇది నావంతు.' అనిగాని 'నీవు ఇన్నిగంటలు పనిచేసినావు, అతడన్ని గంటలు పనిచేసినాడు. నేనో ఇన్ని గంటలు పనిచేశాను' అనిగాని పాళ్ళుపంపిణీలు వా రెరుగరు. ఆ వచ్చినదేదో సమష్టిగా కుటుంబంవారంతా అనుభవించేవారు. కుటుంబం ఎంతపెద్దదైతే అంతగా లాభించేది. వ్యయమూ కలిసివచ్చేది. ఈ దృష్టివల్లనే కావచ్చు శ్రామికులలో బహుభార్యాత్వం తఱచుగా నున్నది. ఈ తీరు జీవనంలో వారికి హాయిలేకపోలేదు. 'కూలీ—యజమాని' అనే గొడవలు ఉండవు. పనిపాటులలో పరాయివాళ్ళ ఒద్దింపులు ఒత్తిడులు ఉండవు. పనివేళలు, సెలవలు, వాటిఅతిక్రమణలు, అందుకు ప్రతీకారాలు, సమ్మెలు మొదలైన బెడద లుండవు. వారికి వారికి తీరిక ఉత్సాహము ఉన్నప్పుడే పని చేస్తారు. కుటుంబం వారంతా పిల్ల జల్లలతో కలసి కులాసాగా పాటలు పదాలు పాడు కొంటూ, కథలు కబుర్లు చెప్పుకుంటూ, పనిచేస్తూ ఉంటారు. ఇందువల్ల అపరి చితములు, అవాంఛితములు అయిన గొడవ లొదవవు—వారు చేయుశ్రమ వారిని విసిగించక పోగా అదొక ఆటలాగు అన్పిస్తుంది. శరీరానికీ మనస్సు నకూ గూడ హాయి నిస్తుంది.

కుటుంబంలో ప్రతివారూ తమ తమ చరిత్ర (శీలము)లను తామే కను గలిగి కాచుకోవలె. అట్లే తమవారి చరిత్రనూ ఒక కంట కనిపెట్టుచుందురు.

ఆర్షకుటుంబము

ఇట్లు కుటుంబంలో పరస్పరము చరిత్ర (శీలము)లను కనుగలిగి కనిపెట్టు చుందురు. ఇట్లు కుటుంబంలో పరస్పరము చరిత్ర (శీలము)లను కనుగలిగి కనిపెట్టుచుండగా దుర్వృత్తిలో దొరలినవారు సులువుగా పట్టుబడుదురు. అట్టి దుర్వ్యాపారాల దిగుచున్న వారికి కుటుంబంలోని వారు హితం దెలిపి దారికి త్రిప్పుదురు. హితబోధ మార్దవంగాను, హేతుగర్భంగానూ ఉంటుంది. ప్రేమ ప్రిదిలి పారుతూ ఉంటుంది. ఉదాహరణకు నిగమశర్మకథ, అందలి మాటల తీరు వినదగును.

నిగమశర్మ నైష్ఠిక కుటుంబములో జన్మించినవాడు. అయితే ఆవంశపు సత్సంప్రదాయాలు అతనికి ఒంటబట్టలేదు. విలాసపురుషుడూ, విటరాయడూ అయి నాడు. ఆవెట్టి వెదురైనది. క్రమంగా పెద్దల ఒద్దింపులహద్దులు త్రెంపుకొన్నాడు. చాటుమాటులుచాలించి తెంపెగా తిరుగ సాగినాడు. తరతరాలుగా సంపాదించిన మడిమాన్యాలు కర్పూరంలాగు హరించి పోతూఉన్నవి. ముక్కాలి ముదుసళ్ళు, పరమసాధువర్తనులు అయిన జననీజనకులూ, భార్యా గోడుకుడుస్తున్నారు. అతనిది నగుబాట్ల బ్రతుకైనది.

ఈదుస్థితి అంతా నిగమశర్మ అక్కచెవిని బడ్డది. ఆ వెంటనే ఆమె తపించి పోయినది. తమ్ముని దారికి తేదలచినది. వెంటనే ఆమె తనపిల్లల తోను భర్తతోను బయలుదేరి పుట్టినింటికి వచ్చినది. మరదలి దుస్థితిని కళ్లార గాంచి కడుపు ఉమ్మలింప వాపోయినది. సమయం కోసం నిరీక్షిస్తున్నది. ఇట్లుండగా ఒకనాడు తమ్ముడు ఎక్కడనుండో ఊడిపడ్డాడు చలిది కోసం. తప్పించుకొని పోజూచినాడు. కానీ అక్కను చూచి ఆలుకొందినాడు. ఆమెకు మ్రొక్కి నిలిచినాడు. అతనిని చూడగానే అక్క ఆవేశ మాపికొని, తత్తరిస్తున్న తమ్ముని తమాయించి, మీ బావపంక్తిని భుజియింతువుగాని ఉండుమని, మరదలిచేత తమ్ముని సేవింపించి, భుజింప జేస్తుంది. తమ్ముడు భుజించి తాపీగా కూర్చుని వుండగా మృదువైన మాటలతో సహేతుకంగాను, కరుణాతి కరుణంగాను, కడుపుతఱుగుకొని పోవునట్లు ఇట్లు మందలిస్తుంది.

"ప్రారంభించిన వేద పాఠమునకున్ బ్రత్యూహ మానంబునో
యేరా తమ్ముడ! నన్నుజూడఁ జనుదే వెన్నాళ్ళనోయుండి చ
క్షూరాజీవ యుగమ్ము వాచె నినుగన్గోకున్కి మీబావయున్
నీరాకన్ మదిఁగోరుఁ జంద్రు పొడుపున్ నీరాకరంబున్బలెన్.

శ్రీలాలిత్యము నిత్యశుద్ధియు గుణోత్సేకంబునుం గల్గి యు
ద్వేలస్ఫూర్తి దలిర్చు తండ్రియనునబ్ధిం జంద్రుఁడై తోఁచినన్
బోలుంగాక భవాదృశుం డితరుఁడై పుణ్యంబులం బాసినన్
సాలగ్రామఖనిం జనించునెకదా జాత్యల్పపాషాణముల్.

ఏనమ్ముదు గడవగఁ ద
త్పానులు కసుగందు లగ్రజుండవునీ వి
లైన తఱి నెంతదుఃఖమొ
యానీప్రా పాసపడెడు నిరుగురువులకున్.

బడబడఁబాఱుచున్ వడకు పట్టిన తల్లిని దండ్రి నేలలో
వెడలని తమ్మగుజ్జుల నవీన కులాంగన నోరులేని యీ
తొడుకుల బంటుఁజైద విడద్రోవక బ్రోవఁగ నెందు నీక పా
ల్పడినది కర్ణనొదలన భారత సంహిత నిల్చుచాడ్పునన్.

నాదు సహోదరుండు సుజనస్తవనీయ నయప్రసక్తి బ్ర
హ్మాదుల మెచ్చఁ డే నతని యజ్ఞమునం గడుఁబూజ్యరాలనై
వేది యలంకరింతునని వేపురిలోపల నాడుకొందు నీ
వేదియు లేక సర్వగుణహీనుఁడవౌట యెఱుంగఁ దమ్ముడా.

వీరావేశముదాల్చి సర్వధనము న్వెచ్చింతుగాకేమి ము
క్కారుం బండు నఖండసేతువృతముల్ కాశ్మీరఖండంపు గే
దారంబుల్ తెగనమ్మఁ గాఁ జనునె నిర్దారుండవే వెన్క నె
వ్వారు న్లేరె సహోదరాదులు కులధ్వంసంబు నీ కర్మమే.

ఈ మందలింపులతో శర్మ యొకింత కాలమైన కుదురొందియున్నాడు. కుటుంబంలోని వారి విషయమున మాటల తీరులో నలవడు మార్దవము క్రమంగా సహజ ప్రవృత్తిగానే పరిణమిస్తుంది. అది సభ్యవర్తనమనీ నీతి శాస్త్రము తెలుపు చున్నది. సభ్యప్రవర్తనమును గూర్చిన సంప్రదాయా లింకా ఉన్నవి. పరుషభాషణమును మన నీతిశాస్త్రము నిషేధించినది. మాటాడు మర్యాదను గుఱించి భారత మిట్లు తెలుపుచున్నది.

''ఎదిరికిఁ బ్రియమును హితమును
మదికింపును గాగఁ బలుకుమాటలదికై ప్ర-
యొదివినను లెస్స యటుగా
కిదియది యనకూరకునికి యెంతయు నొప్పున్.

చెలిమియుఁ బగయును చెలివియుఁ
గలకయు ధర్మంబు పాపగతియును బెంపున్
దులువతనంబును వచ్చును
బలుకుబడిన గానఁ బొసగఁ బలుకఁగవలయున్.

తనువున విఱిగిన యమ్ములు
చనువునఁ బుచ్చంగవచ్చు నతి నిష్ఠురతన్
మనమున నాటిన మాటలు
వినుమెన్ని యుపాయములను వెడలునె యధిపా''
(భార—ఉద్యోగ-విదురనీతి.)

అలమికొని యొండొరుల ప్రో
పులఁ బ్రాపుల నెలమికలిమిఁ బొంది బహుజ్ఞా
తులు నెమ్మిఁగూడఁ దామర
కొలని క్రియన్ సిరికిఁ బట్టగుదు రుజ్జ్వలులై ॥
(భార—ఉద్యోగ-సంజయురాయబారము)

# ఆర్షకుటుంబము

## తొమ్మిదవ నివాళి

# వత్సలు

''నిండు నిలువెల్ల ప్రేమతో నింపుకొన్న
మొదలు గొన్న రస బ్రహ్మలోయి సృష్టి
నాకళించికొఁగ వెదకులాడువార
లెలమి బాల తపస్వుల కెందు శుభము''

ఆటలుపాటలు, చింతాచీకూ లేని చిత్తవృత్తులు, అన్నిటినీ ఆకళించుకో వలెననే బలపాటం వారి వ్యాపారం, వ్యాసంగం. ఇదే నిసర్గమైన విద్యా వ్యాహృతి. లౌకిక వ్యాపారం మొదలు అతిలోక వ్యాపారం వఱకు సకలమూ దీని వల్లనే వా రవగతం చేసికొంటున్నారు.

సరే వారి విద్యతీ రెలాంటిది? ఇదుగో, విద్య కుపక్రమించబోతూ ముందుగా గురుశిష్యులు ప్రార్థిస్తారు.ఆవిద్యాలక్ష్యమును,దానికి అవసరమైన పరిసరాలనూ ఆమంత్రమే సూచిస్తుంది. సర్వశక్తిదాత పరాతత్త్వ మీశ్వరుడు. కనుక తమ లక్ష్యము ముని ముందుగా కృతజ్ఞతా పూర్వకముగా స్మరిస్తున్నారు. ''మే మే లక్ష్యము నుపాసింప నుపక్రమిస్తున్నామో ఆ లక్ష్యమే మాకు రక్ష''. ఆ విద్యా ప్రయోజనమో: ఆనందము, శాంతి. సంశయ సంభ్రమాలతో ప్రతిపాదించే శాంతి కాదది, అభిమానాలకు అభిమతాలకు ముసుగైన శాంతికాదు; శాంతి నినాదము కాదు; నియన్త్రితము—నిర్జీవమునైన శాంతికాదు; తుఫానుకు ముందుండు శాంతీ కాదు, తుఫాను తరువాత నుండు వికటము, విరూపమునైన శాంతికాదు; వంచనలలో వసివాడని శాంతి, చేతనాత్మకమైన శాంతి, విశ్వకల్యాణ వికాసముల కోసమైన శాంతి.

అభ్యర్థనాలకూ, ఆదేశాలకూ అంద దది. అంతరమునుండి ఆవిర్భ వించు దివ్యశక్తి ఎవరికి వారే దానిని ప్రేమించి, ఉపాసించి అనుభవించవలసి నదే. దాని నెవరో ప్రసాదిస్తారనుకోవటం మరో వెకలిదనం. శాంతి నెవరో కొల్లగొంటా రనుకోవటం మరీ వెకలిదనం. నిజమైన శాంతిసాక్షాత్కారం గల స్థితప్రజ్ఞుడు ఘోరవిపత్తులు తొంగి చూస్తూ ఉన్నా, కల్లోలాలు చుట్టూ ముసురు కున్నా, స్మితవదనుడై నిబ్బరంగా యథాప్రకారం తనకార్యారంభాలు విడువక సాగిస్తూనే వుంటాడు.*శాంతి కామి వాచాలుడు గాడు, మిత భాషి, విధేయ బుద్ధి. కార్యతత్పరుడు, పరాశక్తి విశ్వాసి, ఇంకా శూన్యమైన మనఃప్రవృత్తి గాదు శాంతి. కలవరింతలతో తబ్బిబ్బు పడని నిబ్బరమైన నిండు మనస్సు, స్వభావా లను పవిత్రీకరించెడి దివ్యశక్తి వంకకు సంతతోత్సాహంతో విప్పారుతుంది మాతృశక్తి. అట్టి శాంతిలో సుళువుగా పని చేయును. శూన్య మనస్సుకూ స్థిర మనస్సుకూ తేడా– మనస్సు శూన్యావస్థలో ఉంటే ఆలోచనగాని భావముగాని ఉండవు. ఏలాటి మనశ్చలనము లేక, భావాకృతి నొందని వస్తువును తెలిసి కొనేశక్తి మాత్రం కలిగివుండును.

స్థిర మనస్సు–ఎన్నివింతలు వినోదాలు గనుగొన్నా ఘోర ప్రమాదాలున్నా చలింపదు. ఇట్టిశాంతి శాశ్వతం, అభేద్యం, నిండైనది. ఈ తీరు శాంతితో నిండారిన మనస్సు మహాశక్తి సామర్థ్యములతో కార్యకలాపాలలో ప్రవర్తి స్తుంది. అహంకారం నుండి కలుగు ప్రయత్నాలన్నీ మాని పై నుండి ప్రస రించు దివ్య సందేశాల స్వీకరిస్తూ ఉంటుంది. ఉద్రేకించక ఆ సందేశాల కేవేవో కల్పనలు చేయక వాటిని ఉన్నవి ఉన్నట్లుగా వివరిస్తుంది.

విద్యా లక్ష్యం ఆనందం, శాంతి అన్నారు. సరే, వాటిని పొందుట కేమి కావలె? వీర్యం. అంటే? స్థైర్యం-ద్రఢిమ, స్థిరబుద్ధి (సంకల్పం). ఇవి గురు శిష్యుల కిరువురకూ కావలె. ఏపరిస్థితులు అవసరం? ఉద్బోధకం, ఉత్సాహకం,

---

*. గీత 2వ అధ్యాయం శ్లో 66, 70, 71లలో ఇదే భావం వివరింపబడినది.

ప్రసన్నం, చురుకుదనం ఇట్టి పరిసరాలలో పొరపొచ్చములు లేక సౌమనస్యం నిండియుండవలెను. ఇవన్నీ తమకు ప్రసాదింపుమని ఆ ప్రార్థనం[1].

''ఓం (బ్రహ్మము) కారమే మాకు రక్ష; మేమెరిగిన విద్య ఉపయోగ పడుగాక! మాకు వీర్యమును అవిశాల చైతన్యమును భరించి జీర్ణించుకోగల తేజో బలమును ఇమ్ము! అట్టి తేజస్సు గల మాకు వాని అర్థము తేటగా తెలియుగాక! మాలో (గురుశిష్యులలో) పొరపు లొదవ నీయకుము! శాంతి-శాంతి—శాంతి''

ఆముష్మిక విద్యనే విద్య అనదగునని దీని సారం. విద్యను బ్రహ్మ విద్య, పరావిద్య అనుచుండిరి. దీని లక్ష్యం ఉదాత్తమని తెలిసికొన్నాము. దానిని ఉపాసించుటకు ఆరంభమూ ఉదాత్తంగా ఉండవలె. అందుకు ముని ముందుగా ఇంద్రియాలను అదుపులో ఉంచుకొన నేర్వవలె. విద్యార్థి తపస్సు, బ్రహ్మచర్యం, శ్రద్ధ గలిగి మెలగ వలెనట[2]. ఆంతరికశక్తులను ఉన్మీలనము గావించు యత్నము తపస్సు. సృష్టి, స్థితి, లయ స్వరూపమైన దివ్యశక్తిని ఆధ్యాత్మిక సాధనాలద్వారా తనలో మూర్తీభవింప జేసికోవటం[3] తపస్సట. బ్రహ్మమును గూర్చి సాగుట (బ్రహ్మతత్వం, దెలిసికొన ఆలోచన యత్నం) బ్రహ్మచర్యం. జీవాత్మ ప్రసన్నతే శ్రద్ధ[4]. శ్రద్ధగల బుద్ధిలో విషపుటాలో చనలు దొరలవట. మిగిలినవి రెండు బ్రహ్మచర్యంలో ఇమిడి యున్నవి.

---

1 ఓం సహ నా వవతు సహ నౌ భునక్తు సహవీర్యం కర వావహై
తేజస్వి నావధీత మస్తు మా విద్విషావహై "ఓం శాంతిః శాంతిః శాంతిః''
(కఠోపనిషత్ ప్రథమవల్లి)

2 తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా సంవత్సరం సంవత్స్యథ
(అథర్వవేదీయ ప్రశ్నో పనిషత్—1—ప్ర—2మం.)

3 శ్రీ అరవిందుల కర్మయోగ ఆదర్శం

4 విన మునివర వాగ్వృత్తియు మనః ప్రవర్తనముగాంచు మహితశ్రద్ధా
ధనసంపద శ్రద్ధయనం జను నది జీవాత్మ సుప్రసన్నత సుమ్మీ.
(భార-శాంతి-ఆ—5—జాజలితులాధార సంవాదం)

ఆముష్మిక విద్యను అభిమానించి రంటే లౌకిక వ్యాపారాలను నిరాద రించిరని కాదు. ఐహికంగా సంపదను గడించుట ఏమరకు అని ఆదేశించిరి. జీవనోపాధికోసమైన ఐహిక విద్యలను వా రభ్యసిస్తూనే వున్నారు. "మా మనోరథము లనేకము. మా వృత్తులు, ఉద్యమాలు వేర్వేరుగా ఉన్నవి"[1] అని వారు వైదిక కాలానికే చెప్పికొనిరి. యజుర్వేదపు వాజసనేయ సంహిత పృథుమేధ ప్రకరణంలోనూ వేరువేరు వృత్తులవారు పేర్కొనబడినారు. విద్యకంటే వేరైన ఈ విద్యలను అవిద్య, అపరావిద్య, మానుషీ విద్య అనేవారు. ఈ మానుషీ విద్యల ప్రస్తావన ఛాందోగ్యోపనిషత్తులో ఉన్నది[2]. గణితం, శకునం, నిధుల నిరూపించు శాస్త్రం, తర్కం, నీతిశాస్త్రం, దేవ విద్య, భూతవిద్య, క్షత్రవిద్య, నక్షత్ర విద్య (జ్యోతిషం), సర్ప విద్య, గాంధర్వ విద్య, సంగీతం మొదలైనవి. ఇంకా శిల్పం నాట్యం ఆయు ర్వేదం మొదలైన శాస్త్రాలు, కళలూ, వాటివాటి ఉపశాఖలైన వృత్తులు అనేక ముగా ప్రబలి ప్రచార మందుండినవి. బౌద్ధవాఙ్మయంలోనూ, స్మృతులలోనూ అనేక వృత్తులు వివరింపబడినవి. అత్యద్భుతములైన శిల్పాలు, కళామూర్తులు దేశం నాలుగు చెఱగులా ఉన్నవి. మానుషీ విద్యలందు వారికున్న అభిరుచిని, కళాసిద్ధినీ అవే నిదర్శిస్తున్నవి. భారత మందలి మయసభ వర్ణన, రామాయణ మందలి అయోధ్య వర్ణన చూడండి. వారి కళాసక్తి, పరాకాష్ఠత కనుపిస్తుంది.

స్త్రీ పురుష లిరువురూ చాలినంత లోకజ్ఞానమూ, కళాకౌశలమూ గలిగి యుండిరి. ప్రతివ్యక్తి 64 కళలలో అభినివేశం కలిగి యుండవలెనట. అట్టి వాడే నాగరికుడుగా నెంచబడువాడు.

---

1 నానానం వా ఉం నో ధియో విప్రతాని జనానామ్ (ఋ—9—112—1)

2 ఛాందోగ్యోపనిషత్ 7 ప్రపా—1—ఖం-2 మం.

వారు యంత్రములను కూడ ఎరిగి యుండిరనుటకు అవకాశమున్నది. శ్రీ దయానందుల వారు[1] శ్రీకృష్ణ ఓఝూ గారు[2] మొదలైన వారు వేదాల లోనూ యంత్రశిల్పపు ప్రస్తావన లున్నవంటారు. అట్టి ఉదాహరణలూ వారు చూపినారు. అత్రిమహర్షి తొలుత తురీయ బ్రహ్మతో సూర్యగ్రహణ మును తెలుసుకొన్నాడట[3] ; తురీయ బ్రహ్మ అంటే వలయంలో నాల్గవ భాగంగా నుండు యంత్రమని శాయనులవారు వివరించిరి. ఈ యంత్రము క్వాడ్రెంట్ (Quadrant) వంటిది కావచ్చు. మంత్రం అగ్ని శక్తితో కూడిన యంత్రమును సూచిస్తున్నది. "అగ్నీ! శిల్పి (త్వష్ట) నిన్ను మిగుల బలీయుని (సువీర్యం = శక్తి మంతుని) జేయుచున్నాడు. నీవు వేగవంతుడవై గుఱ్ఱపు పనిని నిర్వహించు చున్నావు[4]. ఋభువులు, త్వష్ట, విశ్వకర్మ వైదిక కాలపు స్థపతులు, శిల్పులుగా కన్పిస్తున్నారు. క్షేత్ర కాలాన విశ్వకర్మ, మయుడు వరుసగా దేవతలకు రాక్షసులకు శిల్పులుగా నుండిరి. వీరి శిల్ప నిర్మాణముల గురించిన గాథలు ఉన్నవి. ఋభువులు పాలిచ్చెడి ఆవును నిర్మించిరట. తమంత తాముగా రథమునకు పూన్చికొనెడి గుఱ్ఱాలను చేసిరట[5]. కౌటిల్యుని అర్థశాస్త్రంలో యుద్ధములం దుపయోగించెడి యంత్రములెన్నో పేర్కొన

1 వేదాలనుండి విమానం, స్వయంగా నడచు నౌక, టెలిగ్రాం మొదలైన వాని వర్ణనలున్నవని ఆయా ఋక్కుల కట్టి అన్వయాలను చూపిరని, 1885 శకసం॥ పాల్గునపు 'త్యాగభూమి' హిందీ సంచిక వేదమే శిల్ప విజ్ఞాన్—అట్టి ఋక్కులు ఋ-1-116-3—4.

2 కాశ్యప శిల్పమను వాస్తు గ్రంథమునకు ఉపోద్ఘాతంలో వేద ఋక్కులను పేర్కొని ఆదిమానములను దెల్పునని అన్వయించిరి. త్యాగభూమి 1885 శక సం॥ పాల్గునపు సంచిక "వేదమే శిల్ప విజ్ఞాన్"

3 ఋ మం 5 — ఋక్ 4 ; ఋ 1—1—2—7 శాయన భాష్యం.

4 త్వమగ్నే : త్వష్టా విధతే సువీర్యం : త్వమాశు హేమా రిరిషే స్వశ్యం ఋ 2—1—5

5 ఋ మం 1 అను 5 మత్రం 195—196.

బడినవి. వాత్స్యాయనుడు చౌషష్టి కళలను దెలుపుటలలో 1'యన్త్రమాతృక'ను చెప్పగా దానికి జయమంగళుడు ''తీరు తీరున జీవ నిర్జీవ యంత్రముల నిర్మించుట'' అని వివరించినారు. సజీవములు మహాప్రాణుల సహాయముతో నడుపబడునవి. నిర్జీవములు తాముగా పని చేయునవి (Automatic) గావచ్చు. 'దండి జీవిత చరిత్ర' లో మాంధాత, అతని కుమారుడు-లలితాలయుడు ప్రసిద్ధ శిల్పులుగా పేర్కొన బడిరి[2]. లలితాదిత్యుడు అద్భుతమైన యన్త్రాల నిర్మించి ప్రదర్శించెనట. ఇంకా కృత్రిమపు మేఘాలను కలిగించి పెద్దవాన గురియు యన్త్రమును నిర్మించినాడట! యన్త్ర శాస్త్రములో మిగుల ప్రజ్ఞాళువితడు. ఇతడు యన్త్రాలను స్థిరము, చరము, ధారా, ద్వీప? (ద్విప), జ్వరము, వ్యామిశ్రము అని వర్గీకరించినాడు. వీటిలో ధారా అనేవి నీటిని చిమ్ము యన్త్రమగును. కౌటిల్యార్థ శాస్త్రంలో వాయు యన్త్రపు సహాయముతో సంపాదించిన నీటితో సాగుచేసెడి పొలాలకు విధించవలసిన పన్ను పరిమితి తెలుపబడినది.[3] ఈ వాయు యంత్రాలు గాలిపంపు విండ్ మిల్ (wind mill)గాక మరేమగును? ఉదయాన్త్రికుల(నీటియంత్రాలుచేయువారి) సంఘమును గురించినది నాసికలో శాసన మొకటున్నది[4]. నిరుక్తకారులు, యాస్కులు వైశ్వానర వర్ణన చేస్తూ తాలము అనగా లెన్సు (Lense)తో సూర్య కిరణాలను కేంద్రీకరించి అగ్నిని పుట్టించుట నిరూపించిరి. 11వ శతాబ్దివాడు భోజరాజు శిల్ప వాస్తువుల గూర్చి ''సమరాంగణ సూత్రధార'' మును రచించినాడు. దానిలో యన్త్రముల విషయకంగా ఒక అధ్యాయమే

---

1 Yantras or Mechanical contrivances in Ancient India p. 9. by V. Raghavan M. A. Ph. D.

2 ఇది తిరువాన్కూరు ప్రాచ్య లిఖిత పుస్తకాలయంలో ఉన్నది. వారు T. S. S. No. 172గా దానిని ప్రచురించినట్లున్నది.

3 కౌటిల్యార్థశాస్త్రం అధికరణం-3 ప్రకరణ 61 ధర్మస్థీయం

4 నాసిక శాసనంNo.15 (IBID. P.89)

యున్నది.[1] "ఏదో వినోదం కోసమైన రచన కాదిది" అని రచయితే చెప్పి నారు. అనుపూర్వికంగా వస్తున్న ప్రయోగ జ్ఞానం కొఱవడితే ఇది (ఈ శాస్త్రం) కొఱుకుడు పడదనీ వారు స్పష్టంగా చెప్పినారు. అది నిజమే. పుస్తకాలను చదివినంత మాత్రాన ఏ శాస్త్ర ప్రయోగమునుగాని, యే వైజ్ఞానిక ప్రయోగమునుగాని, యే యంత్రమును గాని నేడైన నిర్వహించగలరా? ఆయాశాస్త్రాలు ఎంత సులభశైలిలో ఎంత విస్పష్టంగా చెప్పినా ప్రత్యక్ష ప్రయోగ శిక్షలేనిది ఏదీ నిర్మించలేరు. నిర్వహింపనైనా చాలరు. 'యన్త్ర' మన్న మాటను భోజుడిట్లు నిర్వచించిరి[2] "స్వేచ్ఛగా ప్రవర్తించే భూతాలను (పంచ భూతాలు) ఆపి ఒక పనిలో ప్రవేశపెట్టుట లేదా తమతమ అభిరుచుల కనుకూలంగా నడచు తీరుగా స్వబుద్ధితో భూతాలను దేనివల్ల నియమింప దగునో అదీ యన్త్రం. "ఈ యన్త్రాలకు బీజాలు (మూల శక్తులు.)నాలుగు. భూమి, నీరు, అగ్ని, గాలి యట. పాదరసము ఉపయోగించు నని కొందరన్నారట. కాని దానిని గూర్చి విశేషించి తెలియదట. ఈ పై నాలుగు భూతాలు ప్రధానమైనవనీ, అయిదవదైన ఆకాశం (Vacuum) స్వయంగా గాక పై నాలుగు భూతాల నాశ్రయించి బీజముగా అగు ననిరి. ఈ భూతాల శక్తులను (Powers) ఉపయోగించి యన్త్రాల నడుపువా రని తలచదగును.

---

1 సమరాంగణ సూత్రధార అధ్యా-31.

2 యదృచ్ఛయా ప్రవృత్తాని భూతాని స్వేనవర్త్మనా
నియమ్యాస్మిన్ నియతి యత్ తద్యన్త్రమితి కీర్తితం.
స్వచ్ఛేన ప్రవృత్తాని భూతాని స్వమనీషయా
కృతం యస్మాద్యమయతి తద్వా యన్త్ర మితి స్మృతమ్॥
తస్యబీజం చతుర్ధాస్యాత్ క్షితిరాఽపోఽనలోఽనిలః
ఆశ్రయత్వేన చైతేషాం వియద ప్యుపయుజ్యతే ॥
భిన్నస్సూ తశ్చ(త్రైః)? (యై) రుక్తస్తైచ సమ్యక్
ప్రకృత్యా పార్థివః సూతస్తా? (స్త్ర) యాత్ తత్రకిర్యా భవేత్॥
(సమరాంగణ సూత్రధార)

వీటిలో జలశక్తి (Water Power) వాయుశక్తు (Wind Power)లను ఉపయోగించినట్లు నిదర్శనము లగపడును. భోజునివే యీయ న్త్రిముల గూర్చి తెలుపు రచనలు మరి రెండు వినవస్తున్నవి. "శృంగార మంజరీ"[1] భోజ ప్రబంధము"[2]లు. శృంగార మంజరిలో యన్త్రిమేఘాలు మొదలైన వాటినిగూర్చి వివరింపబడినదట. భోజపరిబంధములో అతివేగంగా స్వయంగా పరుగెత్తు రథాదులను గురించి వివరింపబడినదట. అలెగ్జాండరు భారతదేశముపై వెడలిన దండయాత్రలను పరిశీలించుటలో ఫిలోస్ట్రాిటస్[3] (Philostratus) ఉదాహరించినాడు. "స్వర్లోకం నుండి తుఫాను, పిడుగులు వర్షిస్తూన్నట్టుగా కల్పించి హిందువులు తమ శత్రువులను తరిమివేస్తారు." తాళవృ న్తమనీ వాతచక్రమనీ చెప్పబడిన యన్త్రి ప్రభావ మిది కావచ్చు. వాయవ్యాస్త్రమను నదీ కావచ్చు. ప్రాచీన వాఙ్మయములో శిల్ప సంహితాకారులు 18 గురు కనుపిస్తున్నారు[4]. వారు : భృగువు, అత్రి, వసిష్ఠుడు, విశ్వకర్మ, మయుడు, నారదుడు, నగ్నజిత్తు, విశాలాక్షుడు, పురందరుడు, బ్రహ్మ, కుమారుడు, నందీశుడు, శౌనకుడు, భర్గుడు, వాసుదేవుడు, అనిరుద్ధుడు, శుక్రుడు,

---

1 'Yantras or Mechanical contrivances in Ancient India by Dr. V. Raghavan' లో ఉదాహరింపబడినది.

2 సత్యార్థ ప్రకాశము ఏకాదశసముల్లాసములో దీని విషయము వివరింపబడినది. ఇది ముద్రింపబడినది. మోతీలాల్ బెనారసీదాస్ వారి కేటలాగులో కన్పిస్తుంది.

3 H. M. ELLIOT : Histroy of India Vol. VI. A P P. P. 477.

4 భృగురత్రి ర్వసిష్ఠశ్చ విశ్వకర్మా మయ స్తథా
నారదో నగ్న జిచ్చైవ విశాలాక్షో పురందరః
బ్రహ్మా కుమారో నందీశః శౌనకో భర్గఏవచ ।
వాసుదేవోఽ నిరుద్ధశ్చ తథా శుక్రో బృహస్పతిః ॥
మత్స్య పురాణమ్ అ—252.

బృహస్పతి. వీరు మానుషీ విద్యల నారాధించి, వాటికి మహితస్థాన మొసగి, దేశమును సుసంపన్నము సుందరముగా వెలయించినారు.

ఒక్కొక్క ఋషికి ఒక్కొక్క ఆశ్రమము ఉండేది. ఈ ఆశ్రమాలు పల్లెలకు, పట్టణాలకు దూరంగా ఉండేవి. సామాన్యంగా క్రోసు, రెండు క్రోసులకు తక్కువగా నుండెడివికావు. నదీ తీరాలను, పర్వతాలను ఆశ్రయించి ఉండేవి వాటిని చుట్టి అడవి యుండును. ఆ అడవి తీరుతెన్ను లేని చీకిరి బాకిరి చెట్ల పొదలతో నిండి యుండునని తలచ వలదు. చూడ నింపై ఉల్లాసకరంగా ఉంటుంది. భారతీయమగు ఆరామ కళ కది తొలిరూ పనవచ్చును. అందలి చెట్లు, లతలు, గుల్మాలు అపురూపమైనవి కావు. సామాన్యములు స్థానికంగా సులువుగా పెంపగునవి. ఆ ఆశ్రమములు ఆడంబరములు లేక సహజ సౌందర్య సంపన్నములు. మచ్చు కొకటి: కణ్వా శ్రమమును మహాకవి కాళిదాసు పరిచయ మొనరిస్తున్నాడు. ఆశ్రమంలో వృక్షవాటిక నాటిరి. అవి నిసర్గ శోభగల పాదపాలు. ఆయా ఋతువులలో చిగిర్చి, పుష్పించి యుండగా వనదేవత (భగవతి)సింగారించు కొన్నట్లుండును. రంగు రంగుల పూలు పూయు చెట్లు, లతలు, గుల్మాలను గూడ ఆ యా స్థానాలలో నాటుదురు. ఈ పాదప పాలనం ఆశ్రమ వాసుల కత్యంతము ప్రియము. పసిపాపలనువలె ఆ పాదపాల చూచు కొనువారు. ఋషి కన్యలు వాటికి నీరు పోయువారు. బాలబాలికలూ పాదప పాలనములో ఉల్లా సంతో వారికి తోడ్పడుచుందురు. మరింత మక్కువగల లతలకు, పాద పాలకు ముద్దు పేరులు పెట్టి పిలుచువారు. అలంకరించు కోవటం కోసరమైన వీటి చిగురులు గాని, పూలుగాని గిల్లనైనా గిల్లరు. అంతటి ప్రాణాధికంగా ప్రేమించువారు. మాలినీ (నదీ) తీరాన తీగెలు పెనగొని యుండెను. మహోన్నత వృక్షాలూ ఉండెను. ఆశ్రమంలో జలాశయమూ ఉండెను. నదుల నుండి ఒరవ కాలువలగుండ ఆ జలాశయమునకు నీరు పారు చుండును. ఆ కాలువల కిరుదరుల మహోన్నత వృక్షాలు బారలు చాచి యుండెను. జలాశయములో పద్మాలు వికసించి ఉల్లాసించు చుండును.

ఆర్షకుటుంబము

ఆ వృక్ష వాటికలోని ముదిచెట్ల తొఱ్ఱలలో శకున్తములు సంతానము కంటూ తరతరాలుగా కాపురాలుండును. లేళ్లు మొదలైన సాధు మృగాలు బెదురు లేక అరమోడ్పు కనులతో నెమరు వేయుచూ ఆశ్రమ వాసుల నడుమ మచ్చికతో మెలగుతూ ఉంటవి. నెమళ్ళు ముంగిళ్ల నర్తిస్తూ, చిలుకలు, గోరింకలు, కోకిలలు గీతా లాలాపిస్తూ. విస్రింభంగా విహరిస్తూ ఉంటవి. లేడిపిల్లలు అరకొరికిన గడ్డిపోచల గఱచికొని గంతులిడుతూ ఉంటవి.

ఇట్లు సురుచిరమైన వృక్ష వాటిక నడుమ ఋషుల కాపురం. వారి నివాసాలు సామాన్యములే. నిరాడంబరాలు: శుచి మంతములు. ఆకులతో కప్పిన కుటీరాలు. వీటిని "ఉటజము" లందురు. అతిథులకోసం ప్రత్యేక మొకమండప ముండును. అది కులపతి ఉటజమునకు సమీపాన ఉండును. దాని చుట్టూ అరటులు మొదలైన శైత్యవృక్షాల నాటుదురు. అవి అతిథులకు శ్రిమ పోగొట్టి హాయి నిచ్చుటకే.

ఆశ్రిమమునుండి హోమధూమములు లేచి ఆకసము నావరిస్తూ ఉంటవి. ఎట్లన ఋషి సందేశముల దివ్యుల కందించ బోవు దూతల వలె. పఠనపాఠనాలు, వేదనాదాలు, శాస్త్రవాదాలు సదా సందడిస్తూ ఉంటవి. ఋషియోషలు జలాశయాల జలకాలాడి నీటి బిందెల గొనిపోవుచుందురు. వారి చీర చెఱగుల నుండి జారెడి నీరు సన్ననిధారలై దారిని కారు చుండును. ఋషి పత్నులు, కన్యలు ధరించు అలంకారాలు నైసర్గికములు. చిగురుటాకులు, పూవులు, ఆశ్రిమవాసులగు స్త్రీలూ పురుషులూ కట్టు పుట్టాలు ఆ ఆశ్రమవృక్షా లిచ్చు నారచీరలు. తలంటులకు గారకాయ ముద్దలు. స్త్రీల పాదముల పారాణికి లక్కరసం. ఈ తీరుగా వారి జీవితావసర వస్తుచయము నంతా ఆశ్రిమ భగవతియే వారి కమర్చును. ఇట్లు ఆశ్రమాలు స్వయంపోషకాలుగా నుండెడివి.

ఆర్షవిజ్ఞాన మంతా ఈ ఆశ్రిమాలలోనే పుట్టి పెరిగి వ్యాపించినది. ప్రితి ఆశ్రమము ప్రశాంతంగాను విజ్ఞాన నిలయంగాను ఉండేది. ఆయా

విద్యలను విద్యార్థులకు సుష్ఠుగా బోధించుచుండిరి. సూక్తకాలాన తండ్రియే బోధిస్తూ ఉన్నట్టు తోస్తూంది. విద్యవిస్తృతమైన కొద్దీ గురువులు అక్కరైనారు. దానితో ఆశ్రమాలు గురుకులాలైనవి. విద్యార్థులుగా వచ్చిన యితర బాలురు తమ కుటుంబంలో కలసి నివసిస్తూ ఉంటారు. ఉపనిషత్కాలానికే యీతీరగపడుతూ ఉన్నది. మరికొంతకాలానకు బహుముఖములుగా విద్యలు బోధించెడి విద్యాపీఠములు వెలసినవి. ఇవి పట్టణాలకూ పల్లెలకూ దూరంగానే ఉండేవి. ఆయాశాస్త్రాలలో కూలంకషప్రజ్ఞగలవారే యీ విద్యాపీఠాలలో ఆచార్యులుగా నుండేవారు. అట్టివారు బహుళంగాను ఉండేవారు. వారాయా శాస్త్రాలను విద్యార్థులకు చక్కగా తెలియజెప్పువారు. గురుకులాలేదో ఒక విషయమున శిక్షనిచ్చునవి. ఎవరేశాస్త్రమును గోరితే దాని నభ్యసించువారు. ఒకశాస్త్రముతో తృప్తినొందని వారొకశాస్త్రమున పారంగతులైన పిదప మరొక శాస్త్రమును అభ్యసించుచుండిరి.

తక్షశిల, నలందా, తామ్రలిప్తి, ధాన్యకటకం (ధరణికోట) మొదలైన విద్యాపీఠాలు జగత్ప్రసిద్ధి నొందినవి. వీటిలో ''తక్షశిల'' మహాప్రఖ్యాతమైనది. "శ్రీరామచంద్రుని సోదరుడైన భరత కుమారుడు విద్యాపీఠమును స్థాపించెనట. ఇది సింధు-వితస్తలకు నడుమ నున్నది." భాగవతమును తెలుపును. నేడది ఆఫ్ఘన్‌స్థానములో భాగమైనది. ఐతిహాసిక యుగములోనూ ఇది ప్రసిద్ధి నొందినదే. బౌద్ధయుగాన దాని ద:దాపుల వెలుగొందిన విఖ్యాత చారిత్రక పురుషులనేకులు ఈ విద్యాపీఠపు విద్యార్థులే యగుట గమనింపదగును. బుద్ధుని సమకాలికుడు- కోశలేశ్వరుడు- ప్రసన్నధీ, చాణుక్యుడు, అశోక వర్ధనుడు, ఆయుర్వేదాచార్యుడు సుప్రసిద్ధుడు, జీవకుడు, ఆయుర్వేద సంహితాకర్త చరకాచార్యులు, ఈ విద్యాపీఠాననే శిక్షణ పొంది యుత్తీర్ణులైరట. తథాగతుడు- గౌతమబుద్ధుడు ఈవిద్యాపీఠపు విద్యార్థియేయగుట గమనింపదగును. ఈ విద్యాపీఠము విదేశీయులను ఆకర్షించునది. క్రీ.శ. 45 ప్రాంతాన ''అపలోనియస్'', ''థామస్'' అను గ్రీకు విద్యార్థులు ఈ విద్యాపీఠాన విద్య నభ్యసించిరి. ఈ విద్యాపీఠములో అనేకశాస్త్రాలున్నా ఆయుర్వేద శిక్షణకు మిగుల పేరొందినది. ఈ విద్యాపీఠపు పరిసరాలలో అమూల్యములైన

ఓషధులు (చికిత్సకోపయోగమైనవి) పండిగా నుండెడివట. "సృష్టిలోగల తరులతా గుల్మాది ఓషధీజాలమంతా ఇక్కడే ఉన్నట్లున్నది." అని విదేశీయులు యవన రోమన్ ఐతిహాసికులు స్ట్రాబో, ప్లినీ, టోలమీలు పేర్కొన్నారు. చీనా యాత్రికులు హ్యూయన్‌త్సాంగ్ శిష్యులు 'హుల్వీ', 'యన్‌–చుంగ్' నలందా విద్యాపీఠాలను వర్ణించినారు. ''500 వర్తకులు ఒక ఉద్యానమును కొని బుద్ధభగవానుని కర్పించినారు. బుద్ధభగవానుని నిర్యాణాంతరము ఆదేశపు రాజు శక్రాదిత్యుడీవిద్యాపీఠాన్ని నెలకొల్పినాడు. దీనిచుట్టూ ఉన్నతమైన ప్రాకార మున్నది. ఈ సంఘారామం నడుమను 8 మండపాలలో విద్యాపీఠ మున్నది. ఆభవనాలు మిగుల పొంపైనవి. వాటిగోపురాలు మహోచ్చములై వాయుమండలంలో నీదులాడుచూ ప్రత్యూషతుషారముల దోబూచు లాడుచుండును. వాతాయనాలనుండి చూడగా పవన పయోదాల సయ్యాటలు వింతగొల్పుతూ ఉంటవి. భవనాలనుచుట్టి మంజులారామ మున్నది. దట్టమై చల్లని నీడలనిచ్చు రసాలాల చాళ్లూ ఎఱ్ఱగోరింట పొదరిండ్లూ ఉన్నవి. సూర్యకిరణాలలో గోరింట పూగుత్తులు తళతళ లొలుకబోస్తూ ప్రకృతి జయపతాకములట్లుంటవి. ఆరామమందలి జలాశయాలు గంభీరాలై నీలనీల నీరదాల తీరున నుంటగా వాటిపైన నల్లతామరలు, ఎఱ్ఱతామరలు, కనకపుతామరలు కలగలసి యుండును. గాలి కూనలు వాటిపై చిందులాడుచూ ఊయలలూగుతూ ఉంటవి...."ఇంకెంతో వర్ణించినారు.

ఈవర్ణనలను బట్టి చూస్తే విద్యాపీఠాలు ఆశ్రమాలవలెనే ఆపాత రమణీయాలై ప్రశాంత పరిసరాలు గలిగి వివిధ విద్యావ్యాసంగాల ప్రసంగాలతో శోభిస్తూ ఉండే వనవచ్చు. ఆశ్రమాలలో అతిసామాన్యమైన కుటీరా లుంటే విద్యాపీఠాలలో భవనాల పొందిక యుండేది. ఇంతకుతప్ప శిక్షణలో రెండింటా తేడా కనిపించదు.

కాలక్రమాన ఈ ఆశ్రమాలూ విద్యాపీఠాలు మధ్య యుగపు చివరకు సన్నగిల్లిన వనవచ్చు. వాటి స్థానంలో బ్రహ్మదేయాలు (అగ్రహారాలు), దేవాలయాలు, మఠాలు వెలసినవి. మంధెన, కాకరపఱ్ఱు మొదలైన అగ్రహారాలలో మొన్న మొన్నటిదాక ఈ విద్యాప్రచారం, బోధ జరుగుతూ ఉండేవి. ఒక్కొక్క అగ్రహారము ఒక్కొక్క శాస్త్రానికి ప్రసిద్ధి పొంది వుండేది. ఇట్లే దేవాల

యాలు,మఠాలు ఒక్కొక్క విషయాన కొక్కొక్కటి పేరొంది, ఆయా శాస్త్రాలను, విద్యలను పోషించు చుండెడివి. ఈ దేవాలయాలను,మఠాలను ఆశ్రయించి పండితు లుండేవారు. విద్యార్థులకు వారు ఆయా శాస్త్రాలను విద్యల శిక్షించు చుండగా దేవాలయాలు మఠాలు గల సత్రాలలో విద్యార్థులకు భోజనాది సౌకర్యా లొదవించెడివారు.

ఇంకా ఆయా శాస్త్రాలలో కూలంకష ప్రతిభగల ఉద్దండ పండితులూ, శిల్పాచార్యులూ,కళానిధులూ దేశం నాలుగు చెఱగులా అందందు ఉండేవారు. వారు తమ విద్యలు తమలోనే అంతరించకూడదని గాఢంగా అభిలషించెడి వారు. అందువల్ల శిష్యులను జేరదీసి ఆయా శాస్త్రాల శిక్షించి ఉన్నతుల జేసే వారు. ఈ తీరున ఆయా శాస్త్రాలలో విశిష్టులైన ఆయా ప్రాదేశిక పండితుల యొద్ద శిక్షితులైన వారి కెంతో సభాగౌరవ ముండేది.

ఇక గృహస్థుకు సామాన్యంగా నిత్యవ్యవహారము నిర్వహించుకొనుటకు తగుపాటి ప్రాథమిక విద్యను నేర్పు పంతుళ్లు పల్లెపల్లెనా ఉండువారు. సామాన్యంగా ఈ పాఠశాలలకు దేవాలయాలే నెలవులుగా ఉండేవి. ఈ చిన్న బడులు క్రమంగా ఆయా పంతుళ్ల వీథి అరుగులనే నెలవుగొన్నవి. కాగా వీటిని వీథి బడులన్నారు. ఈ చదువులు పెద్ద చదువులు కాకపోవచ్చు, విద్యల లోతుపాతులు తెలియక పోవచ్చు. కానీ లోకజ్ఞానము కొఱవడదు. నీతి నియమా లేమిటో, సంప్రదాయ లెట్టివో, సభ్య వర్తన మెట్టిదో, ఇచ్చి పుచ్చుకొను మర్యాదలెట్టివో, మాటాడు మర్యాద యెట్టిదో గిరిగీతగా నెరుగుదురు. నిత్య జీవిత వ్యవహారమునకు కావలసిన వరకు అదికాస్త ఇదికాస్త అన్ని విషయాలనూ మప్పుదురు.

మానుషీ విద్యలు (జీవిక కోసమైన వృత్తి విద్యలు) సామాన్యంగా వారి కులవృద్ధులనుండియే శిక్షణ పొందేవారు. ఆయా విద్యలలో ఒక్కొక్క కుటుంబము ఒక్కొక్క విశేషము కలదిగా ఉంటుంది. ఆ విశిష్టతను వంశ పరంపరగా కాపాడుకొనుటకు ఎంతో పూనిక, ఆసక్తి చూపేవారు. శాస్త్రాదుల

విషయాలలో ఒక్కొక్క శాస్త్రానికి ఒక్కొక్క ప్రాదేశిక పండితుడు ప్రసిద్ధి నొందునట్లే ఈ కళలు, శిల్పాలకు ఒక్కొక్కదానికి ఒక్కొక్క ప్రాదేశిక స్థపతి, కళోపాసకుడు ప్రసిద్ధులయ్యేవారు. అట్టి వారిని సేవించే ఆయా శిల్పాలలో, కళలలో ఉత్తీర్ణులైన వారికి మన్నన ఉండేది. ఈ తీరున విశిష్ట శిక్షణ అభిలషించేవారు ముందుగా తమ పితృదేవతలను సేవించి, ఆ విద్యలో ప్రాథమిక శిక్షణ పొందేవారు. అది తన కులవృత్తి కానప్పుడు మాత్రం ప్రాథమిక శిక్షణను ఇతర గురువుల యొద్దనే పొందేవారు. మానుషీ విద్యలలో గురుశిక్షణ పొందుటలోనూ శిష్యుడు గురుకులవాసం చేయవలసినదే. శాస్త్రాది వాఙ్మయ విద్యార్థుల తీరుగానే ఈ వృత్తి విద్యల విద్యార్థులూ బ్రహ్మచర్యాది నియమాలు పాలించవలసినదే.

గవర్నర్ జనరల్ లార్డుబెంటిక్ నాటిదాక ఈతీరు విద్యావిధానం–విద్యాలక్ష్యాలే మనదేశమందంతటా వ్యాపించి యుండెను. మన జాతీయ జీవితానికి జీవకళ నిస్తూనూ ఉండేవి. బెంటిక్ విద్యా సంస్కరణలు మన విద్యపై దెబ్బ గొట్టినవి. ఆ ఆఘాతం దాని హృదయాన్నే విదళించినది. ఉదాత్తమైన విద్యాలక్ష్యమునే గాయపరిచినది. ఇంత దారుణంగా దెబ్బతిన్నా దాదాపు ఆ దశాబ్ది క్రిందటి దాక కొన ఊపిరితో కొట్టుకాడుతూనైనా ఆశాస్త్రాలు, వృత్తి విద్యలు, ఆ విద్యావిధానమూ మన గలిగిన వంటే వాటి సౌష్ఠవమును, ప్రభావమును అదే తెలుపుతుంది.

ప్రతి శిశువునకు 8 సంవత్సరాల ప్రాయం రాగా ఉపనయనసంస్కారం జరుపుతారు యజ్ఞోపవీతం (జంధెం) వేసి గాయత్రీ మంత్రమును ఉపదేశిస్తారు. అదే ఆ సంస్కారం. "ఓం భూర్భువ స్సువః తత్ సవితుర్వరేణ్యమ్ భర్గో దేవస్య ధీమహి ధియో యో నః ప్రచోదయాత్ ఓం'' ఇదీ గాయత్రి. భూలోకం (చరా చర జగత్తుతో నిండి సకల జీవులను భరించెడి భూగోళం), భువర్లోకం (ఈ భూగోళాన్ని చుట్టుకొని ఆవరించి యుండి భూమియందలి జీవుల సుఖస్థితికి సర్వదా సాధకంగా ఉన్న వాతావరణ మండలం), సువర్లోకం (వాతావరణ మండలాన్ని దాటి పైపైనుండి క్రింది లోకాల జీవితమునకు

ప్రధానమైన జీవశక్తులను ప్రసారిస్తూ ఉండెడి జ్యోతిర్మండలం, దివ్యజల పూరం (ఈశరు) గల నభస్సులు, సవిత యొక్క రూపాలు. (అవి ఆయన ప్రభావం వల్ల ప్రభవించి వర్తిస్తున్నవి) అభిలషింప దగిన (పవిత్రము, ప్రశస్తము నైన) ఈ సవితృ చేతన బ్రహ్మమును [భూర్భువస్సువముల కోసము ఉపయుక్తమైన సూర్యుని చైతన్య శక్తి = ఈ మూడు లోకాల మనుగడ సూర్యుని యొక్క యే సృజన శక్తిపై ఆధారపడి యున్నదో ఆ చేతనా శక్తి] మేము కలిగి యుందుము గాక! పవిత్రుడు శుద్ధుడునైన సవితయే [సూర్యుడే] మాబుద్ధులు నడుపుగాక! ఆ సవితయే (సూర్యుడే) మా బుద్ధుల ప్రసారించుగాక! అని అన్వయం. ఆర్ష సంప్రదాయంలో ఈ సంస్కారము మిగుల ప్రాముఖ్యము గలది. ఆ జీవితము కూడ అనుష్ఠించ వలసినది. ఈ ఉపదేశం మానవునకు జ్ఞాన భిక్షను, యోగ్యతను ఇచ్చు నది. ఇక నీవు విద్యకై (బ్రహ్మ విద్య పొందుటకు) యత్నింప దగుదువు దాని కిది ఆద్య శిక్షణ పాఠం అని సూచన. ఇటుపై విద్యార్థి యోగ్యుడైన గురువును అన్వేషించవలె. ఆయన నాశ్రయింపవలె. ఇక తన వారిని విడిచి కుటుంబమునుండి తరలి గురుదేవుని యింట కుదురుకోవలె. తాను విద్యా వ్యాసంగ మెంత కాలం సాగిస్తాడో అంతకాలము గురునింట నివసిస్తూనే విద్య నార్జించవలెను. ఇదే గురుకులవాసం. సామాన్యంగా ఏదేని ఒక వేదమో, శాస్త్రమో, కళో, వృత్తి విద్యో పూర్ణప్రజ్ఞ కలుగు దాక గురుకుల వాసం చేసి నేర్చుకోనే వారు. చక్షు రక్షర జ్ఞానంగానో, శ్రుత పాండిత్యంగానో, పుస్తకాల సంప్రతింపు జ్ఞానంగానో ఉండదు. ఆ శిక్షణ స్వామర్మ సంవిదం, సద్యః స్ఫురణం. ఇట్టి తీర్పునకు సామాన్యంగా 12 సంవత్సరాలు పడ్తుంది. ఆయా విద్యల లోతు పాతులు వైశిష్ట్య వైదుష్యాలు కోరితే ఇంకా ఎక్కువ కాలము విద్య నభ్యసించే వారు. ఆయా విద్యల విస్తృతుల బట్టి 48 సంవత్సరాలదాక కూడ విద్య నార్జించుట కలదు. వీరి పఠనము లన్నీ మౌఖికములే. క్రియాత్మకములైన విద్యలు ప్రయోగ దృష్టాలు. ప్రతి విద్యార్థి విద్యార్థిగా నున్నంత కాలమూ బ్రహ్మచర్యము పాలించ వలసినదే. విద్యార్జనమునకు, బ్రహ్మచర్యమునకూ ఇట్లు లంకె.

మేధా పరిజ్ఞానమైనది విద్య. వీర్య రక్షణ వల్లనే మేధ వికసిస్తుంది. అది విద్యార్థి కావశ్యకమేగదా ! ఆపైన శరీరపు ధాతువులు, పుష్టి గొనగా శీత వాతాతపముల వ్యత్యాసాలవల్ల స్వాస్థ్య మంత తేలికగా చెడదు. కష్టముల నోర్చుకొను శక్తి యొదవును. విద్యార్థి వినయుడై గురుదేవుని యెడల ప్రేమ, పూజ్య భావము గలిగి వుంటాడు. ఇంతేకాదు. గురువు కుటుంబ మంతటికి "తలలో నాల్క" యై వారి కుటుంబములోని వాడుగానే అయిపోతాడు. ఇది అభినయిస్తేను, అలవరచుకుంటేనూ అబ్బేదికాదు. విద్య నది వంటిది. అది నిండారిన కొద్దీ నదిలాగే గంభీరం కాగా వినయం దానంత టదే తేరి కుదురు కుంటుంది. చిర సహవాస సౌమనస్యాల వల్ల ఈ అనుబంధం సహజంగానే యేర్పడును.

భోగ విలాసాలకు విద్యార్థి దూరంగా నుండవలె. మనసును వాటి పంక మ్మళ్లనీయరాదు. ఇంద్రియాల నుద్వేగ పరిచెడి ఆహారాలూ పానీయాలూ మొదలైన వాటిని తీసికొనరాదు. అట్టి ప్రసంగాలు కూడవు. పరుషాలు(తిట్లు ఇతరుల నొప్పించు సంభాషణ) గాని, అశ్లీలాలు (బూతులు- అసభ్య ప్రసంగాలు) గాని ఆడరాదు. స్త్రీలపట్ల మిగుల గౌరవ మర్యాదలు గలిగి మెలగు చుండవలెను. వారిని మాతృదేవతలుగానో సోదరీమణులుగానో భావించ వలెను. ఇంకా పౌరజీవితానికి కావలసిన సభ్య ప్రవర్తనను మర్యాదను తెలిసి కొంటూ ఆచరిస్తూ ఉండవలెను. ఈ గురువు కాదని ఆ గురువు ఆయనను కాదని మరొక గురువు దగ్గరకు ప్రాకులాడుట వారికి సమ్మతం కాదు. గురు శిష్యుల సంబంధము ప్రేమ బద్ధము. కుటుంబ వ్యవహారంగా అది ఉండ దగునని వారి అభిమతము. గురువునుండి గురువునకు ఈ తీరుగా ఉరుకులు పరుగులు తీయుట ప్రేమను పోద్రిది చేయవు. గురువును వరించునపుడే యోగ్యుని వెదకు కోవలె.

విద్యార్థి దశ రెండంతరాలు గలదిగా ఉన్నట్లు తోచును. ఏదేని ఒక విషయమునకు సంబంధించిన శాస్త్రంలో, వృత్తివిద్యలో, శిల్పంలో, కళలో ఆరూఢనం కలుగుదాకగల విద్యార్థి దశ మొదటిది. ఆపైన, విద్యామర్మాలు,

కీటుకులు, ప్రయోగ దక్షత (ఆచరణానుభవం— apprentice) శిక్షణల బొందెడి విద్యార్థి దశ రెండవది. మొదటి విద్యార్థి శిష్యుడు; రెండవదశ విద్యార్థి అంతేవాసి. అంతేవాసులు క్రింది తరగతుల విద్యార్థులకు బోధిస్తూనూ ఉంటారు. నిత్యవ్యవహారంలో ఈ రెండు రకాల విద్యార్థులకూ తేడా గమనింపబడుట లేదు. రెండు పదాలను (శిష్య - అంతేవాసి) పర్యాయ పదాలుగా ప్రయోగిస్తూ ఉన్నాము.

విద్య అని రూఢమైన పరావిద్యనుగాని, మానుషీవిద్యలను గాని అభ్యసించుటకు ప్రాచీన కాలాన ఎవరికీ ఏ ప్రతిబంధకాలు లేవు. లింగ భేదం గాని, వర్ణభేదం గాని అడ్డుగా లేవు. ఎవరే విద్య, ఏ శిల్పం, ఏ కళను అనుభవింపదలిస్తే వారు దానిని నిరాటంకంగా నేర్వవచ్చు. అయితే—తమతమ కులవిద్యలను వదలి పరవిద్యల కోసం ప్రాకులాడుటకు సామాన్యంగా ఇచ్ఛగించువారు కారు. కులవిద్యలనే అంటికొని యుండుటలో కొంత సౌకర్యము వారి కున్నది. కనుకనే వృత్తుల మార్పు ఉండేది కాదు.

అట్లని ఇతర విద్యల నేర్చుటకు ఉపేక్షింపనూ లేదు. ప్రతివ్యక్తి తమ కుల విద్యలకు తోడు మరికొన్ని విద్యలు నేర్చేవారు. 64 కళలలోనూ అభినివేశం లేని వారు నాగరకులుగా ఎంచబడే వారు కారు. కాల మొకే తీరుగా గడవదు. ఆటుపోటులు జీవితంలో తగులుతూ ఉంటవి. కనుక ఆపత్కాలాన ఆయా సమయాలకు అనుకూలంగా వృత్తులను మార్చుకొని జీవించవలెగదా! అందుకోసమే ఈ పరవిద్యలను నేర్చుకోవటం. రాజులు, ధనికులు కూడ ఎందరో ఆపదలలో అట్లు జీవించినారు. అట్టికథ లున్నవే!

వైదిక కాలాన అన్ని వర్ణాల వారికీ స్త్రీలకూ ఉపనయన సంస్కారము ఉండేది. అందరూ యజ్ఞోపవీతాలను ధరించే వారు. వివాహానికి ముందు వధువునకు ఉపనయనము చేయుమని హారిత సంహిత[1] చెప్పుచున్నది. గౌతమ గృహ్య సూత్రాలలోనూ స్త్రీ ఉపనీత కావలెనని స్పష్టంగా ఉన్నదే. శ్రీస్వామి

1. హారిత సంహిత. 21—20—24.
2. "ప్రావృత్తాం యజ్ఞోపవీతినీ మభ్యుదానయన్'' గౌతమ గృహ్యసూత్రమ్.

దయానందుల వారు ఈ విషయమును విపులంగా దెలిపిరి. స్త్రీలు అన్ని రంగాలలోనూ దక్షతతో వ్యవహరించినారు ప్రఖ్యాతలు అయిరి. మచ్చుకు:— ఇంద్రమాతృ గణము, అపాల, లోపాముద్ర, అదితి, యమి మొదలైన స్త్రీలు మంత్రద్రష్టలైన ఋషులట్లే ఛందో గానము చేసిరి. మైత్రేయి, గార్గి, దేవహూతి, ఆత్రేయి, సులభ మొదలైన వారు బ్రహ్మ వాదినులు. గార్గి బ్రహ్మచారిణి: విదుషి; జనక మహారాజపరిషత్తులో యాజ్ఞ వల్క్యునకు ప్రతి పక్షమున నిలిచి తత్త్వ చర్చలు జరిపినది. మైత్రేయి-యాజ్ఞ వల్క్యుల సతి, జ్ఞానవతి, బ్రహ్మ తత్త్వమును గూర్చి భర్తతో చర్చించి ఆ రహస్యము నెరిగినది. సులభ ప్రసిద్ధయైన బ్రహ్మ వాదిని. జనకుని పరిషచ్చ ర్చలలో పాల్గొన్నది. ఖానాదేవి, లీలాదేవి మొదలైన శాస్త్ర విశారదలు, జానా బాయి, ప్రేమాబాయి, లల్ల[1], మీరాబాయి మొదలైన పరమ భాగవతీమణులు. ఇందులేఖ, సుభద్ర, గంగాదేవి మొదలైన శాస్త్రవిశారదలు, కవయిత్రులు. సంయుక్త, ఝాన్సీరాణి, దుర్గావతి, అహల్యాబాయి మొదలైన రాజతంత్ర పరాయణలుగలరు. అశోకుని కాలాన స్త్రీలప్రవర్తన గని పెట్టుతూ ఉండుటకు స్త్రీలలో ధర్మ ప్రచారము చేస్తూ ఉండుటకు స్త్రీలనే ధర్మాధికారిణులనుగా నియో గించేవారు. సాంఘికసేవకు, ధర్మ ప్రచారమునకు జీవితములను అంకితము చేసినవారు బౌద్ధభిక్షుకీవతంసములు ఉండనే ఉన్నారు. అశోకుని కొమార్త, హర్షునిసోదరి "రాజశ్రీ" భిక్షుకురాండ్రై సంఘసేవలో జీవితములు గడిపినారు.

ఈ వీరచరిత్ర వినండి. అశ్మక రాజ్యాన్ని అలెగ్జాండరు ముట్టడించె నట. అప్పుడచటి స్త్రీలు వీరావేశంతో వీరవ్రత దీక్ష బూనిరి. మహాకాళికావ

---

1. ఈమెది కాశ్మీరము. ఈమె పదకవితలోని పదాలను కాశ్మీరంలో జనసామా న్యము పాడుకొనుచుందురట. ఈమెను మన వేమనతో పోల్చవచ్చునట. ఆమె బోధలు వేమన బోధల వలెనే జనసామాన్యమునకు సుపరిచితమైన ఉపమాన ములతో పదాలతో నైతిక ధర్మాలను పదేశిస్తూ ఉంటవట. ఇటీవల మాన్యులు బ్ర. శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు కొన్నిటిని తెలిగించిరి.

తారములట్లు, శత్రుసేనలపైకి దూకి, శత్రుసేనల నడుగెత్తనీక అరికట్టిరి ఆ తల్లుకు తాళలేక పగతురకు గుండె చెదిరినది. ఇట్టే రాజపుత్రాంగన లనేక సందర్భాలలో చూపిన ధైర్య సాహసాలు నిరుపమానములు. వారి వీరగానాలతో ప్రేమకలాపాలతో భర్తలను, కొడుకుకుట్టులను, పరివారమును, కదనరంగాం కురికించిన వీరవనితల గాథలు చిరస్మరణీయాలు. ఆ నారీమతల్లులకు నమో వాకాలు. ఈనాడో ఎవరో వచ్చి తమను కాపాడవలెనని పురుషులే పలవరిస్తారు. ఆత్మ విశ్వాస మెంత దిగజారినదో గమనించండి.

ఇంతకూ ఇన్ని రంగాలలో ఇందరు స్త్రీలు ఇంత దక్షతతో వ్యవహరించి నారంటే, బాలికలుకూడా ధారాళంగా ఆయా విద్యలను అభ్యసిస్తూ ఉండిరని స్పష్టంగా చెప్పవచ్చు. అయితే సామాన్యంగా బాలికలకూ, బాలురకూ మప్పు విద్యలలో కొంత తేడా ఉన్నది. బాలికల కేవిద్యల నెంత మప్పికొన్నా ఇల్లు దిద్దుట, పాపలపోషణ, పాలనసులలో శిక్షణను ఉపేక్షించే వారు కారు. వాత్సల్యమూర్తులైన వారు మాతృత్వము నభిలషిస్తారు. విద్యలు బాలుర కొక తీరు, బాలికల కింకొక తీరువి ఉద్దిష్టములైనవి. బాలికలు గురుకుల వాసము నెరపుట లేదు. వారి మాతృ దేవులే గృహతంత్రము మప్పుదురు. వాఙ్మయ విద్యలో కూడ మాతృదేవి నుండిగాని, పిత నుండిగాని శిక్షను బొందేవారు. లలితకళలను, వినోదకళలను గూడ కులవృద్ధులనుండి గాని, మాతనుండి గాని అభ్యసించువారు. చదువుట, వ్రాయుట మొదలైన వాఙ్మయ విద్యల శిక్షణ బాలురకు, బాలికలకు సమానమే. సంగీతం, నృత్యం, చిత్రలేఖనం మొదలైన లలితకళలూ, పాకశాస్త్రం, సూచీవానకర్మలు (కుట్టుపని, లేసుల వంటివి అల్లుట, బుటేదారు పని) గంధయుక్తి (అత్తరులు, అంగరాగాలు, సుగంధ ద్రవ్యాలు చేయుట) అలంకరణ విద్య, బాలక్రీడనం (పిల్లల నాడించుట) చిన్నపిల్లలు లాలించుటలో చతురత కావలెను. చిరుతప్రాయాల వారి హృదయాలకు హత్తించిన విషయాలు చెరిగి పోవు. కాన వారి కావిషయాలు వివరించి తెలుపుటలో ఓపిక మెళకువ కావలె (పసితనాన పిల్లల బుద్ధి నిశితంగా ఉంటుంది. ప్రతిదానిని మూలమట్టము దెలిసికోవలెననే గాఢమైన కోరిక వారి కెల్లప్పుడూ ఉంటుంది. అదే గర్భితమై యున్న సహజ విద్యాభిరుచి. వాటి వాటి

మర్మాల నాకళించుకోవలె ననే వారు తఱుచుగా చనువున్న పెద్దవారిని 'అదేమిటి? ఎందుకు? ఎట్లా?' అని ప్రశ్న పరంపర క్రుమ్మరిస్తారు. వాటికి తగిన సమాధానాలు పిల్లల మనసున కతుకు నట్లు చెప్పేడి నేర్పుండవలె. అట్లు వారికి నచ్చజెప్పిననే వారిహృదయాలు మేధ వికసిస్తవి. అట్లుగాక విసుగొంది కసరు కొంటే పిల్లలమెత్తనియెదలు, బుద్ధి మొద్దు వారును. కనుక ఈలాలనము ఒకతీరు శిక్షణే. కుమార భృత్యం (పసిపిల్లల-పాలన-పోషణ) మొదలైనవి బాలికల కోసమైనవి.

లలితకళలు ఉభయత్రా ఉన్నవి. కొన్ని సందర్భాలలో స్త్రీవిద్యలను పురుషులు, పురుషవిద్యలను స్త్రీలు నేర్చుట కలదు. నలుడు, భీముడు పాక శాస్త్రంలో ప్రవీణులగుట ప్రసిద్ధమే. ఇట్లే స్త్రీలు స్వారి చేయుట, రథముల నడుపుట, రణతంత్ర రాజ్యతంత్రాల నభ్యసించుట ప్రసిద్ధమే. స్త్రీపురుష విద్యలనేఅంతరం మానుషీవిద్యలకే. పరావిద్యావిషయములో ఈతేడా లేదు. ఉభయులకు అది సమమే.

ఇంక ఇది చూడండి. జబల ఒక పరిచారిక. సామాన్య. ఆమె కుమారుడు సత్యకాముడు[1]. ఈయన బ్రహ్మ విద్య నభ్యసించి ఋషి అయినాడు. కుశు[2] కొక క్షత్రియ కుమారుడు. ఈయన వరుసగా కుమ్మరి, మేదరి, మాలకరు (పూదండలు గట్టువాడు)ల దగ్గర ఆయాపనులలో ఉమేజువా (Apprentice) చేసెనట. రాజు[3] లోకంనుండి వర్తకం, వృత్తులు నేర్చియుండవలెనట. ఒకరాజుండే వాడు. ఆయన చిత్రలేఖనం తక్షణం (చెక్కడపు) పనులలో నిపుణుడట.[4] ఆయన బుద్ధభగవానుని చిత్రమును చిత్రించి, దానిని పెట్టుట కొరక ఆసనం, దానిపై నమర్చుట కొరక చిన్న గొడుగును దంతంతో సుందరంగా

---

1. ఛాందోగ్యోపనిషత్-ప్రపా. 4. ఖం-4 ;
2. జాతకం V-290-3.
3. వార్తారంభాశ్చ లోకత:-మను-VII. 43
4. మహావంశం XXX ; XXXIV.

మలచెనట. బ్రహ్మ దత్తుడు[1] కాశీరాజు. ఆపట్టణంలోనే మహాధనుడు అనే వర్తకుడు ఉండేవాడు. వీరిద్దరి కుమారులు సహాధ్యాయులట. ఒక సార్థవాహు[2] డుండేవాడు. అయన బిడారులో ఒకపేదరాలు పనికత్తెగా ఉండేది. ఆబిడారు లోనే కుట్రపు పనివాడూ ఉండేవాడు. వీరుమూవురకూ కుమారు లున్నారు. ఆ బాలురు ముగ్గురూ ఆ బాల్యం కలసి మెలసి ఉంటూ ముగ్గురూ కలిసి తక్షశిలకు పోయి సహాధ్యాయులుగా విద్య నభ్యసించిరి. మిత్రులుగా మెలగిరి.

విద్యార్థులు వర్ణవ్యత్యాసం గాని, వర్గ వత్యాసం గాని లేక ఎల్లరు కలసి మెలసి మెలగుతూ విద్యల నభ్యసిస్తూ ఉండేవారని తెలిసినదిగా! దీని వలన శ్రమోపజీవనం, గౌరవింప బడుతూ ఉండేది. సమాజంలో సౌభ్రాతం, స్నేహం, వాత్సల్యం నెలవుకొంటూ ఉండేవి. పల్లెలలో ఇటీవలిదాక వర్ణాల పట్టింపులేక ఒక వర్ణంవా రింకొక వర్ణంవారిని అన్న, అప్ప, బావ, మామ, అక్క, అత్త అనే వరుసలు కలిపికొని పరస్పరం పిలుచుకొంటూ వర్ణాలు, వర్గాల తేడాలు మరచి ఆప్యాయంగా వ్యవహరిస్తూ ఉండేవారు.

స్వస్థ వృత్తమునకు వ్యాయామం అవసరమని వారు గుర్తించిరి. విద్యార్థులు విధిగా వ్యాయామం చేసేవారు. నడక ప్రధాన వ్యాయామంగా ఉండేది. ఇంకా అనేక రకాల ఆటలూ ఉన్నవి. వాత్స్యాయనులు బాలురకోసం బాలికల కోసం తీరుతీరు ఆటలను పేర్కొన్నారు. బాలుర వలెనే బాలికలూ వ్యాయామం చేసేవారు.

గురు కులపతుల బాధ్యత హెచ్చు. ఒకజాతిని జాతిని తీర్చి దిద్దవలసిన పృథు భార మది. దాని ప్రభావం అప్పటికేగాదు; తరతరాలకూ తగిలి వస్తుంది, ఇంతటి బాధ్యతకు పూట పడుచున్నవారి శీల మెట్లుండవలె? వారి విజ్ఞానం, వైదుష్యం,లోకానుభవం, శీలం ఉన్నత స్థాయి నంది యుండవలె. అట్లుకాదా

---

1. జాతకం. 475.
2. జాతకం IV 38.

ఆశ్రమం శ్రమయే అగును. శిష్యుని గురువు దండింప దగదు.[1] అతని తప్పు, దానిచే వచ్చు ముప్పు తెలియ జెప్పి శిష్యుడే తాను దానిని సవరించుకొనునట్లు చేయుట గురువుపని అన్నట్లుంటుంది ఆ తీరు. గురువు శిష్యుని ఇతర కార్యాలకు నియోగించ రాదట. గురువు శిష్యునకు మునిముందుగా శౌచం, అగ్ని కార్యాలు నేర్పును. అటుపైన శిష్యుని సత్యం, ధర్మం, వినయం, బ్రహ్మచర్యం, శీలం మొదలైన సదాచారాల బ్రవర్తింప జేయును. గురువు[2] శిష్యుని తనయింట నుంచుకొని, అన్నపానము లిచ్చి, ఆదరంతో చూస్తూ విద్యనేర్ప వలెనట. అసలు గురుశిష్యుల సంబంధం ప్రేమబంధురం పేశలం అనీ, పితాసుతుల సంబంధం బోలినదని ఆర్షభావం.[3]

మానుషీ విద్యల నేర్పు గురువుల విషయంలోనూ ఇవే సూత్రాలు. పోతే మానుషీ విద్యలలో శిల్పమును కళలను నేర్చెడి అంతేవాసి స్పష్టమైన ఒక కాలనియతిని ఏర్పరుచుకొని గురువు దగ్గర చేరి శిక్షణ[4] పొందవలెను. ఈ నియతకాలావధిదాక శిష్యుడు గురువును విడిచి పోరాదు. అట్లు వెళ్ళకుండ నిరోధించుటకు ఆచార్యునకు గలహక్కును స్మృతు లనుమతించినవి. ఈ నియతకాలంవరకు అంతేవాసి పనివల్ల వచ్చే ఫలం ఆచార్యునకే

1. గౌతమ ధర్మ సూత్రాలు II 848-50.
2. ఆచార్య శ్శుశ్రూషయే దేనం స్వగృహే దత్తభోజనమ్
   నచాఽన్య త్కారయే త్కర్మ పుత్రవ చ్చైన మాచరేత్॥
   నార—స్మృ—V-16—21
3. భిక్షులారా! ఆచార్యు డంతేవాసిని కుమారున ట్లెంచికోవలెను. అంతేవాసి ఆచార్యుని తండ్రివలె తలచుచుండవలెను, ఇట్లు ఇరువురూ పరస్పరం గౌరవించు కొంటూ పురోగమిస్తూ అభ్యుదయులై శిక్షణలో సిద్ధాంతంలో ఉన్నతి నందుకొందురు "మహావగ్గ I. 32.I.
4. ఆచార్యస్య వసే దంతే కాలం కృత్వా సునిశ్చితం" నార—స్మృ—V-16.
   కృతశిల్పోఽపి నివసే త్కృతకాలం గురోర్గృహే।
   అంతేవాసీ గురుప్రాప్త భోజన స్తత్ఫలప్రదః యాజ్ఞ॥ —187.

చెందుతుంది.[1] ఆచార్యుడు అన్నపానాదు లిచ్చి ఆదరించి విద్యనేర్పినందుకు ఆచార్యున కాపాటి చెందుట ధర్మమే నంటాడు యాజ్ఞవల్క్యుడు. అంతేవాసిని ఇంటనుంచుకొని అన్నపానాదు లిచ్చి పుత్ర నిర్విశేషంగా చూస్తూ మర్మం విప్పి తాను నేర్చిన విద్యనంతా మనఃస్ఫూర్తిగా నేర్పవలె నంటుంది వీర మిత్రోదయం. అంతేవాసి యేవిద్య నభిలషించి తనను ఆశ్రయించెనో ఆ విద్యకు సంబంధించిన పనులే వానిచేత చేయింపదగును. ఇతరమైన చాకిరి చేయించుకోరాదు. అట్లు చేయిస్తే ఆచార్యునకు దండంకూడ విధిస్తున్నాడు కాత్యాయనుడు. ఇంకా ఆచార్యుడు మర్మం విప్పి విద్యను మప్పకున్నా అంతేవాసి ఆ గురువును విడిచి మరొక గురువును ఆశ్రయించవచ్చు నంటాడు. గురువు దుర్వృత్తిలో దిగి శిష్యుని గూడ అందుకు ప్రోత్సహిస్తే శిష్యుడు గురుని ఆదేశం పాలించదగదు. ఆ గురువును విడువ వచ్చును అంటారు యాజ్ఞవల్క్యులు.

గురువు అన్న పదం సామాన్యంగా బోధించేవారికల్లా చెల్లుతూ ఉన్నది. గురువులలో ఉపాధ్యాయులూ ఉన్నారు. ఆచార్యులూ ఉన్నారు. వీరిరువురి ప్రతిపత్తి ఒకటి కాదు. ఉపాధ్యాయుని కంటె ఆచార్యుడు పదింతలు[2] అధికుడట. "అథాఽతో బ్రహ్మజిజ్ఞాసా" అని బ్రహ్మ సూత్రాల నేర్చుటకు ఆరంభించుదాక గల శాస్త్రాదులను బోధించే వారు ఉపాధ్యాయులు. బ్రహ్మ సూత్రాల నుండి పరాతత్వమును ఉపదేశించే వారిని ఆచార్యులని అనదగును. కాని క్రమంగా వ్యవహారంలో ఆ భావం మారినది. ఏ విద్యలో గాని సామాన్య విషయం బోధించేవారు ఉపాధ్యాయులనీ, ఏ విద్యలో గాని విశిష్ట విషయాలు (మర్మాలు, కిటుకులు, ప్రయోగ దృష్టాలు) బోధించే వారిని ఆచార్యులనీ వ్యవహరిస్తూ ఉన్నారు. ఆయా వృత్తులలో క్రొత్త క్రొత్త వాటిని*

---

1. "శక్తితోఽపి కృతం కాల మంతేవాసీ సమాపయేత్।
తత్ర కర్మచ యత్కుర్యా దాచార్యస్యైవ తత్ఫలమ్॥ నార—5—16.

2 "ఉపాధ్యాయా ద్దశాచార్యః" వాసిష్ఠం

* క్రొత్త—క్రొత్త—వాటిని : — నూతన మార్గ ప్రవర్తకం : వ్యవహారమయూఖం

వెలయించిన వారు ఆచార్యులని నిర్వచింపబడిరి. రాను రాను ఈ భేదం కూడ మరచి ఉపాధ్యాయ, ఆచార్య పదాలు పర్యాయ వాచులుగా ప్రయోగింప బడుతూ ఉన్నవి.

ఆచార్యుడు 'నేను సర్వజ్ఞుడ' ననుకొనడు. అలా వర్తించడు. తాను చెప్పినదే నిశ్చితార్థమని "పిడివాదం" చేయడు. సత్యాన్వేషులలో తానూ ఒకడు గానే తలచును. కాన తన గురుదేవులు తనకు వినిచినది, ఇతరుల వల్ల తాను విన్నది, ఆపైన తన అనుభవము, అభిప్రాయము ఇది ఇది-ఇట్టిట్టు అని అంతేవాసికి తెలియజెప్పును. ''వత్సా! నీ బుద్ధిని కూడ ఉపయోగించు. సత్యమును దర్శింప సాగుము" అంటాడు. గురువు శిష్యుల వాదాలలోనూ, భావాలలోనూ గుణదోషాల నెత్తిచూపి, శిష్యులకు తెన్నుల నగపరచు వాడు మాత్రమే. ఇట్లు గురు శిష్యులు ఇరువురూ కలసి సత్యాభిముఖంగా సాగుదురు. ఈ ప్రస్థానంలో గురువుల దాటి ముందుకు సాగిన శిష్యులు గలరు.

విద్యార్థి కృతార్థుడై గృహోన్ముఖుడుగా బోవుచు గురుదేవుని పూజించును. అతని శక్తి కొద్ది గురు దక్షిణ నిస్తాడు. ఈ దక్షిణ కింత అనే కట్టడి ఏదీ లేదు. అసలు ప్రతిఫల మాశించి విద్య నేర్పుటే నింద్యంగా తలచేవారు. ఇట్లు శిష్యుడు సెలవు గొను నప్పుడు గురుదేవులు శిష్యునకు ఉపదేశిస్తారు. అదే స్నాతకం. దీని అన్వయచింత, అనుసరణచింత నేడు పూర్తిగా మరచినాము. కాని ఈ సంస్కారమేమో నేటికీ జరుప బడుతూనేఉన్నది. ఆ బ్రహ్మచారి (విదార్థి) ఇటుపై గృహస్థు కానున్నాడు. అందు (ఆ గృహస్థుగా) అతడు మెలగ వలసిన మెలకువల ఉపదేశము ఇది. సత్యము పలుకు[1], ధర్మంగా

---

1. 'సత్యం వద, ధర్మం చర, స్వాధ్యాయా న్మా ప్రమదః, ఆచార్యాయ ప్రియం ధన మాహృత్య ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః సత్యా న్న ప్రమదితవ్యం, ధర్మా న్న ప్రమదితవ్యం, కుశలా న్న ప్రమదితవ్యం, భూత్యై న ప్రమదితవ్యం, స్వాధ్యాయ ప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్, దేవ పితృకార్యాభ్యాం న ప్రమదితవ్యం, మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ, అతిథిదేవో భవ, యా న్యన వద్యాని కర్మాణి తాని సేవితవ్యాని, యాన్య

మెలగు. స్వాధ్యాయం (నీ కులవిద్య-వృత్తి)ని ఏమరకు. ఆచార్యునకు మనః
పూతంగా దక్షిణను ఇచ్చి, సంతానమును కని, వంశమును ముందుకు సాగించు.
పొరపాటుననైనా ధర్మమును తప్పకు — పొరపాటుననైనా కుశలము (ఆ
ముష్మికధ్యేయం) ను మరవకు—పొరపాటుననైనా కలిమికి (ఐహిక సంపదల
సంపాదనం) వెలిగాకు-స్వాధ్యాయ (నీవృత్తిని నీవు సాగించుట) ప్రవ
చనము (దానిని శిష్యులకు మప్పుట) లను ఏమరకు. దేవతలను, పితరులను
పూజించుట ఏమరకు. తల్లియే దైవమనుకో, తండ్రియే దైవమనుకో, ఆచార్యుడే
దైవమనుకో, అతిథియే దైవమనుకో. దోషాలు పొసగని పను లేవేవి కలవో
వాటినే అనుసరించు, తక్కిన వాటిని గాదు. మాచేతలలో ఏవేవి మంచివో
వాటినే ఎన్నుకో, కూర్చుకో, తక్కినవాటిని గాదు. మనకంటే మహితులగు
బ్రాహ్మణుల గోష్ఠి (సభ) జరిగితే చిన్న బుచ్చుకోకు. దాని సారం సంగ్ర
హించుకో నీవు ఏకాంచెమైనా (ఈవిని) ఈయదలిస్తే దానిని శ్రద్ధతో మన
సారా ఇమ్ము—అశ్రద్ధతో (అరకొఱ మనసుతో) ఈయకు. నీ కలిమికి తగి

---

స్మాకం సుచరితాని తాని త్వయోపాస్యాని, నో ఇతరాణి యేకే చాస్మచ్ఛ్రే
యాగ్ంసో బ్రాహ్మణాః తేషాం త్వయాఽసనేన ప్రశ్వసితవ్యం, శ్రద్ధయా
దేయం, అశ్రద్ధయాఽదేయం, శ్రియాదేయం హ్రియాదేయం, భియాదేయం,
సంవిదాదేయం, అథయది తేకర్మ విచికిత్సా వా వృత్తివిచికిత్సా వా స్యాత్, యే
తత్రబ్రాహ్మణా స్సమ్మర్శినః యుక్తా ఆయుక్తాః, అలూక్షా ధర్మ కామా స్స్యుః
యథా తే తత్రవర్తేరన్ తథాతత్రవర్తేథాః అథఅభ్యాఖ్యాతేషు యే తత్ర
బ్రాహ్మణా స్సమ్మర్శినః యుక్తా ఆయుక్తాః అలూక్షాధర్మకామాఃస్యుః యథా
తే తేషు వర్తేరన్ తథా తేషు వర్తేథాః ఏష ఆదేశః ఏష ఉపదేశః ఏషా వేదో
పనిషత్ ఏత దనుశాసనం. ఏవ ముపాసితవ్యం ఏవ ముచైతదుపాస్యమ్.

తైత్తి. శి. 11 అను — 5వం.

నంతగా ఇమ్ము – లజ్జతో[1] ఇమ్ము - భయముతో[2] ఇమ్ము – తెలిసికొని ఇమ్ము.[3] కర్మలను గూర్చి కాని, సంప్రదాయాలను గూర్చికాని సంశయాలు కలిగితే – ఆయా కాలాల అక్కడ గలవారు, ధర్మ నిర్ణయానికి యోగ్యత గలవారు, ధర్మ చరులు (ధర్మాన్ని అనుష్ఠిస్తూ ఉన్నవారు) స్వతంత్రులు, మృదుస్వభావులు, ఐహిక విషయాలకు లొంగక ధర్మాన్నే తలపున నిలుపువారు అయిన బ్రాహ్మణులు–ఆయా విషయాలలో ఎట్టులెట్లు ప్రవర్తించిరో వాటివాటిని అట్టులట్టులే నీవునూ నిర్వహించు. ఇంకా చెప్పిన వాటిలో (స్మృతులు చెప్పిన ఆయా విషయాలలో) సందేహాలు వస్తే అప్పు డక్కడ గల వారిలో ధర్మమును తేల్చుకోగల యోగ్యత గలవారు, ధర్మచరులు–స్వతంత్రులు–మృదుస్వభావులు–ఐహికాలకు లొంగక ధర్మమునే తలపున నిలుపువారు అయిన బ్రాహ్మణులు ఆయాసందర్భములలో ఎట్లెట్లు ప్రవర్తించిరో వాటిని వాటిని అట్లట్లు నీవునూ నిర్వహించు ఇది ఆదేశం (దాటరానిది). ఇది ఉపదేశం (హితబోధ). ఇది వేదోపనిషత్తు (వేద రహస్యం). ఇది శాసనం (ఈశ్వర శాసనం). ఈ తీరున నడచుకోవలె. దీని నిట్లే అనుసరింపదగును.

ఇట్లు స్నాతకుడై బ్రహ్మచారి గురువుల సెలవుగొని ఇల్లు చేరును. పిదప తన జీవిత భాగస్వామిని కోసం అన్వేషణం. తలిదండ్రుల జోక్యం కొంత ఉన్నా వధూవరుల ప్రేమబంధమునకే ప్రాబల్యము. వధూవరు లిరువురు ప్రేమించుటకూ, ప్రేమింపబడుటకు చాలియుండవలె. వరింపనూ, ఆమోదింపనూ యోగ్యత గలవారై యుండవలె[4] .వటువు అటుపై తన ప్రేమకు

---

1. తన ఈవిని లోకం అపార్థం చేసికొంటుందేమో, అది తన ప్రాచుర్యం కోసం,ప్రాగ్భల్యంకోసం అన్నట్టు లోకానికి అనిపించే తీరుగా ఉన్నదేమో। అని లజ్జ. ఇంకా సాటి మానవుడు–ప్రాణి – చేయి చాచి యాచించవలసిన దుస్థితిని దలచి లజ్జ.

2. తా నిచ్చేయీవి సదుపయోగమే కాగలదా? ప్రతిగృహీత యోగ్యుడేనా? సద్భావంతోనే గ్రహిస్తున్నాడా? ఈయీవి గొన్నవానిని లోకానికి బెడదలు తెచ్చిపెట్టుటకు ఉపయోగింపడుగదా అని భయం.

3. ప్రతిగృహీత పరిస్థితులన్నీ చక్కగా దెలిసికొని ఇమ్ము.

4. ఋ– X –85

నిదానమైన కన్యను వరిస్తాడు. ఆమె ఆమోదము నందు కొంటాడు. ఉభయులూ వారి వారి మాతాపితలకు నివేదించి వారల ఆశీస్సులతో వివాహమాడుతారు. ఇప్పుడు బ్రహ్మచారి గేస్తు అయినాడు.

తాను ప్రేమించిన కన్యను వివాహమాడుటకు బ్రహ్మచారులు-స్వతంత్రులైనట్లే కన్యలూ వారు ప్రేమించిన వారిని వివాహమాడుటకు స్వతంత్రులుగా ఉండేవారు. ఇందుకు వైదిక కాలాన కావలసినన్ని నిదర్శనా లున్నవి. సూత్ర కాలమునా తక్కువ కావు. రామాయణ—భారత కథానాయికలు స్వయంవర లబ్ధలేగదా! ఇంకా వాటిలో యే కథను చూచినా కన్యలు తమ తమ పతులను వరించుటలో స్వతంత్రలుగానే కన్పిస్తారు. ముస్లింకాలపు తొలిదశాబ్దాలలోనూ దీనికి చెల్లుబడే ఉండేది. సంయుక్త తండ్రియిష్టమును మన్నింపక తాను ప్రేమించిన పృథ్వీరాజునే పెండ్లాడినది. ఇట్లింకెన్నో ఉన్నవి.

అయితే బాల్యవివాహా లప్పుడే పొటమరిస్తూ ఉన్నట్లు కనుపిస్తుంది.[1] కాని అవిరళంగానే ఉన్న వనవచ్చు. ఈ విషయం ఆలోచిస్తే ముస్లిముల ఆక్రమణనాటికే బాల్యవివాహాలు తలచూపుతూ ఉండెను. ముస్లిముల ఆక్రమణ దానిని మరింత ముందుకు త్రోసి ప్రోత్సహించినదని అనుకోవటం సరళంగా ఉంటుంది. వివాహితులను, దాసీలనుగా కొనిపోవుటను ఇస్లాం మతం నిషేధించింది. కనుక కన్యల కిదొక రక్షగా తలచి ఉంటారు. కాగా బాల్యవివాహాలు ప్రబలి యుండును.

జననియు జనకుడు నెవ్వని
యనువర్తనమునఁ బ్రియంబు నందుదు రెదఁ ద
త్తనయుడు ధర్మముఁ గీర్తియు
ననూనముగఁ బొందఁబడయు నక్షయగతులన్.

(భార-ఆర—ఆ.5—ప—6)

---

1. హ్యూయన్‌త్సాంగ్ (చీనా యాత్రికుడు క్రీ.శ 16వ శతాబ్దివాడు) మొదలైన కొందరి వ్రాతలు బాల్యవివాహాలను తెలుపుతూ ఉన్నది.

నిదానమైన కన్యను వరిస్తాడు. ఆమె ఆమోదము నందు కొంటాడు. ఉభయులూ వారి వారి మాతాపితలకు నివేదించి వారల ఆశీస్సులతో వివాహమాడుతారు. ఇప్పుడు బ్రహ్మచారి గేస్తు అయినాడు.

తాను ప్రేమించిన కన్యను వివాహమాడుటకు బ్రహ్మచారులు-స్వతంత్రులైనట్లే కన్యలూ వారు ప్రేమించిన వారిని వివాహమాడుటకు స్వతంత్రులుగా ఉండేవారు. ఇందుకు వైదిక కాలాన కావలసినన్ని నిదర్శనా లున్నవి. సూత్ర కాలమునా తక్కువ కావు. రామాయణ–భారత కథానాయికలు స్వయంవర లబ్ధలేగదా! ఇంకా వాటిలో యే కథను చూచినా కన్యలు తమ తమ పతులను వరించుటలో స్వతంత్రలుగానే కన్పిస్తారు. ముస్లింకాలపు తొలిదశాబ్దాలలోనూ దీనికి చెల్లుబడే ఉండేది. సంయుక్త తండ్రియిష్టమును మన్నింపక తాను ప్రేమించిన పృథ్వీరాజునే పెండ్లాడినది. ఇట్లింకెన్నో ఉన్నవి.

అయితే బాల్యవివాహా లప్పుడే పొటమరిస్తూ ఉన్నట్లు కనుపిస్తుంది.[1] కాని అవిరళంగానే ఉన్న వనవచ్చు. ఈ విషయం ఆలోచిస్తే ముస్లిముల ఆక్రమణనాటికే బాల్యవివాహాలు తలచూపుతూ ఉండెను. ముస్లిముల ఆక్రమణ దానిని మరింత ముందుకు త్రోసి ప్రోత్సహించినదని అనుకోవటం సరళంగా ఉంటుంది. వివాహితులను, దాసీలనుగా కొనిపోవుటను ఇస్లాం మతం నిషేధించింది. కనుక కన్యల కిదొక రక్షగా తలచి ఉంటారు. కాగా బాల్య వివాహాలు ప్రబలి యుండును.

> జననియు జనకుడు నెవ్వని
> యనువర్తనమునఁ బ్రియంబు నందుదు రెదఁ ద
> త్తనయుడు ధర్మముఁ గీర్తియు
> ననూనముగఁ బొందఁబడయు నక్షయగతులన్.

(భార-ఆర-ఆ.5–ప–6)

---

1. హ్యూయన్‌త్సాంగ్ (చీనా యాత్రికుడు క్రీ.శ 16వ శతాబ్దివాడు) మొదలైన కొందరి వ్రాతలు బాల్యవివాహాలను తెలుపుతూ ఉన్నది.

యువ దంపతులకు అప్పటికి కష్ట సుఖాలు తెలిసివస్తవి. అప్పటికి వారికి (యువ దంపతులకు) పితృత్వ మాతృత్వాల సిద్ధి. ఇప్పుడిక వారి యువ దంపతుల గురులకో (తలిదండ్రులు అత్త మామలు) పాత్రియపు పొర్రిద్దు పడమర తిరుగుతుంది. వారి అభిరుచులలోనూ పరిణామం కలుగుతుంది. వారి దృష్టులు బాహ్యాలనుండి అంతరున్ముఖంగా మారు పొందుతూ ఉంటుంది. ఆ లోకపు టాలోచన లెక్కువగుతూ ఉంటవి. దాన ధర్మాల వైపుగా తలపులు పారుతూ ఉంటవి. పుణ్యతీర్థాల సేవింప బుద్ధి పొడముతూ ఉంటుంది.

ఇట్లు విశ్రాంతి నొందుతూ వృద్ధ దంపతులు ప్రశాంతంగా జీవిత శేషమును గడుపుట సనాతన ఆర్ష సంప్రదాయం. ప్రతి వారు అనుసరింప వలసిన ఆశ్రమాలలో ఇదొకటి. వానప్రస్థ మిది. ఒకప్పుడు సన్యాసాశ్రమ ముండేది కాదు. మూడు ఆశ్రమాలే ఉండేవి. ఈ వానప్రస్థాశ్రమం మూడవది. ఈ ఆశ్రమము స్వీకరించి వృద్ధ దంపతులు వనములకు పోయి "పర్ణకుటిని" నిర్మించుకొని దానిలో నివసిస్తూ ఉండవలెను. పరమార్థమును ఉపాసిస్తూ ఆధ్యాత్మికంగా జీవితశేషం గడపవలెను. అడవిలో దొరకు కంద మూలాలు పండ్లు మొదలైనవి ఆహారంగా గొనుచుండవలెను.

ఈ ఆచారం క్రమంగా సన్నగిల్లినది. సూత్రకాలం చిగురునకే దీని పటుత్వం తప్పినది. ఇల్లు విడిచి వనవాసాలు చేయుట పొసగనిదైనది. కాని కుటుంబభారం నుండి విశ్రమించుట, పారమార్థికంగాను ప్రశాంతంగాను జీవితశేషం గడుపుట నిలచే ఉన్నవి. నిజానికి ప్రధానమైన విషయా లివే ఇంకా వీరి దృక్కోణం కుటుంబమునుండి విస్తృతమై సంఘం, సమాజం, దేశములదాక వ్యాపించేది లోకానుభవంలో ముక్కాకలు దీరి ఉంటారు. కాగా కొంచెమంత పాటవం గలిగి ఆసక్తి గలవారు సమాజసేవకు దిగువారు. పల్లెలలో పంచాయతులు, ధర్మ సంస్థలు, నిధుల సంస్థలు, మొదలైన వాటి నిర్వాహకులను, సభ్యులను ఇట్టి పరిణతుల నుండి జానపదు లెన్ను కొనే వారు. ఇట్టివారి చేతులలో వారి కార్యతంత్రాలు సుభద్రమని జనులు దృఢంగా

నమ్మేవారు. నిశ్చితంగా ఉండేవారు. ఆ విశ్వాసానికి తగినంత, సత్‌శీలము తోనే వారాయా సంస్థలను నిర్వహిస్తూ ప్రజా సౌకర్యాలు పెంపొందిస్తూ ఉండేవారు. వీరి లోకానుభవం, వివేకం, విచక్షణలు ఆయా సంస్థల కెంతో ఉపకరించేవి.

ఆనాటి గ్రామ పరిపాలనా విధానమును చక్కగా వివరిస్తున్నది "ఉత్తర మేలూరు శాసనము" :— గ్రామానికి సంబంధించిన వేరువేరు వ్యవహారాలు నిర్వహించుటకు వేరువేరు ఉపసంఘాలు ఉంటూ వాటన్నిటినీ సమన్వయించి సంబాళించే గ్రామ సంఘం ఉండేదని ఆ శాసనం తెలుపుతూ ఉన్నది. దీనిని "సంవత్సర వారీయం" (సాంవత్సరిక సంఘం) అనే వారు. ఇది చాల ప్రాముఖ్యము, పలుకుబడి గలది. గౌరవము, ప్రతిపత్తి హెచ్చుగా గలది. దీని సభ్యులకు ఉండవలసిన అర్హతలలో "వయోవృద్ధత్వమూ" ఒకటిగా పేర్కొనబడినది. దాన శాసనంలో ఇంకా "సువర్ణ సంఘం" (నాణ సంఘం = నాణెములకు సంబంధించిన ఉపసంఘం) కూడ ఉండేది. దీని సభ్యులకు ఉండదగిన అర్హతలను చెప్పుటలోనూ మరీ లేతవారుగాని, మరీ ముదుసళ్లు గాని కూడదని ఆ శాసనమే తెలుపుతున్నది. ధర్మాసనపు సభ్యులూ ఇట్టి పరిణత వయస్కులే ఉండేవారు. వారాయా వివాదాల విచారించి తఱచుగా వాది ప్రతివాదులకు సామరస్యం గుదురుస్తారు. కుదర నప్పుడు తీర్పులు ఇచ్చేవారు.

ఇంకా వీరు పురాణ శ్రవణాలు, హరి కథలు, భజనలు, వీధి నాటకాలు, బొమ్మలాటలు, గోష్ఠులు, ధర్మ పరిషత్తులు (నీతి, ధర్మముల ప్రచారము కోసం జరిపెడి సభలు) మొదలైన సభలు సమావేశాలు జరిపిస్తూ ఆర్ష సంస్కృతి సంప్రదాయాలు సదా ప్రచారం చేసేవారు. వాటిని పురస్కరించు కొని సమాజంలో నైతికోన్నతి, త్యాగ పరత్వములను ప్రోత్సహిస్తూ ఉండేవారు. దాన ధర్మ గుణాలకు బాగా గిలిగింతలు పెట్టి సమాజంలో మానవత్వం హృదయమార్దవాలను ఉచ్చ స్థాయిలో నిలిపేవారు. ఈ మూలంగా దేవాలయాలు, విద్యాలయాలు, సత్రాలు, జలాశయాలు, రథ్యలు, అఖండాలు (జ్యోతులు) మొదలైన సామాజిక హితకార్యాల నన్నిటినీ సాధించేవారు.

సరే కుటుంబంలో వీరి స్థానమో ! అనేకంగా ప్రార్థించి, తపించి, కని, తమ సుఖాలను త్యాగం చేసి, అనేక శ్రీమల కోర్చి, కన్నుల వత్తు లిడుకొని, పాలించి, లాలించి, పోషించి, మంచి పెద్దలు మప్పి, అంత వారిని, ఇంతవారినిగా జేసినవారు కారా మాతాపితలు? సంతానం పితరులకు ఋణపడి వుంటుందన్న ఆర్ష సంప్రదాయం సత్యమే గదా ! వార్థక్యాన వారిని సేవింపని, ఆదరింపని, గౌరవింపని సంతానం ఉంటుందా ! ఉంటే మానవు లన్పించు కుంటారా? కృతఘ్నత కింతకంటే గుర్తు కాదగినవా రుంటారా ! ఈ పాటి పితృగౌరవం అన్ని సంప్రదాయాల వారికీ సామాన్యమే. అసలు మానవత్వానికే అది లక్షణం. ఆర్ష సంప్రదాయంలో దాని పొలుపు మరింత.

బాహ్యంగాచూస్తే వారికి (మాతా పితలకు) ఏ అధికారాలూ కనిపించవు. కాని వారి మాటకు తిరుగుండదు. అలాటి పూజ్యస్థానం వారిది. వారినుండి వినదగినవి, తెలిసికొన దగినవి, సలహాలు పొందదగినవి ఎప్పటి కప్పుడు ఉంటూనే ఉంటవి. ప్రతి కుటుంబానికి కొన్ని కొన్ని విశిష్ట సంప్రదాయాలూ, మర్యాదలూ ఉంటవి. ఆడుబిడ్డలను ఏ యే పండుగలకు తీసికొని రావలెనో, సారెలు చీరెలు వారికి ఎప్పుడెప్పుడు ఎట్లెట్లు నడుపవలెనో, అల్లుండ్ర నేయే పండుగలకు ఆహ్వానించ వలెనో, ఇక్లే ఇతర బంధువర్గమును, ఎవరిని ఎవరిని, ఎప్పుడు ఏ ఏ తీరుల గౌరవింపవలెనో, ఎవరెవ రేతీరు చుట్టాలో, వారివారి మంచి చెడ్డలు, మర్యాదలు ఎట్టివో, ఇరుగు పొరుగు వారి హితాహిత ప్రవర్తన లెట్టివో, తమ కుటుంబానికీ వారికీ అనుశ్రితంగా నడుస్తూ ఉన్న మర్యాద లేలాంటివో, తమ పరివారం, పరిచారికులు, మొదలైన వారిలో ఎవ రెవరికి ఏ ఏ తీరుల, ఏ ఏ సమయాల ఆదరాలు బహుమతులు నెరపవగునో, శుభాశుభకార్యాలలోనూ, దాన ధర్మాలలోనూ ఎప్పుడెప్పుడు ఏవేవి ఎట్లెట్లు జరుపవలెనో, ఈ మొదలైన వెన్నో అనుశ్రితాలైన సంప్రదాయాలు. ఇవి ముదె నోళ్ల విని తెలిసికొని, అనుసరించవలసినవే. స్మృతులకంటే ఈ కుటుంబ స్మృతులకే చెల్లుబడి. ఆమాట స్మృతికర్తలే అన్నారు.

వారి వలన వినదగినవి ఇంకెన్నో ఉన్నవి. ఐతిహ్యాలు, గాథలు, ప్రాదేశిక విశేషాలు మొదలైనవి. తమ తమ చిన్ననాటి విశేషాలెన్నిటినో చెప్పుతారు. తమ తాత తండ్రులనుండి పరంపరగా విన్నవీ వినిపిస్తారు. ఏ ఏ రాజు నాయకుడు విద్వాంసుడు మతకర్త భక్తుడు వీరుడు చోరుడు మొదలైన ప్రసిద్ధపురుషులు ఉండేవారో, వారు ఎవరెవరు ఏయే మహత్కార్యాలు ఎప్పుడెప్పుడు నెరపిరో చెప్పుతారు. వారివారి ఆయా కార్యాలవల్ల దేశం ఎట్లెట్లు హాయినొందెనో లేదా అగచాట్లందెనో వివరిస్తారు. వారివారి జీవితాల విశేషాలు వివరిస్తారు. అప్పటప్పట ప్రబలిన విప్లవాలు, ఉపద్రవాలు మొదలైన వాటి కథలు తెలుపుతారు. ఆయా ఉపద్రవాలలో ప్రజలెట్లు బాధనొందినది, వాటికి ఏ యే ప్రతిక్రియలు, ఎవరెవ రెట్లు చేసిరో, ఎవరెవరు నాయకత్వమును బూనిరో, దుష్టుల నెట్లెదిరించిరో శిక్షించిరో, వర్ణించి చెప్పుతారు. ప్రకృతి యెప్పుడెప్పుడు కోపించెనో ఆ ఉత్పాతా లెంతదారుణాలో, వాటివల్ల ప్రజలెంత బాధపడిరో ఏ ఏ పుణ్య పురుషులాదుకొనిరో, వారేమేమి హితకార్యాల నెరపి బాధల నివారించిరో ఆ ఉత్పాతాల గడచి ప్రజలెట్లు బయట బడిరో వివరిస్తారు. ఆ యా ప్రదేశాల మహత్తులు ఆయా చోట్ల జరిగిన చారిత్రిక విషయాలు చెప్పుతారు. వింతలూ వినోదాలను గురించి వర్ణిస్తారు తమ చిన్ననాటి ఆట గోటితనాలు వాటిలోని సంఘటనలను గూర్చిన మధురస్మృతులనూ మక్కువతో వినిపిస్తూ ఉంటారు. తమ బంధువులలోనూ, నెచ్చెలులలోను. సమ వయస్కుల సరస సల్లాపాలు, వినోదాను భూతులను ఉల్లాసంతో వర్ణిస్తూ ఉంటారు.

తమ వంశంలో ఏయే మహాపురుషులు ఉద్భవించినారో వారు ఏయే విషయాలలో ప్రజ్ఞాశాలులో వివరిస్తూ ఉంటారు. వారు వారు చేసిన దాన ధర్మాలు, సాహిత్యసేవ, సమాజసేవ, కళారాధనం, వీర విహారం, సాహస కార్యాలు మొదలైన వాటిని వర్ణిస్తూ ఉంటారు. తమ వంశపు పూర్వపు బంధుత్వాలు, ఆ కోవ లెక్కడెక్కడ ఉన్నవీ తిరుగవేస్తూ ఉంటారు. ఈ తీరున వంశం, సంఘం, దేశం వాటి ఐతిహ్యాలు ప్రాదేశిక గాథలు వృద్ధవాణులనుండి జాలువారవలసినదే. ఈ తీరున పురాతన ఐతిహ్యాలను

ఆర్షకుటుంబము

నోటానోటా పదిలపరుస్తూ ఉండేవారు. పిల్లలతో ఆడుకోవటం వీరికి సరదా. ''బాలైః క్రీడాక్రీడానౌభి ర్యానం యానం'' అన్న నుడి యెంతో ఒప్పి ఉన్నది. పొరిపొచ్చెములు లేని పాపాయిలతో ఆటలు హాయి హాయి!! అందు కోసమే మనుమలు మనుమరాండ్రను చుట్టూ చేర్చికొని వారికి కథలు, పొడుపు కథలు, పురాణ కథలు మొదలైనవి చెప్పుతూ అమాయికముగా పిల్లలడిగెడి ప్రశ్న పరంపరలకు సమాధానాలిస్తూ వారితో కలసి చిన్నారి పొన్నారి ఆట లాడుతూ అలతి అలతి పాటలు, పద్యాలు నేర్పుతూ వినోదిస్తుంటారు. ఇదంతా ఉబుసు పోక కాదు. పిల్లల కొరక తీరు విద్యాబోధయే. తమ కానం దము పిల్లల పాలన పోషణలలో తగినంత శ్రద్ధ తీసికొంటూ సలహాలిస్తూ ఉంటారు.

ఇప్పుడు వీరు కుల వృద్ధులు, పూజ్యపాదులు. సర్వోన్నత స్థానం వీరిది. దేవతాస్థాన మనవచ్చు. పూలతో పూజించి విధేయత చూపుతూ ఉంటారు కుటుంబంలోని వారు. పితృ గౌరవం ఆర్ష సంప్రదాయంలో అత్యున్నత స్థాయి నందుకొన్నది. పితృవాక్యమును గౌరవించటం కోసం అద్భుతత్యాగాలు చేసిన మహాపురుషు లున్నారు. పితృదేవల మాటకు మారు మాట రానీయరాదు. అందుకోసం అధిష్ఠింపబోతూ వున్న సింహాసనాన్ని రాజ భోగాలను తృణప్రాయంగా త్రోసివేసినాడు శ్రీరామచంద్రుడు. ఆపైన సతీ సమేతంగా కాఅడవులకు కాపురము తరలినాడు. అదీ పదునాలుగేండ్లు. పితృపాదుల హితం కోసం రాజ్యమును త్యజించినాడు భీష్ముడు. ఆజీవితమూ బ్రహ్మచారిగా ఉంటానని కఠోరసమయము చేసినాడు;పాలించినాడు. ఐతిహాసి కకాలాన కూడా ఇట్టి సంఘటన లున్నవి. మేవాడురాణా లఘు కుమారుడు చండుడు. తండ్రిమాట దబ్బర కానీయరాదని తాను రాజ్యమును త్యజించినాడు. శివాజీ తన ఉద్యమంలో ఆయా ఘట్టాలలో తరచు మాతృశ్రీకి విన్నవించి ఆమె సలహాలు ఆశీస్సులు అందుకొంటూ ఉండేవాడు.

పితరుల నాదరించి అర్చించుటను గూర్చి మచ్చునకిది.

కౌశికు డొక యువ బ్రాహ్మణుడు. ఆయన తలిదండ్రులు బడబడ పడకు వారిన పండు ముదుసళ్లు. ఈ స్థితిలో నున్న తలిదండ్రులమాట దల

పెట్టక కౌశికుడు విద్య వెలగబెట్టుతానని బయలుదేరినాడు. అతడు ధర్మ మర్మము లెరుగడు. ధర్మభ్రాంతిలోపడి తబ్బిబ్బులౌతూ ఉన్నాడు. దంభం హెచ్చు. ఒకనా డాతడు భిక్ష కోసం పోయి పరమ సాధ్విని పరుషా లాడినాడు. "కుఱ్ఱవాడవోయీ! నీవు ధర్మమర్మా లెరుగవు. ఈ నీదుడుకుదనం బ్రాహ్మణ ధర్మం కాదు" అని ఆ ఇల్లాలు మెల్లగా తల వాయబెట్టినది. అతడు సిగ్గిలినాడు. అంతట అవ్వ అన్నది. "ధర్మవ్యాధు డున్నాడు ; ఆ మహనీయుడు ధర్మాలకు తావలం. ఆయనను అడిగి ధర్మాల మర్మాలు చక్కగా తెలిసికో''. కౌశికుడు ధర్మవ్యాధుని దగ్గరకు పోయినాడు. ధర్మవ్యాధుడు మిగుల ఇంగిత జ్ఞానము గలవాడు. కౌశికుని వాలకం చూడగానే అతని విషయము, మనఃస్థితి ఆకళించి నాడు. ''అప్పా! నావల్ల ధర్మతత్త్వం తెలిసికొనగోరి వచ్చినావా ? అయితే విను" అని ధర్మమును గూర్చి కొలది ఉపదేశము నిచ్చినాడు. ఆ వ్యాధుని సౌహార్దం, సౌజన్యం, సాధుశీలం, ధర్మ వివేచనం కని కౌశికుడు ముగ్ధుడై నాడు. ధర్మవ్యాధు డది పొడగట్టినాడు. దాని నందుకొని ఇక సాగించినాడు. ''ముదిసి ముప్పున ఉన్న ముదుసళ్లు, వాడి వత్తులై ఉన్నారు. వేళ కింత కాచి పోసే పాటి దిక్కైనా లేక సవుస్తూ ఉన్నారు. చేయూత నిచ్చి లేవదీయు చేదోడుకైన నోచరూ నీపితలు? నీవేదో నిర్వాహకుడవౌతావు; తమను పూల బెట్టి పూజిస్తావని వారు కన్న కలలు వమ్ము చేసినావు !!! నీకోసం వారు నిత్యమూ నెంజిలికుడుస్తున్నారు. ఏకైక పుత్రుడవు నీవేమో విద్యనేర్చి వెలగ బెట్టానని వెడలినావు! మంచి ప్రబుద్ధుడవే! తల్లిదండ్రుల క్షోభింపజేస్తూ నీ చదు వెందుకు? చట్టు బండలకా?'' అని చీవాట్లు పెట్టెను. ఇదిగో ''మహత్తు ఏదైనా ఉన్నదని నీవనుకొంటే అ దెట్లా కలిగినదో విను. వీరుగో పూజ్యులు. నాజననీ జనకులు—చూడు'' అని కౌశికుని నట్టింటికి గొనిపోయి పండుముదు సళ్లను జూపినాడు.

"జననుత వీరు నాజననియు జనకుండు
    జూవె, వీరలకు శుశ్రూషసేసి
యిట్టి పరిజ్ఞాన మేను ప్రాపించితి.
    నమరులఁ బూజింతు రర్థి నెల్ల

వారును, నెందు దైవంబుల నెఱుఁగ, నీ
వృద్ధులు నాపాలి వేల్పు లనుచుఁ
గమనీయ ఫలపుష్ప గంధ భూషణ వస్త్ర
ములు మనోహరభక్ష్య భోజ్యములను

వీరి కెపుడు నివేదింతు, వేడ్కఁ బుత్ర
దారసహితుండనై నియతముగ సేవ
యాచరింతును, వేదముల్ యజ్ఞములు వ్ర
తంబులును వీర నా కనుతలపు దృఢము.

(భార-అర-ఆ.5-ప. 117.)

నీకు వగచి వగచి నిర్భిన్నహృదయులై
విగతచక్షు లైరి వినవె వార;
లరిగి యింక నైన నమ్మదునల్లయు
దగ్ర శోకవహ్ని నార్పవయ్య''

నీయధ్యయనమ్మును, సుకృ
తాయాసము నిష్ఫలంబులై చను గురుసే
వాయుక్తి లేక తక్కినఁ;
జేయుము నాపలుకు; మేలు సేకురు నీకున్.

(భార-అర-ఆ-5.ప 121-122)

వీటి సారం:- ''నా పితరులకు పరిచర్యలు చేసే నేనింత వాడిని అయినాను నాపాలిటికి అన్ని దేవతలూ వీరే. ఆభావనతోనే వీరిని నేను పూజిస్తూ ఉంటాను. ఆలు బిడ్డలతో కూడా అందరమూ వీరికి ఉపచారాలు చేస్తూ ఉంటాము. వేదాలైనా, యజ్ఞాలైనా, వ్రతాలైనా అంతా నాకు వీరే. నీజనకులో నీకోసం కళ్లు అవిసేలాగు ఏడుస్తూ ఉన్నారు. గుండె దడగొని ఉన్నారు. ఇప్పటికైనా పోయి అముదునల్లను ఆదరించు. పితరుల సేవకుగాని, నీ చదువులు, సంధ్యలు గ్రుడ్డి గవ్వకైనా చెల్లవయ్యా! పితృదేవుల సేవించి వారి ఆశీస్సు లందుకో.'' అని హితము గఱపి కౌశికుని ఒప్పించి పంపుతాడు. కుల వృద్ధుల కీతీరు మన్ననలు - ఇంటా బయటాకూడ,

# ఆర్ష కుటుంబము

## పదునొకండవ నివాళి

# వర్ణము

ఆదికాలపు(కృతయుగం)చివరను గోత్రాలతో ఆరంభమైన ఈసమాజం క్రమంగా విస్తృతమైనది. వారి విద్యావివేకాలు క్రమంగా వికసించినవి. కార్యకలాపాలు, కళలు, వృత్తులు పెరిగిపోయినవి. ఇప్పుడు సమాజపు సుఖ స్థితిని సంబాళించుటకు వెనుకటి గోత్రవ్యవస్థ చాలలేదు. కాగా సమాజమును వ్యవస్థీకరించుటకు వేరొకతీరు వెదుకవలసి వచ్చినది. ఆసంస్కరణలలో రూపొందినదే వర్ణవ్యవస్థ. ఇట్లువీరు వర్ణవ్యవస్థను వెలయించుకొన్నా కుటుంబ వ్యవస్థ కెట్టికొఱతా రానీయలేదు. ఇంకా కుటుంబ వ్యవస్థే దీనికి కుదురైన దనీ అనవచ్చు.

ఈవర్ణవ్యవస్థ తీరు చూస్తే సమాజపు సమిష్టి శ్రమను ఒక క్రమంలో విభజించి పంచి నడుపుటగా కన్పిస్తుంది. సమాజపు శ్రమ విభజించి పంచుకొని నిర్వహించ వలసిన అవసరం తప్పనిది. ఈ శ్రమ విభాగ మనేది అన్ని దేశాలలోను అన్నికాలాలలోనూ యేదోరూపంలో ఉండనే ఉన్నది. వర్గాలే అనండి, మరేమైనా అనండి. అవీ వర్ణాలట్లే శ్రమవిభక్తములుగానే ఉన్నవి. సమసమాజపుదేశా లనుకొంటున్న వాటిలోనూ ఆయాకార్యాలు నిర్వహించే బాధ్యతలు పంచుకొని నిర్వహించుట తప్పదు. నాడీవర్ణవ్యవస్థ దేశమునకు మహోపకారిగా ఉండే దనదగును. సుఖ సంపదలు, శాంతిభద్రతలు దీనివల్ల సుష్ఠుగా నెలకొని యుండెను. ఈవ్యవస్థ ఔత్కృష్ట్యము (సౌష్ఠవం)ను ప్లేటో మొదలైన విదేశీయ తాత్త్వికులూ ప్రశంసించిరి. అయితే ఈ నాటివలె వికారం సంకుచితం అయిన తీరుగా నా డది లేదు.

కుటుంబ వ్యవస్థకు అచ్చుమచ్చు వారి తాత్త్విక భావములేనని వెనుకనే వివరించినాను. ఈ వర్ణవ్యవస్థనుకూడా కుటుంబ సంస్థ ననుసరించియే

నిర్మించి రసుకొందుము. కుటుంబ సంస్థను వెలయించుటలో వారి నేయేభావాలెట్లు ప్రోత్సహించినవని వివరించితినో ఆ ఉపమాన ఉపమేయము లన్నీ ఈ వర్ణవ్యవస్థ వెలయించుటలోనూ చెల్లును. కుటుంబ సమిష్టిశ్రమను వ్యక్తులకు పంచగా సమాజపు సమిష్టి శ్రమను వర్ణాలకు పంచబడిన దీవర్ణ వ్యవస్థలోనే. సమాజపు సమిష్టి శ్రమనంతా నాలుగు రకాలుగా విభజించిరి. ఇట్లు 1 ధీశక్తి (బుద్ధితో పరిశ్రమించుట). 2 భుజశక్తి. (శస్త్రాస్త్రాదులతో బాహుబలంతో పరిశ్రమించుట, దేశరక్షణ-పాలనములు చేయుట) 3 ధనశక్తి (వ్యవసాయం, వాణిజ్యము మొదలైన పరిశ్రమలతో సంపద వెలయించుట) 4 శ్రమశక్తి (కాయకష్టం చేయుట) వీటిని ఆయాతెగలకు పంచిరి. ఆ తెగలను వరుసగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర వర్ణములన్నారు.

ఈ తీరుగానే పురాతన పారశీకులలోనూ వర్ణవిభాగం స్పష్టంగా కనుపిస్తూఉన్నది. వారు నాలుగు తెగలగానే విభజింపబడిరి, అవి ఏవనగా*
1. హోరిస్తారన్ 2. నురిస్తారన్ 3 సొరిస్తారన్ 4. రోజిస్తారన్. ఇవి పెహల్వీ (పారశీక భాషాభేదం – అవెస్తాభాషకు వికృతి) పదాలు. ఈ పెహల్వీ పదాలకు పురాతన అవెస్తాభాషలో గల పేరులనూ ఆ యా వర్ణాలవారికి నియతాలైన ధర్మాలనూ అయిదవ ''ససాన్'' (ఈశ్వరప్రేరితులయిన పారసీక రచయితలలో చివరివాడట) వివరించెను.

1. హోరిస్తారన్ (పెహల్వీ)=అధర్వన్ (జంద్–అవెస్తా) వీరు పురోధసులు. మతమును రక్షించుట, బలపరుచుట, సత్యాన్వేషణ పరిపాలనకు తోడ్పడుట వీరి ధర్మాలు.
2. నురిస్తారన్ (పెహ) రథేష్టర (జం–అ) రాజ్యపాలనం, యుద్ధాలు నిర్వహించుట, అధినేతలుగా ప్రముఖులుగా వ్యవహరించుట, శాసించుట, పాలించుట వీరిధర్మాలు.

---

* నామామహాబాద్‌లో 'ఓ అబాద్: భగవత్సంకల్పం అబాదీలమతమునకు చేర్చినది కాదు. ఈ నాలుగువర్ణాలవారిలో ఈ మార్గము నెవ రనుసరింతురోవారు స్వర్గమునం దుందురు. ఆ వర్ణాలివి' అని పై నాల్గిటినీ పేర్కొనెను.

3. సౌరిస్తారన్ (పెహ) వస్త్రియోప్సయస్, లేక బస్తర్యోశన్ (జం—అ.) కృషి తీరు, వాణిజ్యాలు నెఱపుట వీరిధర్మాలు. రొజిస్తారన్ లేదాహుయితెస్ (పెహ) హుతోక్ష,లేకహోత్మన్ (జం—అ.) అన్నితీరుల సేవలు చేయుట వీరిధర్మాలు.

మనదేశమున వర్ణవిభజన మొనర్చుటలో ఒకవిశేషము కనపడుతూ ఉన్నది. ఈ నాలుగుతీరుల శ్రమలలో ఏశ్రమ యెవరి గుణాలకు (సత్వ రజస్తమస్సులకు) కర్మలకు, అభిరుచులకు అనుకూలముగా ప్రస్ఫుటమగునో ఆ గుణాదులుగల వారిని ఆవర్ణంగా సంఘటించిరి. దీనివల్ల ఆయా పరిశ్రమలకు వృత్తులకు స్పష్టమైన హద్దులు ఏర్పడి, ఎవరిపనిలో వారు తత్పరులై నిష్ణాతులై కౌశలము గడిస్తూ ఉండేవారు. శ్రమగౌరవమును చక్కగా ఎరిగియుండిరి ఒకరకపుపని హీనమైనది, మరొకరకపుపని మేలైనది, గౌరవనీయమైనది అనేతలపు లున్నట్టులేదు.కుమ్మరిపని, తోళ్ళుఊనుట వంటివి నాగరికులు నేర్వవలసిన కళలలో చేర్చబడినవి.(శుక్రనీతిసారం, IV, III, 25-26 పురుషోచితము లైన చౌషష్టి కళలు) అంటే నేడు హీనకర్మలుగా తలచబడుతూ ఉన్నవాటి కానాడు గౌరవ మున్నది. బోదకుడు తనపనిలో ఎంతశ్రద్ధాళువై యుండునో అంతగానూ గౌరవ మందును. ధర్మవ్యాధుడే దానికి తార్కాణం.

ఈపథకంలో వారు కనుగలిగి మెలకువతో నిర్వహించిన విశేష మింకొకటి: ఏ రెండు శక్తులనూ ఒకచోట కలసిఉండనీయలేదు. అందులోనూ ధీశక్తిని భుజశక్తితో గాని ధనశక్తితో గాని మేళవింపక, దేనికి దానిని దూర దూరాన ఉంచుట మరీ విశేషం. వర్గవిభజనలో ఈ తీరునకు అవకాశం తక్కువ. రెండు శక్తులు ఒకేచోట కుదురు కొంటే చాలా ప్రమాదం. ఆనిరంకుశత్వమునకు హద్దు లుండవు.

ఆతొలినాళ్ళలో ఈనాల్గు వర్ణాలే ఉండేవి. ఏ వృత్తివారైన ఈ నాలుగింటిలో ఇమడ వలసినదే. ఆనాడు అస్పృశ్యత ఉండే దనుటకు ఆధారాలు కనపడవు.

ఆర్షకుటుంబము

ఇట్టి వర్ణవ్యవస్థ ఏర్పడిన దంటే వృత్తులు కొలపన కొయ్యలు గావు.

మార్చుకొనుటకు అవకాశ మున్నది. అయితే యీ మార్చుకోవటమునకూ ఒకక్రమ మున్నది. మార్చుకొనువారి గుణకర్మల (సత్వాది గుణాలు, వాటిచే స్ఫురించు కర్మలు, అభిరుచులు) అనుసరించిన దది. అట్టి అభిరుచి అభినివేశములు కలిగితే వారికి ఇంకా ఏ ఆటంకాలు ఉండవు. దీనిని బట్టి వర్ణవ్యవస్థ సంకుచితంగా దనగలము. సూత్రకాలాన కూడ ఈవ్యవస్థ ఉదారంగానే ఉండేది.

ఇది గమనించండి :— వసిష్ఠుడు, కక్షీవనుడు, మాతంగుడు మొదలైన వారు జన్మతో అవర వర్ణాల (తక్కువ వర్ణాల) వారయినా వారు బ్రహ్మఋషులైనారు[1]. జాబాలి పరిచారిక కుమారుడు.[2] అయినా బ్రహ్మఋషి అయినాడు. వ్యాసులు, మందపాల నందనులు అవర వర్ణపు స్త్రీలకు పుట్టినా బ్రహ్మ ఋషులైనారు[3]. వీతహవ్యుడు రాజు. ఆయన, ఆయన వంశంవారూ బ్రాహ్మణులైనారు. నిషాదుడైన వాల్మీకి బ్రహ్మర్షి అయినాడు. క్షత్రియుడైన విశ్వామిత్రుడు బ్రహ్మర్షియగుట సుప్రసిద్ధమేగదా। క్షత్రియుడైన అంబరీషుడు బ్రాహ్మణుడైనాడు.[4]

ఇట్టి బ్రాహ్మణము స్వీకరించిన క్షత్రియు లెందరో ఉన్నారు. ఆ కథలు పురాణాలలో ఉన్నవే. ద్రోణుడు, కృపుడు బ్రాహ్మణులైనా క్షత్రవృత్తిని స్వీకరించినారు. కథకుడుగా ప్రసిద్ధుడు సూతుడు. ఈయనను ఋషులు గౌరవించేవారు. వారట్లు గౌరవించుటకు అతని కులగోత్రాలు అడ్డుగాలేదు. సూతుడైనా సంజయుడు గౌరవింపబడుతూ ఉండెను. విదురుడు దాసీపుత్రుడైనా పూజనీయుడైనాడు, ధర్మవిదుడు, నీతికోవిదుడుగా వాసిగొన్నాడు ధర్మవ్యాధుని

---

1 భార అను, ఆ 2. వ 27, 28.

2 ఛాందో—ప్రపా 4, ఖండం 4.

3 భార అను—ఆ 1.

4 వాయు పు—సం 2. అ26.

కథ ఉండనే ఉన్నది. ధర్మనిధి, పూతచరిత్రుడునైన ఆయన కున్న మన్నన అసామాన్యము.

ఇది వినండి. "నా కుమారుడు (గౌతముడు) కులగోత్రాలకు మురిసే వాడు కాడు. సత్యము, ధర్మము అనే గుణములందే ఆతనికి మక్కువ. బ్రాహ్మణి అయినా సరే, క్షత్రియ అయినా సరే, వైశ్య అయినా సరే, శూద్రి అయినా సరే అలాంటి గుణవతి అయిన కన్యను నాకు తెలుపుము[1]" అని అంటాడు శుద్ధోదనుడు. ఇది స్పష్టంగా అంతర్వివాహమునకు ఆమోదమే కదా !

సూత్రకాలం చివరనుండి యీ సంస్థ వెఱ్ఱి తలలు వేయసాగినది. ఈ కాలాన వర్ణ జాతి లింగాల అహంకారాలు పొటమరింప సాగినవి. వీటి వల్ల దాపురించిన సంకుచిత మనస్తత్వము కొందర నావేశించినది. అనంత కాలం నుండి అనుస్రుతంగా వస్తూ ఉన్న ఆర్ష సంప్రదాయాలు, విశ్వప్రేమ, ధర్మం, సౌజన్యం, సౌభ్రాత్రాలతో పదునైన ఉదార మనస్తత్వమును అంటు కొని మరికొంద రుండిరి. స్మృతులేమో రెండుతీరుల మనస్తత్వాల కలగలుపుగా కనుపిస్తవి. ఆ తీరు చూస్తే రెండు తెగలనూ సమన్వయించుటకో సమాధాన పరుచుటకో చేసిన ప్రయత్నంగా తోస్తూ ఉన్నది. స్మృతు లేమన్నా ప్రాచీన సాంప్రదాయాలు నడుస్తూనే ఉన్నట్లు కన్పిస్తుంది. అట్టి నిదర్శనాలు ఇతిహాసాలలో ఉన్నవి. ప్రేమబంధాల నేవీ సడలింప లేవు. యోగ్యత నేవీ తొలగింపలేవు. అయితే పౌరాణిక యుగానికి ఈ సంకుచితతత్వం, వేరుదన్నిన దనవచ్చును. కాని దానికి ఆ వెనువెంటనే గొడ్డలి తాపులు తగులుతూనే వచ్చినవి. అప్పటప్పట మత సంస్కర్తలు ప్రభవిల్లిరి. ఆ సంకుచితత్వమును

---

1. బ్రాహ్మణీం, క్షత్రియాం కన్యాం. వైశ్యాం, శూద్రీం తథైవచ
యస్యా యే తే గుణాస్సంతి తాం మే కన్యాం ప్రవేదయ ।
న కులేన న గోత్రేణ కుమారో మమ విస్మితః
గుణే సత్యేచ ధర్మేచ తత్రాస్య రమతే మనః ।
(లలిత విస్తరం.)

నిరసిస్తూ నిరోధిస్తూ ఉండిరి. ఆర్ష సంప్రదాయమైన విశ్వప్రేమ, సాంఘిక సమానత, సౌభ్రాత్రాలను మరల వెలయిస్తూనే ఉండిరి.

కథ ఎట్లు సాగినదో కాస్త పరికించండి. ఉపాలి మంగలి. అంగుళీ మాలుడు బోయ. వీరు బౌద్ధ సంఘములో పూజనీయ స్థానాలను బొందినారు. బ్రాహ్మణులు తీరుతీరు వృత్తుల నవలంబించిరట.[1] ఒక విప్రుడు ధనుష్క[2] వృత్తిలో జీవించినాడు. అంతకుముం దాయన నేతవృత్తిలో నుండేవాడట. మరొక బ్రాహ్మణుడు రథకార వృత్తి నవలంబించినాడట.[3] ఇట్లే బ్రాహ్మణు లేయే వృత్తులతో జీవిస్తూ ఉండిరో తెలుపు జాబితా ఒక జాతక కథలో నున్నది.[4]

క్షత్రియుడు కాని మౌర్య చంద్రగుప్తుడు సమ్రాట్టై జగజ్జేగీయమానంగా రాజ్యతంత్రం నడపినాడు. శుంగ కాణ్వాయన వంశాలు బ్రాహ్మణులు. కాని వారు క్షాత్రమును స్వీకరించినారు. కదంబులు బ్రాహ్మణులైనా క్షాత్రముతో జీవించిరి; వాకాటులతోనూ పడమటి గాంగులతోనూ చుట్టరికాలు కలిపినారు. కదంబవంశీయుడు మయూరవర్మ కుమారుడు లోకాదిత్యుడు కొరగార[5] ప్రభు కుటుంబపు కన్యను పెండ్లాడినాడు. రుద్రదాముడు ఉషవదాత మొదలైన శకకుషాణులు క్షత్రియులైనారు. "హెలియో ఢోరస్" అనేయవనుడు-రాజదూత-వైష్ణవము స్వీకరించి యీ దేశపు సమాజంలో లీనమైనాడు. కనిష్కుడు కుషాణుడు, కాని బౌద్ధుడై క్షత్రియులలో చేరిపోయినాడు. ఇట్లే పై నుండి వలస వచ్చిన యవన శక కుషాణ పల్లవులు మొదలైన గణాలవా రెందరో

---

1 IV–457 జాతక కథ

2 III–219; V. 127-128; 356-57. జాతక కథలు.

3 IV–207–208 జాతక కథలు

4 IV–495 జాతకం.

5 "కొరగారులు" = తుళుదేశము నేలినారు. కొరగార జాతిని మాలల కంటే హీన జాతిగా తలుస్తారు. (ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం పు. 260)

ఆయా వర్ణాలను,వృత్తులనూ స్వీకరించి ఈ దేశీయ సమాజంలో లీనమై పోయి నారు. పంచములు "నందనార్" "కక్కయ్య"లు వరుసగా వైష్ణవ శైవభక్తా గ్రేసరులు. వీరు ఆ మతాలలో ఉచ్చ స్థానాల బొంది పూజింపబడిరి. కౌరవ గారకులుడు నందవంశీకుడు "కనకుడు" మహాకవియై మన్నన లందినాడు. వైష్ణవశైవములలో ఇట్లు ప్రసిద్ధులైన అవర వర్ణాలవారు అనేకులు. తుకారాం శూద్రుడు. కబీర్ సిద్ధయ్యలు ముస్లింలు. బ్రహ్మంగారు విశ్వకర్మ. వేమన రెడ్డి. వీరంతా పరమ భాగవతులూ; జ్ఞానులూ; యోగులూ అయినారు. పూజింప బడినారు. పల్నాటి వీరులలో కన్నమ మాల; సేనానియై కదన వ్యూహమును నడిపినాడు. బ్రహ్మనాయకునకు నమ్మిన సేనాని. ఇంకా ఆయుద్ధంలో బాల చంద్రుని సహాధ్యాయులు కుమ్మరి చాకలి మొదలైన వారూ పాల్గొన్నారు. శివాజీ సైన్యంలో బ్రాహ్మణులు మొదలు భిల్లులదాకా సైన్యాధిపు లుండిరి. పంచములైన మాష్టీలూ గోసంగులూ యోధవృత్తి నవలంబించిరి.

ఇక వర్ణాంతరవివాహాలు గమనించండి. దీర్ఘ తమస్సు[1] (గౌతముడు—అంధఋషి) ఔశీనరయనెడి శూద్రిని వివాహమాడినాడు. వీరి సంతానము బ్రాహ్మణులైనారట. బాలేయ బ్రాహ్మణులట వీరు! శుక్రునికుమార్తె దేవయాని యయాతిరాజును పెండ్లాడినది. అర్జునుడు నాగకన్య ఉలూచిని, శ్రీరామ చంద్రునికుమారుడు కుశుడు ఒకనాగకన్యను పెండ్లాడినారు.

ఒకతేడు పల్లెటూరి పడుచును పెండ్లాడినాడు.[2]. మరొకతేడు ముని కన్యను పెండ్లాడినాడు.[3] అజాత శత్రువు అడవిలో తలదాచుకొంటూ పూలమాలలు కట్టువాని కుమార్తెను[4] మోహించినాడు. ఒక విప్రకన్య[5] రాజును పెండ్లాడినది. కాణ్వాయన వంశపురాజులలో వాసుదేవు

1. "భారతి-రక్తాక్షి—పుష్య-సంచిక" "ప్రాచీ నాంధ్రులెవరు?ఆర్యులు కారా?" వ్యాసం.
2. I. 421-422—జాతకం.
3. III. 249—56 జాతకం
4. VI. 348 జాతకం.
5. VI. 421 జాతకం.

చేసువాడు[1] జాంబవతిని పెండ్లాడినాడు. ఆమె పట్టపుదేవి అయినది. జాంబవతి మాల. ఒకరాణి తన పురోహితుని కుమారుని పెండ్లాడినది.[2] మౌర్యచంద్రగుప్త సార్వభౌముడు గ్రీకుసేనాని సెల్యూకస్‌కుమార్తెను పరిణయమాడినాడు. అశోక చక్రవర్తి ఉజ్జయినిలోని ఒక వర్తకుని కుమార్తెను పెండ్లాడెనట ఆదంపతుల సంతానమే సంఘమిత్రయట.[3] గుప్తవంశీయుడు సముద్రగుప్త చక్రవర్తి నాగరాజు కుమార్తెను పెండ్లాడినాడు.[4] క్రీశ. 4వ శతాబ్దిలో ఈ దేశమంతా చుట్టి చూచిన చీనా యాత్రికుడు ఫాహియాన్ ఈ దేశపు విశేషాల నుల్లేఖిస్తూ "వర్ణాంతర వివాహాలు జరుగుచున్నవ" న్నాడు.[5] రాజస్థాన్‌రాజులలో ప్రసిద్ధుడు గెహలోత్ వంశీయుడు "బాప్పారావల్". ఈయన గజనీరాజు 'సెలీం'ను ఓడించి సెలీం[6] కుమార్తెను పెండ్లాడినాడు. ఇప్పటికే చాలా పెరిగినది. కాన ఒకమాట చెప్పి విడుస్తాను. పల్నాటి వీరులు సాగించిన చాపకూళ్లు (అన్ని వర్ణాలవారు సహపంక్తిని భుజించుట). జగన్నాథంలో దేవ ప్రసాదమును (వండినది) మంగలి పంచుతూ ఉంటే అగ్రవర్ణాలవారు ఆహారించటం, గయలో గయావళీలను[7] పితృకర్మలో పూజిస్తూ ఉండటం, గంగాపుత్రులను సన్మానిస్తూ ఉండటం మొదలైనవి కులీనతా అహంకారాన్ని కుతికిల పడజేసి సాంఘిక సమానతను, పరస్పర సౌజన్యమును, సహనమును నెలకొల్పుటకే వెలయించి వుంటారనుకోవచ్చు. ఇంకా యాత్రలు, తీర్థ సేవలు, వనసమారాధనలు మొదలైనవీ అన్ని రకాలవారూ భేదాలు లేక కలసి మెలసి మెలగుటకు తోడ్పడినవి.

---

1 III. 340 జాతకం.

2 బౌద్ధ. మ. యు. పే. 129.

3 బౌద్ధ. మ. యు. పే 129

4 బౌద్ధ. మ. యు. పే 272

5 హిందు. మ. యు. పే 2[illegible]6

6 మహా. మ. యు. పే 233-34

7 గయావళీలు బ్రాహ్మణులు కారు. వీరి స్త్రీలు మేదరులట: శ్రీ ఏనుగుల వీరాస్వామిగారి కాశీయాత్ర చరిత్ర—శ్రీ దిగవల్లి వెంకట శివరావు గారు సంపాదించి ప్రచురించినది పే 2.

ఇవి చూడండి : కొన్ని సందర్భాలలో సామాన్య పౌరునికంటె బ్రాహ్మణునకు హెచ్చుగా దండన[1]. 'ప్రజాహితకార్యాలకు' ఆటంకము కలిగించి ఆ కార్యాలు నిర్వహించుటకు చెరుపు చేసినవాడు బ్రాహ్మణుడైతే అదే దోషానికి ఇతర దోషికి విధించే దండనకంటే ఈ విప్రదోషికి మరింత దండన విధింపవలెనట. చంద్రగుప్తుని[2] రాజ్యంలో అగ్రవర్ణాలవారు అవర వర్ణాలవారు అనే తేడా లేవీ లేక అందరకూ దండనస్మృతి సమంగానే వర్తిస్తూ ఉండేదట.

ఇన్నిగాథ లీతీరుగా చాటి చెప్పుతూఉన్నా కొందరేమో ఒప్పుకో మంటారు. "స్వధర్మం విడువరాదని గీతలే ప్రబోధిస్తూ ఉంటే — మరొక మాట అనే దానికి వీలెక్కడ ?" అంటూ నిరసిస్తారు. వారు ప్రమాణీకరించే గీతావచనాలు:— "పరధర్మాన్ని బాగా పాలించే దానికంటే గుణం తక్కువదే అయిన సొంతధర్మమే మేలు. సొంతధర్మంలో చచ్చినా మంచిదే. పరధర్మం భయంకరము.[3] " "పరధర్మాన్ని బాగా పాలించే దానికంటే గుణం తక్కువదే అయినా సొంత ధర్మమేమేలు. నీకు పుట్టుకతో ఏర్పడిఉన్న కర్మచేస్తూ ఉంటే పాపాలు అంటవు[4]."

వీటిలో ఉన్న "స్వధర్మ" "పరధర్మ" ములనే మాటలను అన్వయించుటలో వీరు భ్రాంతులవుతూఉన్నారు. ఆ పైన "స్వభావనియతం" అనే దానినీ వీరు పొరపాటుగానే అన్వయిస్తున్నారు. "స్వధర్మం" అంటే ఒక

---

1 కౌటిలీయ అర్థశాస్త్రం—ధర్మాస్థీయం 388. అధికరణం.

2 బౌద్ధ మ. యు— పు 102.

3. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః.
(గీ—అ.3. శ్లో. 35.)

4. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్
స్వభావనియతం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్.
(గీ-అ.18—శ్లో.47)

వ్యక్తికి వంశపారంపర్యంగా వస్తూఉన్న వర్ణపుధర్మమనీ, దానికి వ్యతిరేకమైన వర్ణాలన్నీ పరధర్మాలని వీరి అన్వయాలు. ఆలాగే స్వభావనియత మనేదానికి : వంశాలకు కులాలకు—ఆయాధర్మాలు నిశ్చితాలై ఉన్నవని, కాగా ఆయా వంశాలలో కులాలలో పుట్టినవారికల్లా అవి స్వాభావికములైన కర్మలనీ వీరు అన్వయిస్తారు. వీరు అన్వయించు తీరులలోను పొరపా టున్నది. పూర్వాపర సందర్భశుద్ధి లేకుండా ఎక్కడో ఏదో శ్లోకాన్ని ఎత్తుకొని అన్వయిస్తారు. అలా చేయుటకు గీత చాటువుల సంపుటి కాదే! ఇదొక సమగ్రశాస్త్రం. పూర్వాపర సందర్భాల పొసగించి మరీ చదువుకోదగినది.

ఏ రెత్తి చూపే శ్లోకాలను "చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మవిభాగశః[1] "అన్న శ్లోకంలో చెప్పి అన్వయించ మంటాను. గుణాలు-కర్మలను గుర్తుగా గొని నాలుగు వర్ణాలుగా విభజింపబడినవట. ఆ యా గుణాలు కర్మలు వారి వారి ప్రకృతులవల్ల వ్యక్తిగతాలే అని గీత స్పష్టంగా తెలుపుతూ ఉన్నది. ఆ వివరాలకు దిగితే చాలా పెరుగుతుంది. తేలికగా తెములుస్తాను. ఈ వర్ణ విభాగానికి గుర్తులుగా స్వీకరించిన గుణాలు కర్మలు ఏలాంటివో గుర్తులేమిటో గీతయే[2] స్పష్టంగా చూపుతూ ఉన్నది. ఈ గుణాలు సత్వ రజ స్తమోగుణాలు. కర్మలు చాల వరకు ఆ గుణాల తోడివే. ఈ కర్మలు ఒకరు శాసించి అంట గట్టితే ఒదిలేవి కావు. వ్యక్తియొక్క ఇతర గుణాలకు పైతృక ప్రభావమూ ఒక కారణం కావచ్చు. కానీ అదే పరమావధి మాత్రం కాదు. ఈ గుణత్రయమూ పూర్తిగా ఎవరెవరిది వారికివారికి సంబంధించినదే. ఆయాగుణాలను (త్రిగుణాలను) అనుసరించియే వారివారి ప్రకృతులు తత్త్వాలు ఏర్పడును. దీనిని తొలగింపగాదు. అది సృష్టి నియమం, శాసనం. ఈ త్రిగుణాల సమ్మేళనంలో పాళ్ల తేడాలను[3] బట్టి ఆ యా వ్యక్తుల తత్త్వాలలోను వ్యత్యాసాలు వస్తూ ఉన్నవి. ఈ త్రిగుణాల కతీతమైన సృష్టియే లేదు. కాగా ఆయా వ్యక్తులకు

---

1. గీ—అ. 4—శ్లో. 13
2. గీ—అ-14 శ్లో—5-20, అ-17—శ్లో 2—13, అ—18. శ్లో 19—48
3. వివరాలకు సాంఖ్య శాస్త్రము చూడండి.

ఆయా గుణాలూ. ఆ గుణాల తోడులైన కర్మలూ స్వభావంగానే కలుగుతున్నవి. ఇప్పుడిక వా రుదాహరించిన గీతా శ్లోకాలలోని "స్వభావనియతంకర్మ" అనే దానికి అర్థ మేమగునో ఆలోచించండి స్వభావం=తన ప్రకృతి తత్త్వం (త్రి గుణాలలో తనయందు ప్రసరిస్తూ ఉన్న గుణం) చేత; నియతం = నిశ్చ యింపబడిన (సిద్ధించిన) కర్మ=పని, వ్యవసాయం అని సరళంగానే అర్థం వస్తూ ఉన్నది.

కాగా ఈ గుణాలు కర్మలూ ఆయా వ్యక్తుల నంటి ఉన్నవే గాని నేటి సాంఘిక మర్యాదలతో పెనగొని వంశానుగతాలుగా అంటుకొని వస్తూ ఉన్నవి కావు. ఇప్పుడు స్వధర్మ పరధర్మాలకు అన్వయ మేమిటో తేలికగానే తోస్తుం దిగా! తన ఒంట బుట్టిన తత్త్వం (గుణం—సత్వాది గుణాలలోనిది) ఏదో అదే స్వధర్మం (ఆవ్యక్తి ధర్మం) దానికి వ్యతిరేకమైనవి పరధర్మాలు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, కర్మలు[1] వ్యక్తుల స్వభావాల వల్లనే కలుగునని మరింత స్పష్టంగానే గీత చెప్పు తున్నది. ప్రకృతి సిద్ధంగా వచ్చిన గుణాల(తత్వాల— అభిరుచుల) కర్మల పట్టు తప్పుకోవటం పొసగనిదే అనవచ్చు. వాటికి వేరు పడి నడచుటా అసంభవమే. శరించి అట్టి ప్రయత్నం చేస్తాడా అందు కృతా ర్థుడు కాలేకపోగా ఉభయభ్రష్టు డగును. పరశురాముడే దానికి నిదర్శనం. ఏదో ఆవేశంతో తనతత్వానకు సరిపడని క్షాత్రం పూని రాజలోకాన్ని గాలించి గాలించి పరిమార్చినాడు. తరువాతనో ఆక్షత్ర ధర్మాన్ని నిర్దిష్టంగా నిర్వహింప లేక పోయినాడు. రాజ్యతంత్రం నడుప వెనుకాడినాడు. రాజ్యమును విప్రుల కర్పించినాడు. తననే ఆరాజ్యమునుండి తరలి పొమ్మన్నారు తుద కా విప్రులు!

ఈనాడూ చెప్పుతూనే ఉన్నారుగదా మనస్తత్త్వ విద్వాంసులు! "విద్యార్థి అభిరుచిని గుర్తించి దానికి అనువైన విద్యనే ఆవిద్యార్థికి నేర్ప దగును. అట్లొనరిస్తేనే ఆ విద్యార్థి బుద్ధి వికసిస్తుంది. అత డావిద్యలో ప్రయో జకు డౌతాడు" అని. గీత ఆదేశించేదీ అదే. గీత ఇంకాఏమంటుంది? "కర్మల

---

1. బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాంచ పరంతప
   కర్మాణి ప్రవిభక్తాని, స్వభావ ప్రభవై ర్గుణైః, గీ అ.18, శ్లో 41

నన్నింటిని సమదృష్టితో చూడవలెను. ఒకటి ఒప్పైనదనీ గౌరవ ప్రదమైనదనీ, మరొకటి తప్పైన (హీనమైన) దనీ తేడాలు తలచరాదు. అన్ని కర్మలకు సమాన గౌరవమే. కర్మల పైపై పసందులకు మురిసి పోరాదు."

వృత్తులు మార్చుకోవటం స్పష్టమైనది. అట్లని చీటికి మాటికి మార్చు కొనే వారు కారు. అనుక్రమతంగా ఒక వృత్తిని అంటిపెట్టుకొని ఉండుటలో కొన్ని అనుకూలతలు లేకపోలేదు. విద్యా క్షేత్రం మొదలు జీవికా క్షేత్రందాక ఏదేదో వెదకులాడుతూ వేసారే దురవస్థ లేదు. ఈనా డీదౌర్భాగ్యం అందరకూ తాకుతూనే ఉన్నది. విద్యార్థి ఉన్నత విద్య దాటి విశ్వవిద్యాలయ విద్యలో అడు గిడేముందు ఏకోర్సు తీసికోవలె, ఏ గ్రూపు తీసికోవలె? ఆ కోర్సులో ఆ గ్రూపులో తనకు సీటు వస్తుందా? లేదా! అన్న సమస్య లెన్నో ఎదురౌతవి. స్వాభిప్రాయం చాలు, లోకానుభవం లేనివాడు, విద్యార్థి. ఈ తికమక నుండి తెములు టెంత యాతన? ఆపైన విద్యలో కృతార్థుడై స్నాతక పట్టమును అందు కొన్నాడే అనుకోండి. ఇక అప్పుడో జీవయాత్రకు ఏవృత్తిని అవలంబించ వలెను? తాను నేర్చిన విద్య ఆవృత్తి సాగించుటకు ఉపయోగిస్తుందా? తా నభ్య సించిన విద్యకు అనువైన వృత్తిలో తనకు ప్రవేశమిచ్చేవా రున్నారా, ఈ రీదు సమస్యలెన్నో ముసరుకొంటవి. వంశానుగతమైన విద్యా శిక్షణలో ఈ బెడద లుండవు. ఆబాల్యంగా ఆటలతో పాటలతో ఇచ్చవచ్చినప్పుడే, ఉల్లా సంగా ఉన్నప్పుడే అభ్యసిస్తూ కులవృద్ధులనుండి వృత్తిమర్మాలను తెలిసి కొంటూ ఉంటాడు ఆవిద్యార్థి. కాగా వానిమేధ ఆ వృత్తిపరంగానే వికసిస్తుంది. అత డావిద్యలో కుశలుడు, ప్రజ్ఞావంతు అగును. అత డావిద్య నాశ్రయించే జీవయాత్ర సాగిస్తాడు. దానిలోనే తృప్తితో హాయి అనుభవిస్తాడు.

వంశానుగతాలైన గుణకర్మలకు ప్రస్ఫుటంగా ఏర్పడిన గుణకర్మలు వ్యక్తిలో వ్యక్తం కావటం సర్వసామాన్యం కాదని తొలుతనే తెలిపినాను. ఇది మిగుల అరుదు. ఓషధీలోకంలో ఇట్టి మారుపాటులు అప్పుడప్పుడు కను పిస్తూ ఉంటవి. ఇట్లు మారుతీరుగా వెలసిన ఓషధులను హైబ్రీడులు అంటారు. ఇట్లు మారుపాటొందిన ఓషధులు వాటి కుటుంబపు స్వభావాలకు విలక్షణాలయిన

విగా పుట్టుతూ ఉంటవి. ఆ వైలక్షణ్యాలు సామాన్యంగానే గమనించదగినంత ప్రస్ఫుటంగానూ ఉంటవి. తాటిచెట్టు జవరంగా నిటారుగా సూటిగా స్తంభం లాగున ఎదిగి ఒకే తలతో ఉంటుందిగదా! అది దాని స్వభావము. తృణ కుటుంబాని కంతటికీ ఇదే తీరు. ఇందుకు విలక్షణంగా తలను వంగలు వేసిన తాటిచెట్టు పుట్టుటా కలదు.[1]

జొన్నమొక్క ఒకే కంకిని వేసి పండుతుంది. అంతకు మించి కంకులను ఈనదు. అది దాని స్వభావము. కానీ కొన్నాళ్ల క్రిందట ఒక జొన్న మొక్క 16 కంకులను వేసినది.[2] స్వయంగా చూచినాను. ఇలాటి ప్రాకృతిక వైలక్షణ్యాలెందువల్ల ? వైజ్ఞానికు లేమంటారో? త్రిగుణాలు (సత్వ—రజ—స్తమస్సుల) కలియుటలో మొహతాదులు మారుటవల్ల ఇలాంటి మార్పు లని ఆర్షపు భావంగా కనుపిస్తుంది. మాతాపితల సంయోగ సమయాన వారికి ఉండే భావాలు ఆ పిమ్మట గర్భకాలాన మాతకు ఉండే మనఃప్రవృత్తులూ శిశువును బాగా ముద్రిస్తవి. ఆ వైలక్షణ్యాల కదీ కారణం అని ఆర్షపు తలపు. శ్రీ డా. విట్జ్ (Garden witz) గారూ దీనిని ఒప్పుకొన్నారనవచ్చు.[3] కాగా వైజ్ఞానికంగానూ ఇది మాననీయ మనదగును.

ఓషధులలో వలెనే మానవులలోనూ తమతమ అనువంశిక-లేదా-వర్ణపు లక్షణాలకు విలక్షణంగా వ్యక్తులు పుట్టుట సంభవమే. అట్లు విలక్షణ గుణాలతో పుట్టిన వారికి తమ ఆనువంశికవృత్తి, ఆ పరిసరాలు అనుకూలించవు. కనుక తమ అభిరుచులకు అనువుపడిన ఆయా వృత్తులను స్వీకరిస్తారు అట్టి సారూప్యవృత్తిగలవారి సహవాసాలు సాహచర్యలు కూర్చుకొంటూ ఉంటారు. అందువల్ల వీరూ ఆ వృత్తి, వర్ణం పేరుతోనే వ్యవహరింపబడుతూ ఆ వృత్తి

---

1. ఇది పత్రికలలో ప్రకటింపబడిన విషయం. ఆపంగల తలతాటి చెట్టు ఫోటోను ప్రచురించినారు.
2. జగ్గయ్యపేట హైస్కూల్ ఉరుదూ మున్షీ గారింట్లో మొలచిన దీజొన్న మొక్క.
3. "Modern Review "1921 August - "A new race theory".

వర్ణం పరంగానే అయిపోతారు. ఇతిహాసాలలో వర్ణం - వృత్తులు మార్పొం దటం చూడనే చూచినాము. దాని క్రమ మిదేనని నాతలపు. ఈ తీరుగా గుణ ప్రభావితులై వారివారికి అనువుపడిన వృత్తులలో ప్రవర్తిల్లుతూ ఉండేవారిని అడ్డగించు శక్తి ఏదీ లేదు. ఎవరికీ లేదు. అది ప్రకృతి పథకం. ఆ పథకం నాటికీ నేటికీ చెల్లినదే.

స్వామి వివేకానందుల వారూ, సాధుసుందర్‌సింగ్ మొదలైన వారు జన్మతో బ్రాహ్మణులు కారు. కాని వారి గుణాలు త్రోపుపెట్టగా వారు బ్రాహ్మీ స్థితి నందుకొని ధన్యులైనారు. వర్ణాలు పట్టింపులేక లోకమంతా వారి నర్చిస్తూనే ఉన్నది. ఇట్లే ''సాయిబాబ'' జన్మతో బ్రాహ్మణులు కారు. కాని ఈ మహా పురుషుడు నిశ్చల యోగ సిద్ధుడైనాడు. వీరిని బ్రాహ్మీభూతులుగా అన్ని వర్ణాల వారూ అంగీకరిస్తున్నారు. వినీతవేషంతో వినతమస్తకులై అంజలి ఘటించి నమస్కరిస్తూనే ఉన్నారు. ఈ సందర్భంలో మరొకపావన చరిత్రుని కల్యాణ గుణుని తలపకుండలేము. పూజ్యులు మోహన్‌దాస్ కరంచంద్‌గాంధీజీయే ఆ మహావ్యక్తి. ఆ మహనీయుని శీలసంపదకు అబ్బురమొంది "మహాత్మ డని'' తొలిసారిగా ప్రశంసాపదము ప్రయోగించినది మాననీయ శ్రీ అనిబిసెంట్ గారు. జన్మతో వీరూ విప్రులు గారు. కాని వారి వదనాన తేజస్సు తొణుకుతూ ఉండేది. హృదయాంతరాళాల చొచ్చుకొని పోయి, ఉల్లా సాన ఊగించేది వారి చూపు. మర్మాలు లేక సూటిగా ఎదల నాటుకొని విను వారిలో ఆత్మ విమర్శ రేపి కర్తవ్య పరాయణుల జేయునది వారివాణి. వీరి నేవర్ణమున గణింప శక్యము ? రాజఋషి అందామా! బ్రహ్మర్షి అందామా! దేవర్షి అందామా!

బ్రాహ్మణ వంశంలో జన్మించి, బ్రహ్మను దర్శించిన పావనపురుషులు ఎవ్వరూ మూర్తులు నేడూ ఉన్నారు. పూజ్యులు, మహాకవి, ఋషి రవీంద్రనాథ్ టాగూర్, అపూర్వ యోగద్రష్ట అరవింద ఘోష్, యోగ సిద్ధులు శ్రీ రమణ మహర్షి మొదలైనవా రట్టివారు.

# ఆర్ష కుటుంబము

## పంద్రెండవ నివాళి

## వ్యక్తి

ఆర్ష సమాజపు సంప్రదాయంలో భావ స్వాతంత్ర్యము, వ్యక్తి స్వాతంత్ర్యము లేవని ఒక అపవాద మున్నది. వీటిని గురించి మనవారు పెద్దగా ప్రత్యేకించి ప్రకటనలు చేయకుండవచ్చు. కాని అట్టి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను వా రనుభవించలేదనుట తగదు. భావ స్వాతంత్ర్యము విషయము ఆలోచింపుదాము. తండ్రి బడుగు గోవులను దానమిస్తూ ఉండగా 'అది పాడి ఆవు గాదు నాన్నా' అని నచికేతువు తండ్రిని హెచ్చరిస్తాడు. తండ్రి విసుగుతో "ని న్నా యమున కిస్తా" అని నోరు జారి కలవరపడుతూ ఉంటే తండ్రి మరొక ప్రమాదమునకు పాల్పడ నున్నాడని గ్రహించి "నాన్నగారు! అనృతదోష మంటరాదు. ఆ యముని దగ్గరికే పోతా"నని నచికేతుడు తండ్రికి ధర్మం నిరూపిస్తాడు. కల్హణుడు 'రాజతరంగిణి'లో జనుల గుణశీలాదులతోనే విడుపలేదు. రాజుల గుణశీలాదులనూ నిర్దాక్షిణ్యంగా విమర్శించినాడు. ఒకచోట బ్రాహ్మణులను విమర్శిస్తూ "బాహ్మణ బ్రువు" లన్నాడు కాశ్మీర కళింగ మహారాష్ట్ర మహీపాలురు శైవులై యుండగా వారి రాణులు బౌద్ధము నాదరిస్తూ ఉండిరి. ఇట్లే ఇక్ష్వాకు నరేశ్వరులు వైదిక మతావలంబులై యుండగా వారి రాణులు బౌద్ధము నాదరిస్తూ ఉండిరి. క్షేమేంద్రుడు మహాకవియేగాక నిర్దుష్టమైన విమర్శకుడు గూడ. ఈ మహనీయుని విమర్శలు నిర్మొహమాటంగానూ, నిశితంగాను, పరిహాస గర్భితంగాను ఉంటవి. ఈ విమర్శలు ఒకరిని అవమానించు తలపుతో గాక చక్కదిద్దుటకే చేసినాడు. ఆ సూచనలు కళావిలాసం పదవ అధ్యాయంలో కనిపిస్తూ ఉన్నవి. ఆనాటి సాంఘిక దురాచారాలనూ కాపట్యాన్నీ తూరుపార బెట్టినాడు. రాజకీయోద్యోగుల దౌష్ట్యం,

లంచగొండితనం, ప్రభుత్వపు పత్రాలలో అక్షరాలను చెరిపి *దిద్ది అమాంతంగా విపరీతార్థాలు కలిగించే కొంటెతనం మొదలైన దుశ్శీలాలను నిర్భయంగా కడిగినాడు. ఇతరులు తనను విమర్శిస్తే శాంతంతో సహనంతో అవలోకించి తన తప్పులుంటే ఒప్పుకొనేవాడు. మరొక అపూర్వ విశేషం ఏమంటే—తన లోపాలను తనే ఎత్తి చూపేవాడు. శ్రమోపజీవుల దుర్దశకు వగచి, "సేవ్య సేవకోపదేశము"ను రచించినాడు. ఆ మహాకవి మాటలతోనే వాటి మచ్చు చూప దగును. కానీ మూల మందుబాటు కాలేదు. కాన నా తెనిగింపు పద్యాలనే వినిపిస్తూన్నాను.

"కష్ట జీవులఁ బొడగాంచి కంట తడినిఁ
బెట్టి నిజకార్యములఁ బెడ నెట్టియైనఁ
జేయుఁడా సేవ్యసేవక సేవలకును
జగతి సజ్జనవరు లనుశాసనమ్ము!

దర్పమున నొక్కఁ డింక లౌభ్యమున నొకఁడు
సేవ్య సేవకు లిరువురు జీర్ణ దృష్టు
లగుట ధనగర్వ వికృతిని నార్తి వికృతి
నారయగ నేర రన్యోన్య మాననముల.

గర్వపటలమ్ము గన్నులఁ గ్రమ్ముకొనఁగ
మ్రోలఁగల నేలనుం జూడఁజాల నట్టి
వాఁడు దారిద్ర్యదోషంబువలన లాఘ
వంబు గాంచినవాని సేవకుని గనునె?

---

*మచ్చుకిది :– నాగరిలిపిలో "స" "ర"లు చాలా సన్నిహిత రూపాలు. ఒక నిలువు గీత ఒక చిన్న అడ్డగీత మాత్రమే భేదం. పత్రంలో "సహితం" అని ఉంటే గీతలు చెరిపి "రహితం"గా చేసే వారట. బల్లమీద వ్రాస్తూ లంచం కోసం బల్ల క్రిందుగా చేయిచాపేవారట.

కుంటియును బోలె మోయించు కొను నొకండు
వినుతిసేయును చెవిటిని వేఱొకండు
సేవ్య సేవకు లిరువురు సిగ్గుమాలి
హాస్యమున కగ్గ మగుచుందు రవనియందు.

ఎవ్వఁడ? వేగ వెచ్చటికి? భృత్యుఁడ నే నృపదర్శనార్థమై;
కవ్వడి లాభమేమి యట? కల్గును తన్నులు తాపు లయ్యె; యా
నొవ్వికి మన్ను బూసెదె? కనుంగొనరా దట మాట త్రొక్కుడిన్
మవ్వయుఁ జాలునా సఖుఁడ! దుష్ప్రభుఁడా! పదివేల దండముల్!

వృత్తిచేతనె జగము జీవించు నిజము;
ఏరికో కొందరికె సేవ వృత్తి యగును;
దాస్య మా స్థానమునఁ దీవ్రతర మగుటను
దెగడుఁడీ దానిఁ బ్రాజ్ఞులు తెగువమీఱ ॥

కడుపు కక్కుఱితికి నిన్ను ' కర్ణాట కిరాట కీచకులకు'' అమ్మను తల్లి! 'కాటుక కంటి నీరు చను గట్టులపైఁబడ' నేడువ కమ్మా! అని వాగ్దేవిని ఆశ్వాసిస్తూ పరమ భాగవత శేఖరుడు పోతనగారు పలికిన నుడులు, సత్కవులు ''నిజదార సుతోదర పోషణార్థమై హాలికులైన నేమి? గహనాంతర సీమల కంద మూల కౌద్దాలికులైన నేమి?'' అని వారుద్ఘోషించిన ప్రవచనాలు స్వతఃస్వతంత్రాభిమానమును. స్వయంవ్యక్తిత్వమును, స్వేచ్ఛాప్రియత్వమును తెలుపుటలేదా.

భోజుడు పసితనములోనే తండ్రిని కోల్పోయిన బిడ్డడు. కాగా భోజుని పినతండ్రి మంజుడు భోజునకు రక్షకుడుగా రాజ్యమును పాలిస్తూ ఉండెను. ఇట్లు జరుగుతూ ఉండగా మంజుని స్వార్థము బులిపించినది. దానితో మంజునిలో ద్రోహ బుద్ధి నెలవుకొన్నది. భోజుని చంపించి తనకు అడ్డు తొలగించు కోవలెనన్న పాపబుద్ధికి పట్టుబడ్డాడు. భోజుని పరిమార్చుటకు వత్సరాజు నాదేశించినాడు. వత్సరాజేమో భోజుని దాచి 'దేవర ఆనతి నెరవేర్చినాను. (చంపినాను)' అని మంజునకు నివేదిస్తూ ''అయ్యా! భోజు డీకమ్మను

మీ కందిమ్మన్నాడు." అని ఒక జాబును ఇస్తాడు. దానిని పరికించి మంజుడు తన దుర్బుద్ధిని దలచి సిగ్గిలి పశ్చాత్తాపముతో పలవరిస్తాడు. ''ఈ నాపాపానికి పరిహార మేమిటి? ఈ నాదోషానికి దండన మేమిటో తెలుపం''డని ప్రాడ్వివాకుల నడుగుతాడు. "కట్టు బట్టతో కణకణ లాడుతూ ఉండే మంటలో పడుట దీనికి విధింపబడియున్న దండన'' అని ప్రాడ్వివాకులు తమ నిర్ణయం తెలుపుతారు. ధర్మనిరతికి, స్వాతంత్ర్య పరిపాలనకు ఇది మచ్చు కాదా!

పీష్వాల దగ్గర న్యాయాధ్యక్షుడు(జడ్జి)గా ఉండేవాడు రామశాస్త్రి. ఆయన ధర్మైక బుద్ధి; స్వతంత్ర నిరతుడు. న్యాయదానంలో నిష్పాక్షికుడు; నిర్భీకుడు. ఇట్లుండగా పీష్వా కుటుంబంలో అంతః కలహాలు అలుముకొన్నవి. కుట్రలు సాగినవి. అవి పెరిగి పెరిగి చివరకు లేబ్రాయపువాడు నారాయణరావు పీష్వానే ఆహుతి గొన్నవి. నారాయణరావు పీష్వా వధింపబడ్డాడని రామశాస్త్రి విన్నాడు. ఆవెంటనే ఆయన మాధవరావు పీష్వా యెట్టెదుట ప్రత్యక్షమైనాడు. ''పీష్వాల పీఠము కళంకితమైనది అపవిత్రమై పోయిన రాజముద్రను అంటుకొని యిక నేను వ్యవహరింపనొల్లను'' అని నిశితంగాను, నిర్భయంగాను, ధర్మ సమ్మతంగాను విమర్శించినాడు, తన పదవిని పరిత్యజించినాడు. పాలకుని సమ్ముఖంలో అదురు బెదురు లేక ఉన్నదున్నట్టు నిర్మొహమాటంగా పలుకుట, తన విశ్వాసం కోసం పదవిని తృణప్రాయంగా పరిత్యజించుట భావ స్వాతంత్ర్యానికీ స్వతంత్ర ప్రవృత్తికీ నిదానాలు కావా?

మేవాడురాజా రాజసింహుడు చరిత్ర ప్రసిద్ధి కెక్కిన జాబు నొకదానిని ఢిల్లీ పాదుషా ఔరంగజేబుకు వ్రాసినాడు. ఢిల్లీపాదుషాకు హితము ధర్మము నీతులను నిర్ద్వంద్వముగానూ, నిర్భయంగానూ, నిపుణంగానూ దానిలో నిరూపించెను. దీనిలో భావస్వాతంత్ర్యము, స్వతంత్రానురక్తి లేవా?

విదేశ యాత్రికుడు చీనాదేశీయుడు ఫాహియాన్ ఈదేశాన్ని దర్శించినాడు; ఉల్లేఖించినాడు. ఆయన ఈ దేశాన ఈ మూలనుండి ఆమూలకు ఆరు సంవత్సరాలు సంచారము చేసినాడు. తా నిచ్చగించిన తావులన్నీ త్రొక్కి చూచినాడు. ఇచ్చగించిన వారి నందరినీ కలసికొని ఇచ్చగించిన విషయాలన్నీ

చర్చించినాడు. ఆయన కే ఆటంకమూ లేదు. "రాజపురుషులవల్ల ఎవరికీ ఏతీరు విరోధాలు లేకుండెను'' అని ఆయనే ఉల్లేఖించినాడు. స్వేచ్ఛ కిది గుర్తు కాదా !

ఇట్లెన్నోచూపవచ్చును. ఇంత దేనికి? ఈ నిదర్శనాలు, ఇన్ని తత్త్వశాస్త్రాలు, విమర్శనాలు ప్రతి విమర్శనాలు, ఖండనలు మండనలు మొదలైనవన్నీ భావస్వాతంత్ర్యము లేనిదే వెలసినవా? చార్వాకం వంటి నాస్తిక దర్శనాలకు తా విచ్చినారంటే ఏమన దగును? మనో దేవతను విశ్వసించినందుకేగా సోక్రిటీసును విషము ద్రావించి పరలోకమునకు పయనము కట్టించినారు స్వాతంత్ర్యపావనకు గురుపీఠ మనుకొనే గ్రీసువారు? ప్రేమతత్త్వమును బోధిస్తూ శాంతి సందేశము నందిస్తూ ఉన్నాడనేగా పూజ్యుడు ఏసుక్రీస్తు ప్రవక్తను చిదుక మోది, శిలువనెక్కించి చీలలు గొట్టినారు యూదులు? ఈశ్వరు డొక్కడే అని ఎలుగెత్తి చాటిస్తున్నాడనేగా మహనీయుడు మహమ్మదు ప్రవక్తను కడగండ్ల బొందించినారు అరబ్బులు? ఈ తీరు భావదమనాలు ఈ దేశాన ఎరుగము.

వ్యక్తి స్వాతంత్ర్యమా? ఈనాటి రాజకీయపు కొలమానంతో కొలిస్తే అది కొఱవడినట్టే కనుపించవచ్చు. కొసకొమ్మ లంటే పదజాలంతో మాత్రం ఉత్తేజిస్తూ మానవసత్త్వాలు (హక్కులు) వ్యక్తి వాక్ ప్రకటనాదుల స్వాతంత్ర్యాల ఉద్ఘోషణలు (మగ్నాకార్టా) లేనిమాట నిజమే. కాని ఆస్వాతంత్ర్యోద్ఘోషణల వెన్నంటియే ఉండెడి వాటివాటి నిబంధనలు (limitations)?

ఇవి ఆపెద్దపెద్ద మాటలతో గల ప్రకటన (మగ్నాకార్టా)ను పరిమిత పరుస్తూ ఆచరణలో కుంచించేవీగా (ఉన్నవి) లేవు. దీనిని బట్టి ఏమంటాము? స్వాతంత్ర్యాలు కొన్ని పరిమితులకు లోనైనవే. స్వైరవిహారం మాత్రం కాదనవచ్చుగా !

పోతే ఆర్ష వ్యక్తికో యిలాటి సత్త్వాల (హక్కుల) కోసం ఆది వేదం లేదు. విధుల నిష్ణాతుడతడు. ప్రతివ్యక్తి విధులను (బాధ్యతలను)

అనుష్ఠిస్తూఉంటే సత్త్వాలు (హక్కులు) అడుగకుండానే లభిస్తవి. వారి లోకనీతికి సులువైన కొలమాన మొకటి చూపినారు. ఆత్మౌపమ్య బుద్ధితో వ్యవహరించుట అది. "ఎదుటివారి పరిస్థితిలో నీవే ఉంటే ఏది ఎట్లా జరిగితే నీ కప్పుడు హితంగా ఉంటుందను కొంటావో ఊహించుకొని ఆ తీరుగా ఎదుటివారిపట్ల వ్యవహరిస్తూ ఉండు." అనేదే ఆత్మౌపమ్యం ఈతీరుగా వ్యవహరిస్తే ఒకరింకొకరికి ఏతీరునా బాధకులు కాజాలరు. ఎవరి ఏసత్త్వాలూ భంగపడవు. ఇంకా ఆర్షవ్యక్తికి వినయ మొక విశిష్ట గుణం. వినయము,ధర్మము అతనికి ప్రాణసదృశాలు. కనుక సహజంగా అన్నిటినీ తన నెత్తిన పాముకోవలెనని బులపాటపడడు. తనకు సంబంధించని విషయాలలో ప్రవేశించి యేవేవో చేయ బూనటం, మాటాడబోవటం, గొడవలజేయటం ఉండదు. కాని సమాజానికి తానుచేయవలసిన సేవా (విధి) ధర్మాలేమిటో అతడు చక్కగా ఎరుగును.

వ్యక్తిస్వాతంత్ర్యాన్ని మనవా రుపేక్షించలేదు. కాని వ్యక్తి అన్న దానికి వారి నిర్వచనం విలక్షణం. నేడు ప్రచారంలోఉన్న అర్థంకంటే లోతైనది. భౌతిక శరీరాన్ని వ్యక్తిఅనుట వా రొప్పుకోరు. వస్తుతః దానికి వ్యక్తిత్వం లేదు. దానిలో ఆత్మఉండకపోతే అది కొఱగాని దగును. అందుచే వారా అంతర్నిహితమైన ఆత్మకే ప్రాముఖ్యమిచ్చినారు. ఆ "ఆత్మను నష్టపరుచుకోరాదు. అది స్వతంత్రము" అని గీత సర్వచిస్తుంది. ఆ ఆత్మస్వాతంత్ర్యానికి భంగం కలుగనుంటేమాత్రం వారు సహింపరు. ఇది వారి వ్యక్తిస్వాతంత్ర్యము. ఇట్లు వ్యక్తి స్వాతంత్ర్యాన్ని నిర్వచించి దానిఅంచనాలతోనే సమాజహితాన్ని వారు సరితూస్తారు. ఈ ఆత్మపరిణామంతోకూడిన సమాజహితమే నిత్యమూ సత్యమూ అయినదని వారి నిశ్చయం.

సమాజహిత మనేదానికి అతని అంచనాలు వేరు. ఇది ఎంతమందికి హితం? ఎంత ఎక్కువహితం? అనే యీతీరు బాహ్యములైన పరిణామ పుతూకాలతో అంచనాలు గట్టడు. ఆత్మశాశ్వతము అతనికి. కాన ఈకార్యం వల్ల సమాజంలో ఆధ్యాత్మిక వికాసం ఏపాటికలుగుతుంది అని ఆలోచిస్తాడు.

ఇదే వాని అంచనాకు తూకపురాయి. అదే ధర్మమంటే. ఆధర్మానికి హాని కలుగ నున్నదంటే మాత్రం సహింపడు. అట్టి వారిని ప్రతిఘటించి నిశ్చలంగా నిలుస్తాడు. ఈ పోరాటంలో తనకెంతటి దారుణ విపత్తులు దాపురించినా నిర్భీకుడై నిశ్చలంగా నిలిచి భరిస్తాడేగాని అధర్మానికే పరిస్థితులలోనూ తల ఒగ్గడు. తనధర్మమే తనకు రక్ష అని గాఢంగా విశ్వసిస్తాడు. అధర్మి తన కెంతటి ప్రియతముడే అయినా, గౌరవ భాజనుడే అయినా, రక్తసంబంధి, పితృ, భ్రాత, మాత, త్రాతయే అయినా నిర్మమకారంగాను నిర్భయంగాను ధర్మపక్షాన నిలిచి ప్రతిద్వంద్వియై పతిఘటిస్తాడు. ఆ అధర్మి తండ్రేగాని, గురువేగాని, భర్తేగాని, ప్రభువేగాని "మీరు చేస్తున్నది అధర్మం" అని నిర్మొహమాటంగా నిక్కచ్చిగా చెప్పుతాడు. అయితే మాటతీరులో మాధుర్య వినయాలు తొణుకుతూనే ఉంటాయి. అధర్మితో పోరాడుతూ ఉన్నవానియెడల ప్రేమగౌరవాలు కొఱవడవు. క్రౌర్య ముండదు. అతని పోరాటం అధర్మివ్యక్తితో కాదు, వాని నంటుకొన్న అధర్మవ్యాపారంతో. ఇందుచే పోరాటం పిదప ఈసు మచ్చరాలు కచ్చలు మిగులవు. ప్రేమయే ప్రవహిస్తుంది. దీనికి మచ్చుతునకగా ప్రహ్లాదుని కథే చాలు. ఈకథ నెరుగని భారతీయు డుండడు. తండ్రి ప్రియతముడే, పరమపూజ్యుడే కాని. ఆజనకుడే తన ఆధ్యాత్మిక జీవితాన్ని ఉరికట్ట జూచినాడు. తనఆధ్యాత్మిక విశ్వాసాన్ని, వికాసాన్ని, అభ్యుదయాన్ని చేజేతుల చిదిపి వేయ పట్టు బట్టినాడు. ఆఅధర్మాన్ని సాగనీయనని బాలుడైన ప్రహ్లాదుడు ప్రతిఘటించి నిలిచినాడు. బాధాపరంపరల నాహ్వానించి తండ్రిని పల్లెత్తి మాట అనలేదు. అగౌరవించలేదు. వ్యక్తిగా ద్వేషించలేదు, నీది అధర్మమని చెప్పుటకు వెరవలేదు. మన కళ్ళ యెదుట మనమహానేత మహాత్మా గాంధీజీ నడిపిన అపూర్వ స్వాతంత్ర్య సత్యాగ్రహము ఇట్టిదే. దాని ఉదాత్త ఫలమును మన మనుభవిస్తూనే ఉన్నాము.

మరికొంత లోతుగా ఆలోచిస్తే ఈధర్మాధర్మాలసంగ్రామం ప్రియులతోనే గాదు, తనలో తనకూ జరుగుతూనే ఉంటుంది. అనుక్షణము ఆసురీ తత్త్వానికీ (అజ్ఞానానికీ) దైవీతత్త్వానికీ (జ్ఞానానికీ) జరుగుతూ ఉండే సంఘర్షణమే అది. ఈ సంఘర్షణపు తీరుతెన్నులు తెలిసికొన్న వారికే ఆ ధర్మసంగ్రామపు

ఆర్షకుటుంబము

తత్త్వం ఆకళిం పోతుంది. ఎవరైనా ఏ సందర్భంలోనైనా కాకతాళీయంగా ఒకధర్మ పక్షాన నిలిచినా, ధర్మ సంగ్రామ తత్త్వం దెలియనంతదాక వారిది పూర్తిగా ధర్మసంగ్రామ మని పించుకోదు. అట్టిదానిలో క్రౌర్యద్వేషాలబీజాలు దాగియే ఉంటవి. ఈ భావంతోనే ''మీరుహిట్లరును జయింవవచ్చు. కాని హిట్లరిజం (హిట్లరుతత్త్వాన్ని) జయించ లేరు." అని మిత్రమండలి నుద్దేశించి మహాత్ముడు గాంధీజీ పలికినారు ఇది ఇట్లుండనీయండి.

అసలు వ్యక్తి స్వాతంత్ర్యమనేది తొలుత గ్రీసులో మొలకరించినది. 'ఎవ రేవృత్తిని అవలంబించ గోరితే వా రది చేయుటకు స్వేచ్ఛ ఉండవలె. ఏఅవరోధము ఉండరాదు' ఇదే వారి నిర్వచనం. ఆనాడాదేశాలలో బానిసల (slaves) స్థితి మిగుల దారుణంగాను, దుర్భరంగానూ, దయనీయంగానూ ఉండేది. మృగాలను చూచినట్లు వారిని చూచేవారు. పశువుల వలెనే బానిసలను విక్రయిస్తూ ఉండేవారు. బానిసలపైనే గాదు వారిపిల్లలపైనా యజమానికే అన్ని హక్కులూ. బానిసల కేతీరు హక్కులూలేవు. ఆస్థితిలో మానవస్వత్వాల ప్రతిపాదనలు వారికిఅవసరమే. అది సహజపరిణామమూ, సంభావ్యమూకూడ. ఈ దేశపు పరిస్థితులు వేరు. ఇక్కడా దాసులు ఉన్నారనుట నిజమే. కానీ ఆబానిసలకూ ఈదాసులకూ తేడా ఉన్నది. బానిసల కేహక్కులూ లేవు. దాసులకో హక్కు లున్నవి, దాసులతో వ్యవహరించవలసిన ధర్మసూత్రా లున్నవి. కాగా ఇచ్చట స్వత్వాల ప్రస్తావన పొసగదు.

పోతే స్వాతంత్ర్యానికి ఆదిపీఠం అయిన గ్రీసులోనూ స్వత్వాలు అనియన్త్రితాలుగా ఉండలేదు. అవధుల కొదిగినవే. కావటానికి మహోదారములు మహిమాఢ్యములు అయిన ఆదర్శాలే. కాని ఆచరణలో అవాంఛనీయాలైన అనత్ఫలితాలూ తల లెత్తినవి. యోగ్యత అయోగ్యత, దక్షత అప్రయోజకత వీటికి తేడాలు తుడిచి పెట్టుకొని పోయినవి. అనర్హులుఅధికారమును లంకించుకొనే అవకాశం కలిగినది. కాగా దేశం దెబ్బతిన్నది. రోమనుల కిది యొక గుణపాఠమైనది. వారి తీరు గమనించే శిక్షణ (డిసిప్లిన్)కు ప్రాధాన్య మిచ్చినారు శిక్షణ(డిసిప్లిన్)లేని వ్యక్తిస్వాతంత్ర్యం వ్యర్థమూ అనర్థమూకూడా.

ఆర్షకుటుంబము

వృత్తులను మార్చుకోవటం గూర్చి, వర్ణాంతర వివాహాలు చేసుకోవటాలను గూర్చి తెలిపియే యున్నాను. వీటన్నిటినీబట్టి ఆయావిషయాలలో సరళమూ సహజమూ అయిన స్వాతంత్ర్యము ఉన్నదని తేలెను.

ఆర్ష సాంప్రదాయికమైన వ్యక్తిస్వాతంత్ర్యము అవధులులేని స్వైర విహారమూ కాదు. నిర్జీవమైన యాన్త్రిక శిక్ష (మెకానికల్ డిసిప్లిన్) కాదు. యమ నియమాదుల సాధనలతో సానలుదీరిన నిశితబుద్ధి, విశ్వప్రేమ ప్లావితమైన మధుర హృదయాల కూర్తికొన్న ధర్మ మది.

# ఆదర్శ కుటుంబము

## పదమూడవ నివాళి

# కుటుంబరంగాలు

## ఆతురాలయం

ఆదర్శ కుటుంబపు తీరు చూచితిరిగా! అతివిస్తృతమనీ గమనించితిరి. జన సంఖ్య ఎక్కువ ఉంటే, జలుబో, దగ్గో, నొప్పో, ఏవో ఏవో చీకు లాకు వస్తూ ఉంటవి. అందులో పిల్లలు, ముదుసళ్లూ ఉంటారుగదా! అలాంటప్పుడు వైద్యసహాయం అవసరం; తప్పనిదే. అయితే చీటికీ మాటికి వైద్యుల దగ్గరకు పరుగెత్తు పరిస్థితిని వారెరుగరు. పడిసెంపట్టిన దంటేనూ, తలనొప్పంటేనూ, కడుపు నొప్పంటేనూ, అన్నం అరగలే దంటేనూ, కాలునొప్పంటేనూ, కళ్లు కలిగిన దంటేను, పళ్లునొప్పంటేనూ. విరేచనం కాలేదంటేనూ—వీటికికూడా వైద్యుడా? ఇలాంటి సామాన్యపుకాయిలాల (రోగాల)కు వైద్యుడు చేసేదేమిటి? మనమే కుదుర్చుకోలేమా! అని వారి ధీమా. శాస్త్ర చికిత్సా వైద్యము తెలిసిన వృద్ధులు ప్రతియింటా ఉండనే ఉండేవారు. వారే ఆ కుటుంబపు ప్రాణాచార్యులు. సామాన్యంగా చికిత్సలకు, ఉపయోగించే ఓషధులు, నేలఉసిరిక, విష్ణుక్రాంత, వెర్రిపాల నానబాలు వంటివి వారికి బాగా పరిచితాలు. పెరళ్లలో వాటిని వారే వెదకి తెచ్చి మందుగా చేసి యిస్తారు. దాని నుంచదగిన నేలవేము, జిట్టపగోగు మొదలైన వాటిని, చిక్కా మందులవేళ్లు, ఆకులు మొదలైన వాటిని భద్రపరిచి ఉంచుతారు. గేస్తురాలు ఇట్టివాటిని సేకరించి ఉంచవలెనని వాత్స్యాయనుడు చెప్పుట గమనించినారుగదా! ఈ గృహవైద్యం చాలవరకు మూలికలతోనే నడుస్తుంది. మరీ అవసరమైతే శీతాంశురసం, ఆనందభైరవి, శ్లేష్మ విధ్వంసి, వాత రాక్షసం, సూర్యావర్తి వంటి సామాన్యపు కుప్పెమందులు వాడుతారు. అట్టి కుప్పెమందులనుకూడా కొద్దిగా దాచి ఉంచుకొంటారు.

ఈగృహ చికిత్సా విధానము చాల సరళం, సామాన్యం, కాసువీసం ఖర్చు లేనిది. ఈ ప్రాణాచార్యులు ముందుగా విధించే చికిత్స సర్వసామాన్యముగా లంఘణం; ఆవిరి పట్టించటం; శీతోపచారాలు, తుమ్మించటం, డోకించటం, విరేచనాలగునట్లు చేయటం, కళ్లనీరు కారునట్లు చేయటం ఇంకా ఆహార విహారాలలోనూ తగిన మార్పులు విధిస్తాడు. అందువల్ల ఔషధపు అక్కరలేకుండానే ప్రకృతిలోనే చాలవరకు సర్దుబాటు జరిగి ఆరోగ్యం కలుగుతుంది. అవసర మనిపిస్తేనే చిన్నచిన్న చిట్కాలు వాడుతారు. మరీ అవసరమైతేనే కుప్పెమందులు వాడుట. ఈతీరుగా ప్రాథమిక చికిత్స సామాన్యంగా ఏయింటి కాయింటనే నడుస్తూ ఉండేది.

ఇంటివారికి వారి బంధువులకు ఇలా ఉపచరిస్తారు. సరే ! అతిథులు, ఆప్తులు, పరిచితులు, ఆగంతకులు, మొదలైనవారు ఎవరైనా తమయింటికి వచ్చి జబ్బుపడ్డా వారికీ ఉపచారాలు చేస్తారు. గృహస్థులు ముఖమెరిగియున్న వారే కాదు. ఎవరికైనా ఈతీరుగా ఉపచరించవలసినదే నట. ఆతురుడై చేరిన వారికి పడక, అలసిచేరిన వారికి ఆసనంఇచ్చి ఉపచరించవలె నట[1] .గేస్తునకిది సనాతన ధర్మమట. ఊరక ఉపచరించుటే కాదు, స్వజనాన్ని వలెనే ఆదరిస్తూ, ఔషధోపసేవ, పథ్యపానాలు విచారిస్తూ స్వస్థునిగా జేసి పంపుతారు[2] .

అట్టివారికి ఉపచరించుటలో ఇంటివారందరూ శ్రద్ధాశక్తులు చూపుతారు. అందులోనూ వృద్ధు లెక్కువగా సేవిస్తూ ఉంటారు. అదొక పవిత్రకార్యంగా వారు తలస్తూ ఉంటారు. కర్మసిద్ధాంతమందు వారికున్న గాఢ విశ్వాసం, భూతానుకంప వారిని ఇందుకు మరింత ఉత్సాహపరుస్తూ ఉంటవి. కాగా ఆతురుల మల మూత్రాల నెత్తివేయుటకైనా వా రేవగించుకోరు. ఆర్తులకు వేళకు పథ్యపానాదులు అందినవా అని విచారించుట గేస్తురాలి ధర్మమట. పథ్యపానాలకు ఉపయోగించెడిఆహారాలలో ఏవి పథ్యాలో ఏవి అపథ్యాలో సామాన్యంగా

1 భార—అర-అ—1—ప. 3

2 "..తెవుళులుగొన్న వారి కవి దీఱుట కౌషధ మీగి"

భార-అను. అ5—ప·214.

ప్రతి స్త్రీకి తెలిసే ఉండేది. ఆపాటి ద్రవ్యగుణజ్ఞానం వారికి గృహశిక్షణలోనే కుదురుకొంటుంది.

# అధ్యయనమందిరం

ఎన్నిగురుకులా లున్నా ఎన్నివిద్యాపీఠా లున్నా ప్రాథమికశిక్షకు ప్రత్యేకత, ప్రాధాన్యము ఉండనే ఉన్నవి. దానినెలవు కుటుంబమే. లిపులలోనూ, పఠనపాఠనాలలోనూ, విద్యాపీఠాలలోనూ బందీగా లేదు సరస్వతి. విశాలవిశ్వం ఆమె విలాసభూమి. విద్యఅంటే పారమార్థికవిద్య అనే తాత్త్వికలక్ష్యంతో కాక సామాన్య వ్యావహారిక దృష్టితో చూస్తే లోకంనుండి నేర్చుకోవలసిన దెప్పుడూ ఉంటూనే ఉంటుంది. విద్యార్జనమనేది అనవరతమూ సాగిపోతూనే ఉంటుంది. దానికి ముగింపు అంటూ ఉండనే ఉండదు. ఈ తీరున మానవు డాజీవితమూ విద్యార్థియే.

మొక్క వికసించుటకు ఒక్క విత్తనమే దానంతటదే చాలుతుందా? అది అంకురించుట మొదలు, పెరిగి, పెంపొంది, పూచి, కాచి, పండు పండుదాక తగినపరిసరాలు, వాతావరణము అవసరమే. నేల, నీరు, గాలి, వేడి మొదలైనవి అనుకూలంగా ఉండవలె. విద్యకూ ఇంతే అనుకూలమైన పరిసరాలు, వాతావరణం ఉంటేనే అది చక్కగా వికసిస్తుంది. మాతాపితల సంయోగ సమయంనుండే విద్య ఆరంభిస్తుంది. ఆసమయాన మాతాపితలు అమలినమనస్కులుగా, ప్రసన్నహృదయులుగా ఉండవలెనంటవి మనశాస్త్రాలు. ఇంకా మాత గర్భవతిగా నున్నప్పుడు ఆమెయెద కేతీరు ఒరిపిళ్లూ కలుగనీయరాదు. సంతతము ఉల్లాసంతో ఉంటూ ఉండవలెను. కోపతాపాలు సోకనీయరాదు. ఏతీరు దుశ్చింతలూ చేయరాదు. ఆమె బాహ్యశౌచమునేగాక ఇట్లు అంతశ్శౌచమును గలిగియుండవలెను అని మన శాస్త్రాలు విధిస్తూ ఉన్నవి. ఇవన్నీ దేనికి? పరిశుద్ధమైన పరిసరాల కోసం.

పరిసరాలూ, పరిస్థితులూ మిగుల ప్రభావం కలవని కనిపిస్తూనే ఉన్నది. మచ్చుకు ఒక కృషిక (కాపు) కుటుంబాన్నే గమనించండి. ఆకుటుంబపు వారి

మాటా మంతి, ఊహ పోహణ, పని పాటులు మొదలైన వన్నీకూడ కృషిక (కాపుదనపు) వాతావరణంలో సర్వదా నిండిపోయుంటాయి. కనుక ఆ కుటుంబపు పని నిసుగుదనం నాటినుండి వారికి ఎటు చూచినా ఆ కృషిక పరిసరాలే, వాతావరణమే కన్పిస్తూ ఉంటవి పాపలకు. అట్టి పరిస్థితులలో పెరిగిన బాల బాలికల మస్తిష్కాలలో ఆతీరుతెన్నులే హత్తికొంటవి. వారి ఆటలలో, పాటలలో, ఆలోచనలలో, ఆకళింపులలో, ఆచరణలలో అన్నిటా అవే ప్రచురము లౌతూ ఉంటవి. అందుచే ఆబాల బాలికలకు ఆ తీరు విద్యలో విశేషంగా శ్రమ లేకుండానే ఆటలతోనే ఆ విద్యలో అభినివేశం కలుగుతుంది. క్రమంగా వారి బుద్ధులు ఆవృత్తిలో వికసిస్తవి. వారి మనస్తత్వమే ఆవృత్తిపరంగా అయి పోతుంది. వా రావృత్తిలో కుశలులౌతారు. ఆపరిసరాలకు మారుబాటైన విద్యలో (వృత్తిలో) పెట్టితిమా ఆమస్తిష్కం ఆనూతనపరిసరాలు వాతావరణాలకు సర్దుకొనేటందుకు ఎంతో కష్టపడవలసివస్తుంది. ఆనూతన పరిసరాలకు సర్దుబాటంది, పనపడి, వికసించుట, సుళువు కాదు. ఇతరవృత్తుల విషయమూ ఇంతే. బ్రాహ్మణులు సామాన్యంగా పఠించుటలో పురోగాములుగా ఉండుటకు ఈ పరిసరాల ప్రభావమే కారణ మనవచ్చు.

ఈపరిసరాల ప్రభావంలో మునుముందుగా స్త్రీలపాత్ర హెచ్చు. శైశవంలో మాతృదేవి సాన్నిధ్యమే వత్సల కెక్కువకాగా ఆవాతావరణం, పరిసరాలు ఎంత పవిత్రాలుగా ఉంటే సంతానమూ అంత పరిశుద్ధులు, చరిత్రశుచులు ఔతారు. శిశువులకు ప్రతివిషయము మూలమట్టంగా తెలిసికోవలెననే జిజ్ఞాస యెక్కువ. అదే సత్యాన్వేషణ పిపాస. వారు మనసు విప్పి చెప్పుకోవటానికి, వినిపించిన దానిని తెలిసికోవటానికి, సుళువుగా వారికి అందు బాటైనది మాతృదేవి. కనుక ఆమె యెంతటి వివేకవతి, శీలవతి, ఉదాత్తగుణవతి, క్షమావతి అయిఉంటుందో ఆమె సంతాన మట్టిసజ్జను లౌతారు. ఆయావస్తుధర్మాలు, ప్రకృతిమర్మాలు, శౌచం, సదాచారాలు, సభ్యత, స్వస్థవృత్తం, సత్యం మున్నగు వాని తీరు తెన్నులు ఆ ఉత్తమమాత మప్పగా వారు విజ్ఞానులు, జ్ఞానులు, ధర్మజీవులు ఔతారు. తమతమ సంతానాన్ని, ధర్మనిష్ణాతులుగా, జిజ్ఞాసువులుగా, సత్యారాధకులుగా, వీరాధివీరులుగా, మహాభక్తులుగా, దేశభక్తులుగా, వక్తలుగా

తీర్చిదిద్దిన మాత లెందరో ఉన్నారు. ఈతీరున ఆమాతృమూర్తిభావముద్ర దివ్య ప్రబోధం బాలబాలికల జీవితాన్ని ఎంతో ప్రభావితంచేస్తుంది. కాన ఆమె తీరుపు చాల మహిమ గలది. సామాన్యంగా ఐదు సంవత్సరాల వయస్సు వచ్చే దాక మాతయే శిశువునకు శిక్షకురాలు. ఈ శిక్షణలో మాత ఎంతో మెలపుమెల కువ కలిగి మెలగదగును. సంకుచితమన స్తత్వమునకు శిశువులను దూరమం దుంచవలెను. దురాలోచనలు, పరుషభాషణలు (బూతులు—తిట్లు) తొణక నీయ రాదు. సదా ఉల్లాసంగాను, ఉదార ప్రవర్తనతోను, ఉండునట్లు దిద్దవలెను. భూతానుకంప, ధర్మచింత సహనము మొదలగు సత్సంప్రదాయములను అల వరచ వలెను. పిల్లల అల్లర్లకు చీకాకు పడి వారిని చిదుక దన్నదగదు. అట్లని అదుపు విడిచి ఆకతాయలుగా కానీయరాదు. సుమన శాండిలితో ఈ విషయమై ఇట్లా చెప్పుతుంది.

"........................................బిడ్డల
శిక్షవదలఁదిట్టఁజెట్టఁ గనియు?"[1]

అని, బిడ్డలకు శీలము మొదలైన వాటిని మప్పుటేమో మానదట. చెడుగు కనిపెట్టినా బిడ్డలను తిట్టనూ తిట్టదట. ఎంత సుమాళము ! వా రానాడు పిల్లలను తీర్చిదిద్దెడితీ రట్టిది. వివేకవతి విద్యావతి అయినసతికే ఇది సాధ్యము.

అవ్వలూ, తాతలూ పిల్లలతో ఆడుతూ వినోదిస్తూ ఉంటారని తెలి పియే యున్నాను. ఆ ఆటపాటలలో భారత రామాయణాల నుండి యెత్తి నీతి కథలు, త్యాగాలు ధర్మాలు తెలిపే కథలు పిల్లల మనస్సుల కతికే తీరుగా చెప్పుతారు. పంచతంత్రం మొదలైన వాటి నుండి కాకి నక్క మొదలైన వాటి కథలతో నీతులు ఉపదేశిస్తారు. సుమతి శతకం, వేమన నీతిపద్యాలు, చాటువుల నుండి తేలిక తేలికగా ఉండే నీతిపద్యాలు నేర్పుతారు. ముఖ్యంగా పిల్లలు రాత్రులు పరుండేటప్పుడు, అవ్వల తాతల డొక్కలలో దూరి ముచ్చటలాడుతూ ఉంటారు. వారి యీ కాలక్షేపానికి అనువైన సమయ మది. ఆనీతులు కథలు బాలబాలికల లేత హృదయాలలో చక్కగా ముద్ర పడుతవి.

---

1. భార—అను—ఆ. 4, ప—358. వ్యాసమైత్రేయ సంవాదము

ఇటుపైన 5 సంవత్సరాల ప్రాయము వస్తుంది. అంత బాలురు పితృ పాదుల సన్నిధానవర్తు లగుదురు. బాలికలుమాత్రము మాతృసన్నిధినే గృహ విద్య నేరుస్తూ ఉంటారు. బాలు రిక పితృదేవుల తీరుపులో ఉంటారు. ప్రాథ మిక శిక్షకు పితృదేవులే శిక్షకులు. అనుకరణ పిల్లలకు సహజమైన ఉత్సాహ లక్షణం. దేనిని దేనిని, ఏతీరుఏతీరుగా పెద్దలు చేస్తూ ఉంటారో వాటిని పిల్ల లెంతో ఆసక్తితో అవగాహనకోసమైన నిబ్బరపు చూపుతో లెస్సగా గమనిస్తూ ఉంటారు. ఆపైన వాటిని వారు మనస్సులో మననం చేస్తూనే ఉంటారు. ఆటలలోనూ వాటినే అనుకరిస్తూ ఉంటారు. ఆయా వృత్తులలో తండ్రులు తమ కన్న పెద్దవారు ఇతర కర్మకరులు ఏఏపరికరాలను ఎందుకెందుకు ఉపయో గిస్తున్నారో, దేనిని దేనిని ఏఏతీరులుగా ఉపయోగిస్తున్నారో, ఏఏకర్మను ఏతీరు ఏతీరుగా నిర్వహిస్తున్నారో దేనిని,దేనిని ఎట్లెట్లు నిర్మిస్తున్నారో ఆయావిషయా లన్నిటిని కళ్లార చూస్తూ, మనసార మననం చేస్తూ, చేతులారా ఆయావిధానాల ననుకరిస్తూ వస్తునిర్మాణాలను సాగిస్తూ క్రమంగా ఆయా విద్యలలో దక్షులు సిద్ధహస్తులు ఔతారు. ధీ పరిశ్రమకు సంబంధించిన విద్యలైతే అక్షరాభ్యాసం 5 వ సంవత్సరాననే చేస్తారు. నాటినుండి పెద్దపుస్తకం పట్టే (రామాయణం-భారతాములను చదువగల శక్తికలుగు) దాక పితృపాదులే ఉపదేశకులు. వారి చరణ సన్నిధినే ఆ విద్యాసేవ.

ఇట్లు పెద్దపుస్తకం పట్టునాటికి సామాన్యంగా వత్సలకు 8–10 సంవత్స రాల ప్రాయం వస్తుంది. అప్పు డిక గురుకుల యాత్ర. గురుకులాన విద్యలో కృతార్థుడై సమావర్తు (తిరిగిఇలుచేరిన) లైన పిదప పితృపాదులనుండే నేర్వ దగిన దెంతో ఉంటుంది. అయితే అది గృహస్థుగా ఉంటూ గడింపదగినది. ఆతీరు వెనుకనే తెలిపితిని.

## పరిశ్రమాలయం

ఒక్కొక్క పరిశ్రమను కొన్ని కొన్ని కుటుంబాల వారు తరతరాలుగా నిర్వహిస్తూ, ఆయా పరిశ్రమను వికసింపజేసినారు. ఒకే పరిశ్రమను అవలం బించిన కుటుంబాల వారి నందరినీ ఆ పరిశ్రమ చేయువారని తెలుపు పేరుతో

ఆర్షకుటుంబము

వ్యవహరిస్తూ ఉండేవారు. ఆపేరే వారి కులంగానూ చెప్పుకొంటారు. ఆ పరిశ్రమ వారి కులవృత్తి అని చెప్పుకొంటారు. ఈ తీరున తరతరాలుగా ఒకే పరిశ్రమను అంటిపెట్టుకొని ఉండుటవల్ల ఆయా పరిశ్రమలలో ఆయాకులాల వారు ప్రత్యేకశిక్షణ, విశిష్ట పరిజ్ఞానం, కౌశలం గడించి సిద్ధహస్తులై యుండేవారు. కనుకనే అనాదిగా ఈ దేశపరిశ్రమలు చరిత్రప్రసిద్ధి నొందినవి. కళాసౌష్ఠవం గలిగి శోభాయమానంగా ఉండేవని ప్రశంసింపబడినవి.

పూర్వం ఈదేశంలో పరిశ్రమలకు కొదువ లేకుండెను. శుక్రనీతిసారం, వాత్స్యాయనం, కౌటిలీయార్థ శాస్త్రం, జాతక కథలు మొదలైన బౌద్ధ, జైన వాఙ్మయాలు, తీరు తీరు పరిశ్రమలు వృత్తులను నిరూపిస్తున్నవి. ఆనాడు దేశం నాలుగు చెఱగులా ఎక్కడ చూచినా ఏదో పరిశ్రమ ఉండనే ఉండేది. మచ్చుకు కొన్నిటిని ప్రస్తావిస్తాను:—

స్ఫటికకర్మలు:—

స్ఫటికపు శిలతో పూసలు, బరిణలు, చిన్నబొమ్మలు, కళ్లద్దాలు మొదలైనవాటిని చేయుట.

మృత్కర్మలు:—

పూసలు, పాత్రలు, గాదెలు, మొదలైన గృహోపకరణాలు, ఇటుకలు, పెంకులు, మొదలైన గృహనిర్మాణపుసంబారాలు చేయుట. ఈపరిశ్రమ చాలా ప్రశస్తంగా ఉండేది. శిల్పపువిన్నాణముగల పాత్రలను చేస్తూ ఉండేవారు. అవి చాలాకాలము మనుచుండేవి. వాటికి పెట్టెడి రంగులు, మెరుగులు మనోహరంగా ఉండేవి.

కాచకర్మలు:—

గాజు, మట్టితో పూసలు, కాచకుప్పెలు, స్త్రీలు ధరించే గాజులు, బొమ్మలు, పాదరసపు బుడ్లు మొదలైన వాటిని చేయుట.

దారు కర్మలు:-

గృహనిర్మాణంలో తలుపులు, గవాక్షలు మొదలైన కార్యపనులు చేయుట, రథాలు, బండ్లు, నౌకలు, (ఓడలు) మొదలైన సముద్రయాన సాధనాలను, ఆసనాలు, పెట్టెలు, మొదలైన గృహోపకరణాలను చేయుట.

లోహకర్మలు:-

ఆయాలోహాల మన్నులు రాళ్లను బట్టీలు పెట్టి, ఆయాలోహాలను తీయటం, అట్లు తీసిన లోహాలను శుద్ధి చేయటం, శుద్ధలోహాలతో గృహోపకరణాలు, ఆయుధాలు, పరికరాలు, యన్త్రాలు మొదలైనవాటిని నిర్మించటం.

శైలకర్మలు:-

రాళ్లను పగల్చటం, మలచటం, మెరుగుపెట్టటం, విగ్రహాలు మొదలైన శిల్పాలను నిర్మించటం.

గంధకర్మలు:-

అంగరాగాలు, ముఖరాగాలు మొదలైనవాటిని, తలనూనెలను చేయటం, అత్తరు, పన్నీరు, మొదలైన సుగంధ ద్రవ్యాలను చేయటం, పూలచండలు, చెండ్లు మొదలైనవాటిని చేయటం.

ధాతు కర్మలు:-

దంతాలు, కొమ్ములతో చేసే పనులు, గాజులు, పూసలు, బొమ్మలు, పెట్టెలు, దువ్వెనలు మొదలైనవాటిని చేయటం.

రంజనకర్మలు:-

గుడ్డలకు రంగులు వేయటం, అద్దకంపనులు మొదలైనవి.

స్వర్ణకర్మలు:-

బంగారం, వెండి మొదలైనవాటితో నగలు చేయటం.

ఇంకా పాకకర్మలు, చర్మకర్మలు కూడా కలవు.

ఇట్లెన్నో పరిశ్రమలు శాఖోపశాఖలుగా ఉండేవి. అవన్నీ అట్లుండగా వడుకుట నేయుట సార్వత్రికం, సామాన్యమూ అయిన పరిశ్రమగా ఉండేది. రజకి మొదలు రాజ్ఞిదాక రాట్నము త్రిప్పుతూ ఉండిరి. కదురుకవ్వము లాడని గడప లేకుండేది. సున్నితాలై సుమాళాలై మంచుతెరల దలపించేవి. మనదేశపు రవసెల్లాలు. వాటికోసం విదేశీయు లెంతో మక్కువ పడుతూనూ ఉండేవారు. విదేశీయఐతిహాసికులు టోలమి, పెరిప్లసులు వీటిని ప్రస్తుతిస్తూ, ఉల్లేఖించేవారు.

ఈ తీరుతీరు పరిశ్రమలన్నీ కుటుంబపుటావరణలలో నడచినవే. ఎవరి ఇంటిలో వారే తమపరిశ్రమను సాగిస్తూ ఉంటారు. ఆపరిశ్రమకు పారిశ్రామికులు ఆకుటుంబంవారే. శ్రామికులుకూడ వారే. ఆ పరిశ్రమ పాలనపోషణలు వారి బాధ్యతే. ఇన్ని గంటలు పనిచేయవలె, ఇంత సరుకును ఉత్పత్తి చేయవలె, ఇంతపని కింత మజూరి అనే నియమాలు, నిబంధనల బాదరబందీలేదు. ఎవరికి, ఎప్పుడు ఉల్లాస ముంటే, ఆసక్తి కలిగితే, అప్పుడల్లా పనిచేస్తారు. లేనప్పుడు విశ్రాంతి తీసుకుంటారు. రసబ్రహ్మ సాక్షాత్కారము లేకపోతే కళాసిద్ధి ఉండదు. ఆసాక్షాత్కారం రమ్మంటే వచ్చేదికాదు. ఆంతరిక మనఃస్థితి ప్రసన్నమై భావముతో పాడినప్పుడే అది సిద్ధిస్తుంది. అప్పు డప్రయత్నంగానే కళోపాసకుడు శిల్పరచనములో తన్మయుడై పోతాడు. అయితే అందరూ అన్ని వస్తువులను ఇంతటి కళాసౌభాగ్యంతో నిర్మిస్తారని కాదు. మొత్తాన భారతీయ వస్తునిర్మాణంలో ఏపాటిగా అయినా కళాపుష్టి ఉండనే ఉంటుంది. సామాన్య సరళిలో నిర్మించబడిన వస్తువులు బజారులో సాధారణంగానే అమ్ముడుపోతూ ఉంటవి. రసోపాసకులు కళాసౌభాగ్యంతో నిర్మించిన వస్తువులకు వెల నిర్ణయమంటూ ఉండదు. రసపిపాసువులే అట్టివాటిని కొనేవారు. అట్టివారు మూల్యమునుగూర్చి బేరాలాడరు. ప్రేమకు వెలలూ, బేరాలా? శిల్పికౌశలము ఆశిల్పపు మనోజ్ఞత. అన్నిటికీ మించిన ఆశిల్పి కళాతపస్సునకు విలువకట్టుట కారసికులే తగుదురు. ఆశిల్పి ఉల్లసించే టంతగా మూల్య మిస్తారు. అయితేఅది మూల్యంగా శిల్పి తలచడు. రసికులూ అనుకోరు. కళాదేవతకు పూజా పుష్పంగా భావిస్తారు.

తాముగా వస్తువుల నిర్మించి విపణుల కెక్కించే యాతీరేమో తెలిసినది. మరొకటి ఆయావ్యక్తులు తమకు కావలసియున్న వస్తువులను నిర్మించుటకు

ఆయా పరిశ్రమలుచేయు వ్యక్తులను నియోగించుట. ఆసందర్భాలలోనూ నిర్మాతలు వస్తువులను తమ తమ ఇండ్లలోనే నిర్మిస్తారు.

ఆయా పరిశ్రమలలో ప్రాథమిక విషయాలను ఆయాకుటుంబాల స్త్రీలూ పిల్లలూ కూడ తిరిగి ఉంటారు. కనుక ఆ పరిశ్రమలో స్త్రీలు పిల్లలు కూడ సహాయం చేస్తూ ఉంటారు. అందువల్ల సామాన్యంగా కూలిగొడవ ఉండదు. పిల్లలాపరిశ్రమలో శిక్షణపొందుటా ఔతుంది. ఆవస్తువుకు కళాసౌష్ఠవం కలిగేలాగు పై మెరుగులు కృత హస్తులు (చేయి తీరిన శిల్పులు) దిద్దుతారు. కాని దానికి ముందుగా తీర్చిదిద్దవలసిన ముడిమూర్తులను చేసేవారు అభ్యాసకులే అనుట గుర్తింపదగును.

ఇవిగాక ప్రత్యేకం పరిశ్రమలుగా పరిగణింపబడని పరిశ్రమలూ చాలా ఉన్నవి. అవన్నీ సామాన్యంగా ఇంటి అక్కరల కోసం అయినవే. ధాన్యం దంపుట, పప్పులు, పిండ్లుచేయుట, విస్తరలు కుట్టుట అప్పడాలు వడియాలు చేయుట ఈ మొదలైన వెన్నో ఉన్నవి. ఈతీరున ప్రతి కుటుంబమూ ఏదో విధంగా పరిశ్రమకు నెలవై ఉండేది ఈదేశం నుండి అనేక వస్తువులు దేశదేశాలకు ఎగుమతి ఔతుండేవి. ఆ వస్తు సంచయమంతా కుటుంబ పరిశ్రమలలో నిర్మింపబడినదే.

ఇట్లు కుటుంబ పరిశ్రమాలయాలలో ఉత్పత్తి అయ్యే ఆయావస్తువులను దేనికి ఏచోట హెచ్చు మూల్యం లభిస్తుందో గుర్తించి ఆయావిపణుల కాయా తరుణాలలో ఆయావస్తువుల నెక్కుమస్తూ మంచి ధరలు రాబట్టుతూ అట్లు సంపాదించిన మూల్యాలను, నిర్మాతలకు న్యాయంగా పంచుతూ వాణిజ్యసరళిలో వ్యవహరించేటందుకు సహకార సంఘాలు ఉండేవి ఈ సంఘాలు వృత్తుల ననుసరించి ఏర్పడేవి. అంటే ఏవృత్తిగలవారు ఆవృత్తి సంఘాన్ని నెలకొల్పుకొనేవారు ఆయాసంఘాలు ఆయాసంఘాల సభ్యులకు వృత్తిసాగించుకొనుటకు అప్పులు ఇచ్చేవి. ఇట్టి సంఘాలు, వాటి వ్యాపారాలను గూర్చి జాతక కథలలో ఎన్నో ప్రసంగాలున్నవి. ఈ సంఘాల విషయం స్మృతులలోనూ ఉన్నది. వేరువేరు వృత్తుల సంఘాలు పేర్కొనబడినవి. వాటి సభ్యులకు ఉండవలసిన

అర్హతలు, భాగస్వామ్యములు, సంఘాల విధులు మొదలైన నియమాలు నిబంధనలు చెప్పబడినవి. కళాకారుల సంఘంలో ఈ క్రింది తరగతులవారుండేవారు.

1 శిష్యులు:– ఉమేజువారి చేసేవారు (Apprentice)

2 అభిజ్ఞులు :– పనితీరుపై కళామర్మములు ఎరిగినవారు

3 కుశలులు:- ఆయా కళలలో విశిష్టజ్ఞానం గడించిన వారు. (Experts).

4 ఆచార్యులు :– ఆయావృత్తులలో క్రొత్తరకాలు క్రొత్త ఆవిష్కారాలు కల్పించే వారు ఉంటారట కళాభివృద్ధి కోసం వారెంత కనిపెట్టియుండేవారో దీనిని బట్టి ఊహించండి.

ఈసంఘాలు వస్తువులను సుదూర దేశాలకు కొనిపోయి విక్రయిస్తూ ఉండేవి. అందువల్ల వస్తువులకు బాగా ధర పలుకుతూ ఉండేది. ఈదేశాననే గాక, సముద్రాలదాటి దేశదేశాలకూ కొనిపోయి విక్రయిస్తూ ఉండేవారు. మన దేశం విదేశాలతో క్రీ. పూ. 3000 సం॥ నాటి నుండి వాణిజ్యం చేస్తూ వున్న నిదర్శన లున్నవి. బవేరు (బాబిలోన్), యవన, రోమక, ఈజిప్టు, చీనా, టిబెట్, బర్మా (బ్రహ్మ), అస్సీరియా, బలి, సువర్ణ మొదలైన దేశాలతో వాణిజ్యం ధారాళంగా సాగుతూ వుండేది.

ఈ సంఘాలు మిగుల జనరంజకాలుగానూ ఉండేవి. ప్రజలు వాటిని అమితంగా విశ్వసిస్తూ వుండేవారు. హీనవృత్తుల వారికీ ఇట్టి సంఘాలు ఉండేవి. ఆ సంఘాలు ఇతర సంఘాలంత న్యాయంగాను, విశ్వాస పాత్రంగానూ వ్యవహరిస్తూ ఇతర సంఘాలంతటి గౌరవమూ, ప్రతిపత్తి గలిగి వుండేవి.

దాతలు వారువారు చేసే ధర్మకార్యాలను నిర్వహించే బాధ్యతలను ఈసంఘాలకు అప్పగిస్తూ ఉండేవారు. ఇంకా దాతలు తాము చేసే ఆయాధర్మకార్యాలు నిర్వహించేందుకు కావలసిన మూలనిధులను ఈ సంఘాలలో నిలువ చేస్తుండేవారు. ఇట్లు దాన ధర్మాలను పాలిస్తూ ఉండటం, నిధులను రక్షిస్తూ ఉండటం. హీనవృత్తుల సంఘాలకు అప్పగిస్తూ వుండేవారు. బౌద్ధ భిక్షుకులకు

దుష్పటులిస్తూ ఉండుటకు గోవర్ధనంలో సాలీల సంఘంపరంగా రెండువేల కార్షాపణాలను ఉషవదాత వుంచినాడు.[1] తిరశ్మిగుహాలలో భిక్షుకులు జబ్బు పడితే వారి చికిత్సకోసం సర్వదా ధర్మం నడుపుతూ వుండుటకు గోవర్ధనపు కులాల సంఘం పరంగా 1000 కార్షాపణాలు, ఉదయన్త్రికుల (నీటియన్త్రాలను నిర్మించేవారి) సంఘపరంగా 2000 కార్షాపణాలు, నూనెగానుగలవారి సంఘ పరంగా 500 కార్షాపణాలు నిధులుగా ఉంచబడినవి.[2] ఇట్లే దేవాలయాలలో జ్యోతులకు నిత్యమూ నేయినడుపుతూ ఉండుటకు గొఱ్ఱెలను, ఆవులను గొల్లలకు దానాలిచ్చిన శాసనాలూ విరివిగా వున్నవి.

# ధర్మాసనం

రక్త సంబంధులైన వ్యక్తుల సముదాయం కుటుంబం. కుటుంబానికి ప్రతిష్ఠగాని, అప్రతిష్ఠగాని ఆ కుటుంబపు వ్యక్తులవల్లనే వస్తుంది. వ్యక్తులకు పరపతి, ప్రతిపత్తులు ఆ కుటుంబపు గౌరవ మర్యాదలను బట్టే ఉంటవి. కుటుంబం, దాని వ్యక్తుల ప్రతిపత్తులు ఈతీరుగా పరస్పరాశ్రయములు: అవినాభావసంబద్ధములు. అందువల్ల వ్యక్తుల శీల చరిత్ర శుద్ధుల విషయాలలో వారెంతో పరాకాష్ఠులై ఉండేవారు. వారికి విత్తం కంటే వృత్తమే (శీలం) మిగుల విలువగలది.[3] కాన కుటుంబంలో పరస్పరం వృత్తరక్షను ఒక కంట కనిపెట్టుతూ మెలగేవారు. కుటుంబంలో ఎవరైనా ఏదో వికారానికి పాల్పడ్డారా ఆజాడ లప్పుడే కుటుంబంలో ఎవరో ఒకరు పసిగట్టకపోరు. అనవరతం సన్నిహితులై మసలుతూ ఉండేవారి కళ్లు గప్పి యెందాక మిడుకగలరు?

1 EP. Ind. Vol III P. 82.

2 నాసిక శాసనాలు No. 15 ibid. P. 89

3 విత్తహీనుండు వెండియు వివిధ విధుల
విత్తవంతుఁడు గానేర్చు వృత్తహీనుఁ
డైనవాఁడు విహీనుండ-యండ్రు గాన
విత్తరక్షకుఁ గడుమేలు వృత్తరక్ష. భార-అర.—4-129

అంతట ఆదోషాన్ని పొడగట్టిన వారే ఆదుడుకుదనానికి దిగుతున్న వానిని ఏకాంతాన సమీపించి, అతనికి హితం చెప్తారు; అదీ మరొక చెవిని బడకుండానే అప్పటికీ దారికి రాడా దోషికి సన్నిహితులు సహచరులు అయిన బంధువుల కది వినిపిస్తారు. వా రాదోషికి తగిన తీరుల హితాలు ఉపదేశిస్తారు. అతని కది రుచింపకపోతే కులవృద్ధులకు నివేదిస్తారు కులవృద్ధులు హితము బోధిస్తారు. మార్దవము లైన ఆహితబోధల తీరు వెనుకనే వివరించితిని.
(చూడుడు 'కుటుంబ సభ్యులు' శీర్షిక క్రింద)

ఈతీరు హితాలను పెడ చెవినిబెట్టి పెడసరంగా ఉంటే అతగాని దిక్కు చేర్చుటకు "ధర్మాసనం" (న్యాయసభ) ఉన్నది. ఈ ధర్మాసనం వేరెక్కడిదో కాదు; కుటుంబంలోదే. ఈ ధర్మాసనపు వృద్ధులు, చుట్టాలూ ఉంటారు. ఈలాంటి కుటుంబపు కొలగాములు గొడవలు సర్దుబాటు చేయటం బంధువుల బాధ్యతయట. తెగువతో అట్టి ధర్మం నిర్వహింపబూనని బంధువు[1] క్రూర కర్ముడు అని భారతం నిర్వచిస్తూ ఉన్నది.

కులపంచాయతులను గురించి వినియుంటారుగా! పాతిక శతాబ్దాల క్రిందటిదాక కూడ ఇవి కొంత చైతన్యం గలిగి ఉండేవి. నేటికిని మనం అనాగరికులనుకొనే గిరిజనులు మొదలైన తెగలలో ఇట్టి పంచాయతులున్నవి. అనాగరికులుగా మనము తలస్తూ ఉన్నవారే ఈ ఆర్ష సంప్రదాయమునకు అంటి పెట్టుకుని హాయిగా ఉన్నారు. కులీనతా, దురహంకారులూ, సభ్యతాదంభులే యీ సత్సంప్రదాయాన్ని తుడిచి పెట్టినారు. కోర్టులు పట్టుకొని ప్రాకులాడుటే సభ్యతాలక్షణమైనది. కుటుంబంలోని వారికి ఒకరి కొకరితో కలిగే పొరుపులను, వివాదాలనూ, కుటుంబంలోని వ్యక్తుల చెడునడతలనూ ఈ కుల ధర్మాసనాలు

---

1 చుట్టములలోన నొప్పమి పుట్టినప్పు
డడ్డపడి వారితోడఁ బోరాడియైనఁ
బూని యుడుపంగఁ జాలకున్నవానిఁ గ్రూర
కర్ముఁ డని చెప్పుదురు కర్మకాండవిదులు.
భా-ఉద్యో-ఆ 3, ప-242

విచారించి సమరస పరచేవి, తీరుపులు చెప్పేవి. అవసరమైతే ఆ తీరుపులను ప్రయోగించనూ (అమలుపరచనూ) ప్రయోగించే వారు.

ఈ కుల ధర్మాసనాల విచారణలలో కోర్టులలోవలే విధాన క్రమాలూ క్రమభంగాలూ అనే పట్టింపులు రావు. సూత్రాలూ. లారిపోర్టుల తికమకలూ ఉండవు. అంతా సంప్రదాయాలు. లౌకికజ్ఞానం, సహనభావం, ధర్మదృష్టి మొదలైనవాటితో నడుస్తుంది. న్యాయం మట్టుకు చక్కగానే లభిస్తుంది.

కులపంచాయతు లంటే పొరబడవచ్చు. కుల మనేపదానికి నేడున్న అర్థం వేరు. ఒకే వృత్తిపరులైన కుటుంబాల సమూహాన్నంతటినీ కలిపి మొత్తాన్న ఒక కులమని నేడు వ్యవహరిస్తూ ఉన్నాము. ఇది గోత్రం కావచ్చు. నాడో. కులమంటే కుటుంబానికే చెల్లుబడి ఆనాడు స్థానికంగా నాలుగు తీరుల ధర్మాసనాలు (న్యాయ సభలు) ఉండేవి.[1] అవి జనరంజకాలుగానూ వ్యవహరిస్తూ ఉండేవి. వాటిలో కులసభ మొట్ట మొదటిది; ప్రాథమిక స్థాయిది. దానిపైన "శ్రేణి సభ" దానిపైన "గణసభ''. ఈ గణసభే గ్రామ పంచాయతీ కాదగును వీటిలో వరుసగా పైపై సభలకు ఒకదానిపై నింకొక దానికి విమర్శనాధికారం (అప్పీలు) ఉండేవి. ఈసభల తీరును వ్యవహారసముచ్చయం వివరిస్తూ ఉన్నది.[2] కుటుంబసభ కులమట. ఒకే వృత్తిమంతులైన వేరువేరు కులాల (కుటుంబాలు) వృద్ధులతో కూడినసభ శ్రేణి. స్థానికులుగా ఉండేవారై వేరువేరు వృత్తిమంతులై వేరువేరు కులాల (కుటుంబాల) వృద్ధులతో కూడినది పూగం.

---

1 కులాని శ్రేణయశ్చైవ గణాశ్చాధికృతో నృపః
ప్రతిష్ఠితా వ్యవహారాణాం గుర్వేభ్య స్తూత్తరోత్తరమ్॥
(నారద–I–7– )

2 కులాని జ్ఞాతి సంబంధి బంధూనాం సమూహః
నానా జాతీయానా మేకజాతీయం కర్మ కుర్వతాం సమూహః శ్రేణిః
తేషామేవ భిన్న జాతీయం కర్మ కుర్వతాం సమూహః పూగః॥
'వ్యవహారసముచ్చయమ్'

వెనుక చెప్పినట్టు దారికి రాక తంటాలుపెట్టుతూ ఉండే దుడుకువారి విషయమూ, కుటుంబంలో ఎవరైనా కీచులాడుతూ ఉంటే అట్టి తగవులూ, ఇతర రకాల పొరుపులూ, గృహచ్ఛిద్రాలు కులసభ(కుటుంబ ధర్మాసనాల) కెక్కేవి. కులవృద్ధు లీసభ సభ్యులు. వారికి విశ్వసనీయులైన బంధువులనూ వారికి సహాయులుగా తీసికొంటారు. ఈతగవులు తంపులలో సాధ్యమైనంత వరకు సామరస్యము కుదుర్చుదురు. అది పొసగనప్పుడు తాము దోషి అని నిశ్చయించిన వా డాదారికి వచ్చుటకు ఒత్తిడి కలిగిస్తారు. ఆ ఒత్తిడి కౌటుంబికము. కుటుంబములోని వారు ఆతనితో మాటాడటము మానివేయడముతో మొదలిడుతుంది ఆ ఒత్తిడి. క్రమక్రమంగా ఒక్కొక్క సహకారమే నిరాకరిస్తూ తుదకు అన్నితీరుల సహకారము నిరాకరిస్తారు. దండన చూచుటకు మెత్తగానే తోస్తుంది. కాని దాని తాకిడి తల్లడిల్ల జేస్తుంది. ఇంత జరిగినా ప్రేమ భావనకు కొదువ ఉండదు. దోషి తనతప్పు తెలిసికొని దారికి ఎప్పుడు వస్తే అప్పుడే సర్వమూ మంగళావహంగా ఔతుంది. అయితే దోషిదోషం తీవ్రతమమై సంఘానికో, గ్రామానికో, దేశానికో, అన్నిటికీమించి శాంతి ధర్మాలకో ద్రోహం చేసేదీ, ఉపద్రవం తెచ్చిపెట్టేదీ అయితే మట్టుకు సహింపరు; ఉపేక్షింపరు. కులబహిష్కారము (కులంనుండి వెలికి దరుముట) చేస్తారు. ఇది మిగుల దారుణం.

ఇట్లే ఆయావృత్తులకు సంబంధించి, ఆయా వృత్తిమంతులకుటుంబాల నడుమ కలిగే తగవులను శ్రేణులు. భిన్నవృత్తులకు సంబంధించి ఆయావృత్తిమంతుల కుటుంబాల నడుమ పొసగే తగవులను పూగాలు సరాసరిగా విచారించి దండించేవి. గ్రామానికి సంబంధించిన తగవులను గణసభ(గ్రామపంచాయతి) సరాసరిగా విచారించి దండించేది ఇంకా స్థానికంగా గణసభకు వీటన్నిటిపైనా విమర్శనాధికారమూ ఉన్నది. ఆయా దోషాల తీవ్రతను బట్టి వృత్తి బహిష్కారము, సంఘ బహిష్కారము, గ్రామ బహిష్కారము దండనలుగాను, విధించే వారు. కుల(కుటుంబ) సభలుగాని, శ్రేణులుగాని, పూగాలుగాని, గణాలుగాని న్యాయదానంలో నిపుణంగాను, నిర్దుష్టంగాను లోకజ్ఞానంతో నిశ్చయించేవి. హక్కులకోసమే ఆందోళనచేసేవిగా కాక బాధ్యతలను సమ

తూకాన తూచి వ్యవహరిస్తూ ఉండేవి. న్యాయాన్ని నిరూపించుటలో స్వపరపక్ష పాతాలుగాని మరేతీరు లౌక్యాలు, అభిమానాలు, వంచనలు గాని తొంగిచూచేవి కావు. ఆ ధర్మానురక్తికి మచ్చు గమనించండి. దుర్యోధనుడు కురు పాండవ యుద్ధ సన్నద్ధుడై పోతూ తల్లిని దర్శించి వినతుడై పాదాభివందనం చేసి, అనుజ్ఞనర్థిస్తూ "అమ్మా విజయీభవ" అని "నన్ను దీవించి పంపు", మంటాడు.[1] ఆసాధ్వియో కన్న కడుపు తీపునకు లొంగలేదు. "నాయనా! యతోధర్మ స్తతో జయః", ధర్మమెక్కడుంటే జయమక్కడికే అబ్బుతుంది అని దీవించినది.

ఈ న్యాయనిష్ఠ యెంత ఉదాత్త స్థాయి నందుకొన్నదంటే—ప్రమాదాన ఏదైన దొసగు పొసగినా తానుగా తన దోషాన్ని వెల్లడించి దానికి తగిన దండన గోరుకొనుదాక. బలీయాలు, కర్మవిశ్వాసం, పాపభీతి, ధర్మనిరతి. అవీ వారల నింత ఉన్నత పథాన నడిపినవి. ఆ న్యాయ నియతిని గూర్చినవి వినండి. శంఖువు లిఖితుడు అన్నదమ్ములు; ఋషి కుమారులు. ఒకనాడు లిఖితు డొక మామిడి తోటకు పోయి జిహ్వా చాపల్య మాపుకోలేక ఒక పండును కోసి తింటాడు. కాని ఆ కార్యపు గుబులు మనసులో గుచ్చుకొంటూనే వున్న దతనికి. అంతట అన్న శంఖువున కీవిషయము చెప్పినాడు.

"నీవు తప్పు చేసినావు. వెంటనేనీ చేసిన తప్పును ధర్మాధికారి కెరిగించి దండింపగోరుకో" అని అంటాడు శంఖువు. లిఖితు డట్లే చేస్తాడు. శిక్షాస్మృతి ననుసరించి ధర్మాధికారి లిఖితుని చేతులు నరికిస్తాడు. అటు ధర్మాధికారీ ఇటు దోషీకూడ తమతమ ధర్మాలను నిర్లిప్తతో పాలించినారు.

---

1 గెలుపుమని నన్ను దీవింపవలయుఁ దల్లి
యనుచు గాంధారికిని మ్రొక్కి వినతుఁడైన
నెచ్చటను ధర్మ ముండు దా నచ్చటికిని
జయమగు నటంచు నప్పు డాసాధ్వి యనియె.

భార—ఉద్యోగ—ఆ-4. ప. 163.

బెజవాడ పాలకుడు మాధవవర్మ న్యాయైక నిరతుడు.[1] ఏవేళనేగాని ఎవరేగాని యేదేని విన్నవించుకొనవచ్చినా చెవి యిచ్చేవాడు. వారివారి అభ్యర్థనలు అభియోగాలు విని న్యాయం వివేచించి తీరుపు లిచ్చేవాడు. అర్థుల రాక తనకు తెలుపుట కొరకు గంటను ఉంచినాడు దానికి ఒక గొలుసును కట్టి ఆగొలుసు రెండవ కొసను హజారాన వ్రేలవిడిచినారు. అర్థులు హజారాలోని గొలుసు కొనను లాగితే లోపల గంట మ్రోగుతుంది. అది విని రాజు సభా మందిరానికి వచ్చి వారివారి విన్నపాలను వింటూ ఉండేవారు. ఒకనాడు ఒక ఆవు ఆగొలుసును లాగినది. రాజు సభాంగణమునకు వచ్చెను. ఆ ఆవు అరుస్తూ వీథివైపునకు రాజువైపునకు పరుగులువారుతూ మోర చాచి యేదో దైన్య మొలకబోస్తూ ఉండెను. రాజు దానివెంట సాగగా వీథిలో ఒక చోట చచ్చి పడి వున్న ఆవు దూడ కన్పించినది దానిని పరిశీలింపగా రథపు త్రోవలు కనబడ్డవి. ఇంకా విచారించగా ఆ రథం రాకుమారునిదే అని తేలినది. అంతట రాజు ధర్మాసనం నెరపినాడు. రాకుమారునిపైన అభియోగం. రాకుమారుడు అభియుక్తుడు (ముద్దాయి)గా ధర్మాసనం ముందున్నాడు. విచారణ జరిగినది. రాజకుమారుడు దోషియని రాజు నిశ్చయించినాడు. శిక్షాస్మృతి ననుసరించి రాజు మరణదండన విధించినాడు. ఆ ధర్మాసనమం దున్నంతసేపూ రాజు పుత్రప్రేమ చూపించలేదు.

శివాజీని దిద్దిన వాడు దాదాజీ కొండదేవు; గౌరవ పాత్రుడు. ఒకనాడు ఆ తాత జిహ్వా చాపల్యము చేత ఒక తోటలో మామిడి పండు నొక దానిని

---

1 ఈమాధవవర్మ పల్లవరాజు. ఈకథలో అభియుక్త (ఫిర్యాది) 'బిక్షుకి'యని కొందరు'ఆవు'అని కొందరు చెప్పుతారు. చిత్రాలలో ఆవున్నది. శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు బిక్షుకి అనే కథనే గ్రహించినారు. రాజపుత్రుడు తన రథాన్ని బిక్షుకుని కుమారునిపై పోనీయగా ఆమె గొలుసులాగి రాజుని పిలిచి తనగోడు చెప్పుకుంటుంది. రాజు అభియోగాన్ని విచారించి దోషియైన రాకుమారుని దండిస్తాడు. లేపాక్షి దేవాలయపు చిత్రాలలో అభియుక్త ఆవుగా చిత్రింపబడినది. అందులో రథము ఆవు దూడ మీదుగా పోతుంది. మిగిలిన కథ సమమే.

కోసి తిన్నాడు. కానీ, తన అపరాధం వెంటనే గుర్తుకు వచ్చినది. పరితపించి నాడు. దోషమునకు తగిన దండన పొంద దలచినాడు. వెంటనే శివాజీని సమీపించినాడు. తన అపరాధమును చెప్పి దానికి తగినట్లు దండింపుమని కోరినాడు. శిక్షాస్మృతి చేతిని నరుకు మంటున్నదని దండన ప్రమాణమును తానే తెలిపినాడు. శివాజీ అందు కిచ్చగింపలేదు. తుదకు తనకు తానే వింత దండన విధించు కున్నాడు. ఆ దండనకు (చేయి నరుకుటకు) గుర్తుగా, అప్పటినుండి తన అంగరఖా చేతిని చింపివేసి తొడుగుకో దొడగినాడు. నాటి నుండి జీవితాంతమూ ఒక చేయిలేని అంగరఖానే తొడుగుకుంటూ ఉండే వాడట.

## యజ్ఞశాల

యజ్ఞ మంటే శ్రౌతకర్మలేనని మీమాంసకులు నిర్వచించినారు. ఈ శ్రౌత కర్మలైన పంచయజ్ఞాలు భూతసేవకు సముద్దిష్టములైనవే. వాటిని గురించి ఇదివరకే కొంత తెలిపితిని. అనుబంధంలో మరింతగా చూపెదను.

ఇఁక యజ్ఞ[1] మనే దానికి గీత వ్యాపకమైన అర్థమునే తెలుపుతూఉన్నది. ఆతీరు చూస్తే విశ్వమంతా యజ్ఞచక్రము. ఆయజ్ఞ చక్రము ననుసరించే విశ్వ మంతా నడుస్తున్న దనవచ్చును. జీవికి నిత్యాహారమునకు ఆవశ్యకమైన వస్తువు మొదలుకొని బ్రహ్మదాక దీనికి (యజ్ఞ చక్రంకు) వెలిగాలేవు. విశ్వా నికి త్యాగం సహజధర్మమే అనవచ్చు. కాస్త గమనించండి. భూమిలో కొన్ని రాసాయనిక ద్రవ్యాలూ లోహాలూ ఉన్నవే గదా! నేల సస్యాలకు ఆహారంగా ఆద్రవ్యాలను అందిస్తున్నది. సస్యాలు ఆద్రవ్యాలను గ్రహించి పెంపొందగా పంటలు పండుతూ ఉన్నవి. ఆ ఫలసాయాలలో ధాన్యాదులు మానవులకు, పశువులకు, కీటకములు మొదలైన వాటికి ఆహారాలవుతూ వున్నవి. సస్యములు

---

1 యజ్ఞాలను గురించి "గీతామృత" (గీతలకు నేననువదించిన పద్యాలు) ప్రజ్ఞాపనములలో "యజ్ఞము" అన్నశీర్షికలో మరికొంత వివేచించితిని.

చెట్లు మొదలైనవి రాల్చిన ఆకు అలం, పశువుల త్రొక్కడిలో మిగిలే చెత్తా చెదారం (సస్యావశేషాలు), సస్యాల పొల్లు పొలుసు నేలలో చేరుతూ వున్నవి. సూక్ష్మజీవులు ఈ ద్రవ్యాలను తినుటలో విశీర్ణింపగా ఆ ద్రవ్యాలు చివికి మరల సస్యాహారంగా సిద్ధమౌతూ వున్నవి. సస్యఫలాన్ని ఆహారంగా గొని జీవకోటి పెంపొందుతూ వున్నది. కాగా మానవులూ, పశువులు మొద లైన జీవులూ విసర్జించే మలమూత్రాలు భూమిలో చేరుతూ వున్నవి. అట్లే పశువులపెంట, పక్షులపెంటలు, ఇతర జీవుల కళేబరాలు, కంకాళాలూ నేలలో చేరుతూ ఉన్నవి. వీటిని సూక్ష్మజీవులు ఆహరించుటలో ఇవి చదువైలై చివికి సస్యాహారాలుగా పరిణమించి మరల సస్యాల పెంపొందించుట కౌతూ వున్నవి.

వాయుభూతం అనవరతమూ జీవులకు ప్రాణ (ప్రాణవాయు) దానం చేస్తూనే వుంటుంది. ప్రాణులు తమ నుండి నిశ్వాస వాయువును (కర్బన వాయువును) తిరిగి ఇస్తూ వుంటవి. అది సస్యాలకు ఉపయోగమౌతూ వుంటుంది. సస్యాలకు ఉపయోగిస్తుంది. సస్యాలు అందలి కర్బనమును గ్రహించు కొనగా ఆ వాయువు ప్రాణవాయువుగా పరిణమిస్తుంది. అట్లు పరిణమించిన ప్రాణవాయువును సస్యాలు మరల ఇస్తున్నవి.

సూర్యుడు తన తేజశ్శక్తిని ప్రసారిస్తూనే వుంటాడు. ఆ దివ్యశక్తి ఓషధులలోను, జీవులలోనూ అనేక పరిణామాలను వెలయిస్తూ వున్నది. ఇదంతా ప్రకృతి సహజసిద్ధమూ, పరాశక్తిప్రేతమూ అయిన త్యాగ ధర్మం. ఈ యావులలో ఫలాకాంక్ష లేదు. ఒకరితో మరొకరు బేరాలాడుట కాదు. నేను ఈ మహాకార్యాన్ని నిర్వహిస్తూ ఉన్నవాడను అనే అహంకారపు టాలోచనా సంవేదనా ఉండవు. అవన్నీ తమతమ సహజకర్మలుగా సాగిపోతూ వున్నవి. అయితే చివరికి పరస్పరమూ లాభిస్తుంది. ఆ లాభపు తీరూ స్వచ్ఛమే. ఒకరి లాభ మింకొకరికి వెగటు కాదు.

ఈతీరు త్యాగధర్మమే సమాజ సుఖస్థితికి కావలె. అదే లోకసేవ. వ్యక్తి సమాజంలో ఒకడు. కాన సమాజపు సమష్టి హితంలో వ్యక్తిహితమూ

ఆర్షకుటుంబము

ఇమిడే వున్నది. కానీ త్యాగం చేయుటలో ఆ వ్యక్తి భావంగాని, అహంకారము గానీ ఉండవు. తన వ్యక్తిత్వాన్ని విస్మరిస్తూ, ఇట్టి త్యాగధర్మాన్ని అత్యుచ్చ స్థాయి నొందించినారు. సమాజంలో దానికి పూజ్యత, పుష్టి ఉండేవి. సమాజపు సౌకర్యాలను, అక్కరలను, అన్నిటిని ఈ త్యాగారాధనతో సాధించారు. అందువల్ల దేశమే కొఱతా లేక సుందరంగాను, సౌష్ఠవంగానూ, సుఖావాసంగానూ ఉంటుంది. ఈ తీరు దానధర్మా లెన్నో ఉన్నవి. అట్టి శాసనా లనేకం. వేదాలు, గణితం జ్యోతిషం వ్యాకరణం మొదలైన శాస్త్రాలు, నృత్యం గీతం శిల్పం చిత్రం మొదలైన కళలు శిక్షించు విద్యాలయాలను, విద్యాపీఠాలనూ నెలయించిరి వాటివాటి పాలన పోషణల వసతులనూ ఏర్పరిచిరి. జలాశయాలు, సేతువులు (ఆనకట్టలు), పంట కాలువలు, నిర్మించి, కేదారములు నదీ మాతృకాలుగా చేసి, దేశాన్ని సస్యశ్యామల లక్ష్మికి విహార భూమిగా రూపొందించిరి. ఈ జలాశయాలు వాటి నీటితో నేలల తడుపు పథకాలు, కార్యాలు వైదిక కాలానికే కనుపిస్తున్నవి. అట్టి పథకాలు నిర్వహించినవాడు అగస్త్యుడనవచ్చును. అగస్త్యుని కథలు చూస్తే ఏవేవో వాస్తు (Engineering) నిర్మాణాలుగా తోస్తవి.[1] అగస్త్యుడు సంపద సంతానము, కోరి ఖనిత్రాలతో (తవ్వ సాధనాలతో) త్రవ్వి రెండు వర్ణాల వారిని పోషించినాడట, అని ఋగ్వేదం చెబుతున్నది. అగస్త్యుడు సముద్రోదకం త్రాగిన కథ దానితో జతచేసి, సగరులకథ భగీరథుని కథలు పరిశీలిస్తే ఏదో మహత్తరమైన జలవాస్తు పథకం (Project) నిర్వహించుటగా తోస్తుంది. ఏదో అగ్ని పర్వతపు తాపు తగిలి నైసర్గికంగా మార్పులు రాగా పెద్ద నీటి పడక (ముంపు) ఏర్పడినట్లున్నది. దానిని అగస్త్యుడు ఇంకించి ఉంటాడు. కాని అట్లు నీరు వడిసిపోయి తేలిన నేల సస్యానుకూలంగా ఉన్నట్టు లేదు. అది ఊసర క్షేత్రంగా అయినట్లున్నది. కాగా మంచినీటిని దానిపై పారించి దానిని సుక్షేత్రంగా చేయుటకు తొలుత సగరుని

---

1 అగస్త్యః ఖనమానః ఖనిత్రైః ప్రజా మపత్యం బలమిచ్ఛమానః
ఉభౌ వర్ణా వృషిరుగ్రః పుపోష సత్యా దేవేష్వాశిషో జగామ॥

ఋ—1—179-6.

అన్నకుటుంబము

కుమారులు సంకల్పించి యత్నించి విఫలులైరి. కానీ భగీరథునిదాకా అప్రియత్నాలు, పథకాలు సాగుతూనే ఉన్నవి. చివరికి భగీరథుడీ కార్యంలో కృతార్థుడైనాడనవలెను.

ఈ జలాశయాలు, కుల్యలు, సేతుబంధనములు (ఆనకట్టలు), ఈ దేశాన ఏకాలానా ఏమరలేదు. పెద్దపెద్ద నిర్మాణాల (Projects) ను ప్రభుత్వాలు నిర్వహించేవి. చిన్న వాటిని ధర్మ సంస్థలే నిర్వహించేవి. ఇట్టి నిర్మాణాలు కొన్నిటిని దాతలు నిర్మించే వారు. వాటి పాలన పోషణలకు వారు దానాలు ఇచ్చేవారు. మోటబావుల వంటి మరీ చిన్న నిర్మాణాలను ఆయా కుటుంబాలే నిర్మించుకొనేవారు. ఊరూర ఏదో తీరు జలసేచన సౌకర్యం లేకుండ ఉండేది కాదు. పల్లెల పసదప్పు దాక యీ విధానము దేశములో సాగుతూనే వుండేది.

ఇట్టి జలాశయాల నిర్మించగల పరిజ్ఞానం గల శిల్పులు ఆనాడెందరో ఉండిరి. నిమ్నోన్నతాలతో నిండారి చూపు చౌర వీలుగాని కొండల నుండి కూడా నీటి వాటాలను గుర్తింప గలిగిన ఆస్థపతుల ప్రజ్ఞ ప్రస్తుతింప దగును గదా! ఆనాడు ఆవాటాల గుర్తించుటకు వారేసాధనాలను ఉపయోగించినారో! ఇట్టి స్థపతుల ప్రస్తావన మనుస్మృతిలోనూ కనుపిస్తున్నది. (మను. 1.64)

ఈ నిర్మాణాల పాలన పోషణలకు సుస్థైన ఏర్పాటులు చేసిరి. ముఖ్యంగా చెఱువుల పరిరక్షణం. వాటిని ఏమాత్రము ఉపేక్షించే వారు కారు. వాటిలో మేట (పేరిన ఒండు)ను తీసి వేయుట ముఖ్యసమస్య అగుదాక ఉంచే వారు కారు. ఏయేటి కాయేడే యీమేటను తీసి వేస్తూ ఉండుటకు నికరంగా ఏర్పాటు చేసే వారు. ఏటేటా ఈ పనిని నిర్వహిస్తూ ఉండేటందుకు త్రవ్వుడు పని వాండ్రనూ, త్రవ్విన ఆపూడిక మట్టిని నింపికొని వచ్చి వెలితట్టున పోయుటకు పడవలనూ, ఆపడవల నడుపు వారినీ నియోగించే వారు. ఈ కార్యాలు నిర్వహిస్తూ ఉండుటకు నియోగింపబడిన ఆయా పనులవారి జీవికకుగాను భూదానాలిచ్చి స్థిరమైన వసతు లేర్పరిచే వారు. ఆదానాలను పాలించుటకు కూడా తగిన

ఆర్షకుటుంబము

ఏర్పాట్లు చేసేవారు. ఎంత చక్కని యేర్పాటు? చెంగల్పట్టు జిల్లా ఉత్తర మెరూర్‌లోని "వైరమేగ తటాకం" గురించిన దాన శాసనము[1] ముఖ్యంగా గమనింపదగినది. రథ్యలు (రోడ్లు) నిర్మించుటకు, వాటి ప్రక్కల చెట్లను నాటుటకు ఇచ్చిన దాన శాసనా లున్నవి. తోపులు, బావులు, కోనేరులు, మంచి నీటి బావులు, పోథులు (నీటి కుండ్లు) నిర్మించుటకు ఇచ్చిన దాన శాసనా లున్నవి. అవి అనేకము. చలిపేంద్రలు అన్న సత్రాలు నడుపుతూ ఉండుటకు, బీదలకు భిక్షుకులకు వస్త్రా లిస్తూఉండుటకు దానా లిచ్చిరి. యతులు శ్రమణకులు మొదలైన వారికి గుహలు, ఆరామాలు, మఠాలు దానా లిచ్చిరి. దేవాలయాలు గ్రంథాలయాలు నిర్మించిరి. వాటి పాలన పోషణలకు వసతులు గలిగించిరి. దేవాలయసంస్థ నాడు ప్రజాజీవితానికి కేంద్రమై సర్వతో ముఖంగా హితం కలిగిస్తూ ఉండేది. ప్రజల సమావేశాలన్నీ తఱుచుగా దేవాలయాలలోనే జరుపబడుతూ ఉండేవి. ఈనాడు టౌన్ హాలు, పబ్లిక్ హాలు మొదలైనవాటి ప్రయోజనం నాడు అవి సమకూర్చేవి.

దేవాలయాలలో జ్యోతులు అఖండ దీపాలను వెలిగిస్తూ ఉండుట కిచ్చిన దానా లున్నవి. చీకటి రాత్రిలలో వీథులలో తిరుగాడే వారికి వెలుగుకోసమూ, రాత్రులుపయనించే బాటసారులకు దిక్కులు తెలియుటకూ ఈ జ్యోతులు ఉపయోగించేవి. ఇంకా కీటకాలు మిడుతలు మొదలైనవి (సస్యాలకు హానిచేసే క్రిమి కీటకాదులు) ఈ జ్యోతులపై ముసరి నశిస్తవి. కాలాన్ని తెలుపుటకు ఘటీయంత్రాలను నడుపుతూ[2] ఉండేటందుకు దానా లిచ్చిరి. ఈ ధూపాలు దేవుని సన్నిధిలో సాంబ్రాణితోనూ, అగరు వత్తులతోనూ వేసే సంస్కార మాత్రపు ధూపం కాదు; వీథులను, వాడలను దట్టంగా మూగే టంతటిది. దీని ప్రయోజనం శౌచం. కొన్ని రకాలసూక్ష్మజీవులు దీనిచే నశిస్తవి. ఈ ధూప (Fumigation) విధానం నేటి వైజ్ఞానికుల కీటీవలే మనసు కెక్కుతున్నది.

---

1 Archeological survey report of Sri Venkayya 1903-4 (ibid– P-204)

2 అల్బెరూని–పరిచ్ఛేదం-34.

ఆతురాలయాలను. ప్రసవ శాలలను స్థాపించిరి. వాటి పాలనాదకములకూ ఏర్పాట్లు చేసిరి. ఆతురులకు అన్నపానాదులు జరుగుతూ ఉండుటకు వసతులు కల్పించిరి. పశువులకు ఆతురాలయాలలో మేతకు వసతులు ఏర్పరచిరి.

ఒక గ్రామపు సుఖస్థితికి కావలసిన సకల సౌకర్యాలకూ వసతులు కల్పిస్తూ ఇచ్చిన దానాలు ఉన్నవి. అట్టి దాన శాసన మొకటి గుంటూరు జిల్లా మందడం గ్రామంలో ఉన్నది [1]. ఈదానాలతో అచట నిర్వహింపబడిన సంస్థలు ఆ శాసనంలో పేర్కొన బడినవి. అవి : దేవాలయం, మఠం, అన్నసత్రం, శైవాగమ విద్యాశాల, ఆతురాలయం, దానికి అనుబంధంగా ప్రసవశాలలు, సంస్థలు. ఆయాకార్యాలు నిర్వహించుచుండుటకు నిర్ణీతము లైన పదవు లున్నవి. అధ్యాపకులు ఎనిమిదిమంది. మూడు వేదాలకు ముగ్గురు; తర్కం, సాహిత్యం, ఆగమాలకు అయిదుగురు. ఆయుర్వేది ఒకరు. గణకుడు ఒకరు. మఠంలోను, అన్నసత్రంలోను పనులు చేసే బ్రాహ్మణులు అయిదుగురు. వీరభద్రులు (గ్రామ రక్షక భటులు—కావలివాండ్రు) ఇద్దరు. గ్రామవృత్తులవారు :- స్వర్ణకారుడు, కంచరి, కమ్మరి, పలగస్తుపు. (బేలుదారి—తాపీపనివాడు) వర్ధకుడు (వడ్రంగి), మేదరి, కుమ్మరి, శిల్పి. చిత్రకారులు.

అన్నసత్రంలో అన్ని వర్ణాల వారికి, మతాలవారికి, అన్నివేళలా భోజనము పెట్టెడివా రట. ఇట్లు ఆదర్శ గ్రామాలను వెలయించి నిర్వహిస్తూ ఉండిరి రసజ్ఞులు కావ్యాలను కృతులొంది సాహిత్యమును ప్రోత్సహిస్తూ ఉండిరి. కళలను, శిల్పములను ఆదరించి ఉత్తేజపరుస్తూ ఉండిరి.

ఒక నిర్దిష్టకార్యము [2] నుద్దేశించేగాక అనిర్దిష్టాలుగాభవిష్యత్తులో ఎప్పటికేది అవసరపడునో ఆయా కార్యాలకు వినియోగిస్తూ ఉండేటందుకు దానాలిచ్చేవారు. అట్టి శాసనాలూ ఉన్నవి. జలాశయాలు, రథ్యలు దేవాలయాలు మొదలైన జనరంజకపు నిర్మాణాలలో బీదలు శ్రమదానాలతో సహకరిస్తూ ఉండేవారు.

---

1 Madras Ep. Rep. 1917 P. 122 గుంటూరు జిల్లా, గుంటూరు తాలూకా మల్కాపురంలో దొరికిన శాసనం.

2 Local Govt. in Ancient India P. 145.

కఱవులు వస్తే గ్రామ సంఘాలు ఆదుకునేవి. ఆతీరు శాసనాలూ ఉన్నవి.[1] ఒక కఱవులో ఒక గ్రామం వ్యవహరించిన తీరు గమనింపదగినది.[2] ఆ గ్రామానికిగల సాముదాయక భూమిలో 8 3/4 వేలిల పొలంలో పండే పంటను ఆ ఊరి దేవాలయాలకు ఆయకంగా పెట్టి దేవాలయంలో ఉన్న బంగారము 1011 కలంజులు, వెండి 464 పలాలు అప్పుగా తీసికొన్నది. ఆధనంతో ఆ ఊళ్లో కఱవు నివారించుటకు కార్యాలను నిర్వహించి ఆపద గడువ బెట్టినది.

## కళావిలాసం

శుచి కంటే సొగ సేముంది? అందాల కన్నిటికీ అది తొలి చందం. శౌచమే సంస్కృతి అని మహాత్మా గాంధీజీ నిర్వచనం. ఆ శౌచం మన పూర్వుల ఇండ్ల నెలవుకొని ఉండేది. నిండు నిప్పచ్చరంలో నెమకు లాడుతూ ఉండే వారు కూడా తమ గుడిసెనే ఊడ్చి శుభ్రపరచకుండ అలుకకుండ, కళాపి చల్లకుండ, ముగ్గులు దిద్దకుండ ఉండరు. ఇంటిని పరిశుభ్రంగాను, చూడ ఇంపుగాను, ఉల్లాసంచేటట్లుగాను, నిత్యమూ దిద్దుట ప్రతిగేస్తురాలికి బాధ్యత అంటారు వాత్స్యాయనులు. భోజన శాలను గేస్తురాలు అలంకరించి ఉంచ వలెనట.[3]

---

1 కన్నకట్టి రికార్డులు 1910 సం॥ No. 274; 1912 సం. No. 241.

2 ముఖ్యంగా Madras. Ep. Rep. 1899–1900 P. 20
కులోత్తుంగ చోళ–III శాసనాలు సం॥ 1909 నెం. 274–79
చూడదగును.

3 కులకాంతచేతఁ దగు క్రియ ।
నలంకృతం బైన భోజనాగారములో
నెలమిఁ దమబంతిఁ జుట్టలుఁ ।
జెలులుం దమి భోజనంబు సేయఁగ వలయున్.
(మంత్రి అప్పన చారు చర్య)

ప్రతియింటా ఏపాటిదైన పుష్పవాటిక తప్పక ఉండేది. ఆయా కుటుంబాల కలిమిలేముల బట్టి వాటి అందచందాలలో తేడా ఉండవచ్చును. కాని మొత్తానికి అవి మనోజ్ఞములుగానే ఉండేవి కిరాతార్జునీయములో వర్ణింపబడిన పల్లెను చూడండి.

''గృహాంగణాలలో పెరుగబూచిన తీగె జొంపా లున్నవి. అవి ఆశ్రమాల మంటపాలను దలపు గొలుపుతూ ఉన్నవట. ఆ జానపదులు మచ్చలేని నడత, ఏకాగ్రత, ఇంగిత జ్ఞానము గలిగి ఉన్నారట[1] ఫెరిష్టా సుప్రసిద్ధుడైన ఐతిహాసికుడు. 14వ శతాబ్దిలో ఈ దేశమును దర్శించిన వాడు. ఆయన ఉల్లేఖించినాడు— "వారి యిండ్లు చక్కగా దిద్దబడి యున్నవి. ప్రతి యింటా స్త్రీల దగ్గర వెండి బంగారా లున్నవి. ప్రతివానికి సొగసైన ఆసనం, ఒక తోట ఆవశ్యకములైనవిగా ఉన్నవి.''

పండుగలకు వెల్లలు వేసి, రంగులు పెట్టి, శోభాయమానంగా అలంకరించు కొంటారు. నిప్పచ్చరం చప్పరిస్తూ ఉన్నా, పండుగకు ఇంటి గోడలు పూతబెట్టి వెల్ల వేయని వా రుండరు. ఇంకా జేగురు రంగు పట్టెలు, చిలుకలు మృగాలు మొదలైన వాటి చిత్రాలు ఆగోడలమీద చిత్రిస్తారు. కుటీరాలైతే వసులనైనా అలంకరిస్తారు. నవ నవ లాడే చిగురుటాకులతోరణాలు సర్వసామాన్యం. పండుగలో అనేకం: వింత వింత ఆకృతులుగా పొనగించి వెలిగించిన దీపమాలికలు రాత్రి లెంతో శోభాయమానంగా ఉంటవి. కాగా "నిత్య కళ్యాణం పచ్చతోరణం''గా ఉంటవి వారి యిండ్లు.

---

1 జనైరుప గ్రామ మనింద్య కర్మభి
ర్వివిక్త భావేంగిత భూషణై ర్వృతాః।
భృశం దద ర్శాశ్రమమంట పోపమా
స్సపుష్ప హాసా స్స నివేశ వీరుధః ॥
(కిరాతార్జునీయమ్—4-19)

ఆంధ్రకుటుంబము

ఇండ్ల చందం గమనించండి. శిల్పం చిందుతూ వుంటుంది సింహ ద్వారాలమీద. ఇతర ద్వార బంధాలు సొంపు నింపుతూనే వుంటవి. కళా శోభను పుక్కిలిస్తూ వుంటవి స్తంభాలు. కళాభగవతి కాణాచులు దూలాలు. జిలుగు పనితనాలకు ఆవాసాలు వాసాలు. హంసపాళి కపోతపాళి మొదలైన వాటి ఒయ్యారాలతో అందాల నొందిన గోడలు. తామరాకులు మొగ్గలు పూలతో పొందికగా తీగెముడులు వెలార్చిన తోరణాలు. ఈ శిల్పాలు చిత్రాలలో సామాన్యంగా దశావతారాలు లక్ష్మి సరస్వతి గణేశుడు సీతారాముల పట్టాభిషేకం (పంచాయతనం) కృష్ణలీలలు జాతకకథలు భక్తులకథలు మొదలైనవి వెల యింపబడుతూ వుంటవి. చిలుకలు హంసలు నెమళ్లు లేళ్లు ఏనుగులు సింహాలు జలచరాలు మొదలైన వాటిని, పద్మాలు లతలు పాదపాలు మొదలైన వాటిని చిత్రిస్తారు. పూజాగృహాలు, వాటి పరిసరాలందు దేవతల చిత్రాలు, నీతిని నెమరుకు తెచ్చేకథలు చిత్రిస్తారు. ఇండ్ల ముంగిండ్లనూ,పూజాంగణాలనూరంగు రంగుల పిండి రేఖలతో సొగసుగా చిత్రించిన రంగవల్లికలు (ముగ్గులు) జ్యామితి గణితమంతా ఇక్కడ నెలవొందెనా అన్నట్లు శోభగా ఉంటవి. రంగుల కూర్పు పొందిక నెరిగి ఆయా రంగురంగుల పూలతో చిత్రాలు వెలార్చేవారు. ఈ చిత్రాలు దేవతలవి.

ఉపకరణాలలో:

గింజలు వెదబెట్టెడి జడ్డిగం శిల్పమయం.

చెరణకోల కంచీకి శిల్పం, ఎద్దుల మెడపట్టెడలు, సిగమోరలు, చిత్రాలతో చెన్నొందుతూ ఉంటవి. ఏవో రెండు జీవుల శిల్పాల్ని జతగూర్చి, అడకత్తెరలను అమరుస్తారు. ఒయ్యారా లొలక బోస్తూ గుసగుస లాడుకొంటూ వున్న చిలుకల జంటో, ఉల్లాసంతో సల్లాపాలాడుతూ వుండే హంసలో, మిడిసి ఎగసిపడుతూ వుండే మీనులో చెంబులపైన చిత్రింపబడుతవి. కుట్మాల (మొగ్గల) ఆకారంగా కుంభాలను. పద్మాకారంగా పళ్లెములను గండరిస్తారు. ఆసనాలకు అద్భుతంగా శిల్పాలను మలుస్తారు. మంచాలక్కూడా ఇంపైన శిల్పాలను వెలయిస్తారు. వితానాలపైన చిత్రాలు, ఆస్తరణాలకు చిత్రాలు, చాపలు తివాసీలకు చిత్రాలు. వాటి పేర్లే చిత్రాసనాలు.

లాలు, కలందానులూ, కళా వైభవానికి నెలవులు. పాదరక్షలకు శిల్పం. కటాకు గొడుగుల కూర్పులో శిల్పము. విసనకఱ్ఱల అల్లికలో శిల్పం. తాచివరికి గోడకు నాటు మేకూ శిల్పమే! దాని తీరును బట్టే అది "చిలుక కొయ్యగా" పేరొందింది.

వ్యాసంగంలో :

జలతారు మొదలైన దారాలతో లతలా పూలు పక్షులు మృగాలు మొదలైన వాటి చిత్రాలను స్త్రీలే అల్లేవారు, కుట్టేవారు.[1] అంటే లేసులు అల్లుట, బుటేదారు పనిచేయుట, రంగురంగుల పూసలు అద్దాలతో చిత్రాలు అల్లుట, బుటేదారు పని చేయుట, రంగు రంగుల పూసలు అద్దాలతో చిత్రాకృతులొదవించి రవికల గుట్టేవారు. రంగురంగుల పూసలు పూలు పొసగించి తోరణాల నల్లి అలంకరిస్తారు. రకరకాల పూలతో తీరుతీరుల దండలు చెండ్లు గుచ్చుతారు. కురులను తీరుతీయముల కొదగించి ఒయ్యారాలొలికిస్తారు, బట్ట కట్టులో విన్నాణము, భారతీయుల చీర సింగారము విదేశీయ వనితల కెంతో ముచ్చటగా వుంటుంది. బొట్టుదిద్దుటలోనూ పొలుప మున్నది. ఆ బొట్టులో రకా లున్నవి. వారు పలికే పలుకుబళ్లలోనూ రససిద్ధి యున్నది.

పిల్లలు మట్టితో బొమ్మలు చేసి వినోదిస్తూ ఉంటారు. పిచ్చుక గూళ్ళు, బొమ్మరిళ్లు కట్టి మురిసిపోతారు వాటన్నిటా ఒకతీరు శోభ లేకపోలేదు. కోలాటపు వరుసలలో అందునా జడకోలాటంలో వా రొనర్చే భంగిమలు చూడముచ్చటగా వుంటవి. చెమ్మచెక్క ఆటలో చూపించే ఆ ఒయ్యారపు భంగిమ లెంతో హృద్యంగా వుంటవి. వీటన్నిట రసాత్మకత ఉన్నది.

---

1 పారావతములు, శుకములు,
శారికలును, బుష్పలతలు జనవర। పసిడిం
దారమున నైన ముట్టులు,
నారయ గృహమంగళంబు లాదర్శములున్.
(భార–అను-ఆ-4ప.118)

జోలపాటలు, లాలిపాటలు, దంపుడు పాటలలో భావస్రవంతి తొణికిసలాడుతూ ఉంటుంది. పిల్లల ఆటలలో పాటలు, పొడుపు కథలు: పొడుపు కథల పద్యము మచ్చు చూడండి.

వృక్షమందు నుండు, పక్షియునుం గాదు;
తోలు గప్పి యుండు, శూలిగాఁడు
మూడు కన్ను లుండు, ముక్కంటియును గాఁడు
దీని భావమేమి తిరుమలేశ? (నారికేళం)

ఎంత లేమి జీవితమైనా యేవో బొమ్మలు, చిత్రాలు ఇంటిలో అలంకరించు కొననివా రుండరు. కనీసం మట్టి బొమ్మలు పెండ బొమ్మలైనా ఉంటవి. 'వీటిదీ కళేనా? రసానుభూతేనా?' అంటారా? 'ఔ' ననే చెప్పుతాను. వాటిని చూచే వారూ ఆ పవిత్రి రసానందపుటనుభూతులనే అనుభవిస్తారు. వారు దర్శించేది, అనుభవించేది వాటి బాహ్యరూపాలనూ, ఆరూపాలతో అనుభూతులనూ కాదు; ఆయా మూర్తులం దొదిగి యుండే ధార్మిక నైతిక భావాలనూ, ఆ భావాల సౌందర్యపు అనుభూతులనూ. అవి కేవలం నిర్జీవపు బొమ్మలో, విగ్రహాలో, ప్రతిమలో కావు. వారి ధార్మిక, నైతిక జీవిత సూత్రాలకు ప్రతినిధులు; ప్రతీకలు; చిహ్నాలు. అంటే. 'అ' అనే స్వరానికి 'అ' యెట్టి గుర్తో, చిహ్నమో అలాగే ఆయా మూర్తులు, చిత్రాలు ఆయాధార్మిక నైతిక గాథలకు గుర్తులు, చిహ్నాలు. కొన్ని స్వరాల కూర్పు వర్ణం; అక్షరం. కొన్ని వర్ణాల కూర్పు పదము. కొన్ని పదాల కూర్పు వాక్యం. ఆ వాక్యమును చూడగానే దాని భావం మన యెదుట నిలుస్తుంది. అలాగే ఆయా మూర్తులను చిత్రాలను చూడగానే ఆయాగాథల వెనగి యున్న భావపరంపరలూ దివ్య సందేశాలూ గుబురు కొని తోసిపాడి వస్తూ ఉంటవి. కాగా ఒక మహద్వాక్యాన్ని కొకిబికి అక్షరాలతో వ్రాసినారే అనుకోండి. అట్టి దానిని చూచినా అందలి మహదాశయం, ఉదాత్త భావం చక్కగా స్ఫురిస్తుంది. రసానుభూతి కలుగుతుంది. ముత్యాల కోవిలాగు సుందరంగా అక్షరాలు పొందించి వ్రాసినప్పు డావాక్యం ఎంతగా ఉల్లసిస్తుందో యీ అక్షరాలతో ఉన్న వాక్యమూ

అంతగానూ ఉల్లసిస్తుంది. ఆ అనుభూతులకు కొకిబికి అక్షరాలు అడ్డురావు. ఆ విషయమే తలపున మెదలదు. ఈ మూర్తుల విషయమూ అంతే.

అతి సామాన్య శిల్పాన్ని గూర్చిన మాటలివి. కళాసిద్ధిగల శిల్పాలూ ఉన్నవి. అవి అతి లలితములు. చిత్రాలలో అతిలోక సుందరములు. వాటి వర్ణమైత్రి, లేపనపు తీరు, రేఖా లాలిత్యాలు అద్భుతాలు. అంగ ప్రత్యంగాలు. అతి సూక్ష్మ విన్యాసాలు, వాటి వల్ల కలిగే తీరుతీరు భావాల తేడాలు, చక్కగా గుర్తించి సందర్భ శుద్ధిగా వాటిని పొసగించే వారు. అట్టి శిల్పాలను, చిత్రాలను చూడగానే ఏవేవో తలపుల దొంతరలు పెరుగుతూనే ఉంటవి. కవులు, గాయకులు మాటలతో మూర్తులను మోల నిలిపి చూపి హృదయాలను ఆడిస్తూ ఉండగా శిల్పులు, చిత్రకారులు మూర్తులతో హృదయాలను మాటలాడిస్తారు.

"కళోపాసన కళోపాసన కోసమే" అన్న ఊర్జితాదర్శంతోనే వారి కళోపాసన లక్ష్యం ఆగలేదు, ఇంకా ముందుకు సాగినది. దివ్యానందాన దోగుటే వారి లక్ష్యం. మనవారిది ఏ కళగాని, శిల్పముగాని, చిత్రముగాని, శాస్త్రముగాని, మరేదైనాగాని ఆనంద బ్రహ్మమున పర్యవసింపవలసినదే. ఏకైక లక్ష్యమదే. నృత్యంలోని అభినయ ముద్రలలోనూ, కావ్యంలోని ధ్వనిలోనూ పరబ్రహ్మను ఉపాసించి ఆనందించుట వారి వైశిష్ట్యం. దర్శనమాత్రము ననే మానవ హృదయాన్ని పేశలంగా పదును చేసి, ఆంతరిక దివ్యశక్తులను పరాశక్తి వైపునకు ఉన్మీలించును. తనను దర్శించు వాని లోలోపలకు అంతరాంతరాలకు అతీతానందాన్ని ఆహ్వానించును. ఈ ఆనందంలో ప్రతిఫలాపేక్ష యెక్కడా లేదు. ఆనందమే ఫలం. ఆతన్మయతలో సకల సంబంధాలూ విస్మృతాలగును. బ్రహ్మానందమూ ఇట్టిదే. అయితే ఇదో చూస్తూ ఉన్నంత సేపే. అదో శాశ్వతము; అఖండము. ఇదే ఆ శాశ్వతానందానికి ప్రథమ పాఠము.

# ఆర్ష కుటుంబము

పదునాల్గవ నివాళి

# ఉపసంహారము

## ధీశక్తి

ఆర్షకుటుంబపు తీరు తీయములు గమనించితిరి. దాని నిసర్గ సౌహార్దమున మన సమాజము బహుధా ఉత్తేజ మందినది. దాని సౌష్ఠవమున మన సమాజము శాంతి భద్రతలను, సుఖమును అనుభవించినది. ఇపు డావిషయమును కొంచెము ముచ్చటిస్తాను.

మన దేశమున పూర్వ మనేక శాస్త్రిలూ, కళలూ, పరిశ్రమలూ పూర్ణ వికాసముతో ఉండేవి. దేశమున మంచి నడవారు లుండేవి. మన దేశపు నాలుగు చెరగుల నుండి సరకుల గొనితెచ్చి ధారాళముగా వాణిజ్యము చేయు చుండిరి. సరకుల గొనిపోవు బిడారులతో సార్థవాహ బృందములు సందడితో ఉండేవి. ఇంతే కాదు, ఓడలమీద సముద్రాలు దాటిపోయి సుదూర ద్వీపము లందలి దేశము లందలి విపణులలోనూ మన వర్తకులు వాణిజ్యము చేసేవారు. అందువల్ల వివిధ పరిశ్రమలు ప్రబలినవి. శిల్పములు వివిధ వాస్తు విద్యలూ, లలిత కళలు, ఆయా శాస్త్రిలూ విద్యలు, సాహిత్యమూ కవిత్వమూ బహుధా వికసించినవి. ఈ వివిధ విద్యలలోనూ పారంగతులు, పరిణత ప్రాజ్ఞులైన సుప్రసిద్ధు లనేకు లుండిరి. వీరి సేవల వలన దేశము సస్యశ్యామలము, సుందర వస్తు సంపన్నము, అనర్ఘ ద్రవ్య సంచయ శోభిత విపణిమయమై నిత్య కల్యాణము, పచ్చ తోరణముగా సంతతోత్సాహము గూర్చు చుండెడిది.

దేశ మిట్టి సుశోభ నందిన దంటే ఆయా విద్యలూ కళలూ సుష్ఠుగా అభివృద్ధి నంది యుండవలె. అట్లభివృద్ధి నందిన ఆయా విద్యా సంస్థ లానాడు మన దేశమున వుండేవి. అవి నిరాడంబరాలు. ఒకరి ప్రాపు ప్రోపులలో

లేవవి. ఇతరుల ఆధిపత్యం, ఆదేశం వాటికి లేనే లేవు. వాటి కవి సర్వతంత్ర
స్వతంత్ర సంస్థలు. విద్యా విధాన మెట్లుండ వలెనో ఏ ఏ పఠన పాఠనా లేక్ర
మంలో సాగింప వలెనో ఆచార్యులే నిశ్చయింతురు. దానిని అనుసరించే వారు
నడుపువారు వేరే. ప్రభుత్వాని కెట్టి ప్రమేయమూ లేదు. అయితే వీటికి
సహాయము చేయవలసిన విధి రాజు కున్నది. ఆ పరిమితికి మించి యీ
సంస్థలకు దానా లిచ్చిన రాజు లున్నారు. అది వారి రసికతా విద్యాభి మానముల
వల్లనే. అంత మాత్రన రాజా సంస్థల నిర్వహణలో నెట్టి జోక్యము కలిగించు
కొనుట పొసగదు. రాజులేగాక ఇతర గృహస్థులును ఇట్టి దానాల నిచ్చేవారు.
ఆగృహస్థులతో పాటి వాడే రాజున్నూ. రాజు ముఖ్యముగా చూడ వలసిన దేమి
టంటారా: ఆకతాయుల వల్ల ఈ సంస్థల కుపద్రవాలు లేకుండా భద్రత కూర్చుట.

ఈ సంస్థలలో శిక్షితులైన వారాయా విషయాలలో పూర్ణ పరిజ్ఞానమూ,
క్రియా దక్షతా కలిగి యుండేవారు. ఆయా విషయాలు వారికి ముఖస్థంగా
ఉండేవి. ఆ సంస్థల తీరుపు (శిక్షణ) తీరట్టిది. సద్యః స్ఫురణ గలది.
వచో విధేయమైన విద్యే విద్య యని వారి విశ్వాసము. పుస్తకమును సంప్ర
తించి చెప్పుతా మనుట వారెరుగరు. ఏ శ్రోత్రియుడూ పుస్తకం చూచి మంత్రం
చదవడు. ఏహోతా స్తోత్రంగాని ప్రార్థనగాని పుస్తకము చూచి చేయడు.

సామము గానము చేయుట కేయుద్గాతా పుస్తకము నపేక్షింపడు.
ఏ జ్యోతిషికుడూ పుస్తకము పుటలు త్రిప్పి ఫలము వచింపడు. ఏ ధార్మికుడూ
ధర్మ నిర్ణయము తెలుపుటకు పుస్తకము పుణుకడు. నిదానము కోసము గాని
ఔషధ నిర్ణయము కోసముగాని, ఔషధ యోగము కోసముగాని, ఏ భిషక్కు-
పుస్తకమున దేవులాడడు. వాస్తు పథకముకోసముగాని శిల్ప నిర్మాణము
కోసముగాని ఏ స్థపతీ పుస్తకము తడవడు; అలా పుస్తకము నపేక్షించుట
పండిత లక్షణ మనిపించుకోదు. వారి బుద్ధినే వారు విశ్వసించేవారు. అందు
వల్లనే వారి ధీపరిశ్రమ విశిష్టముగా వెలసినది. సుష్ఠుగా పుష్టిగొన్నవి.

ఆర్షకుటుంబము

# పరిశ్రమలు

మరి పరిశ్రమల మాట :— వస్తువుల యుత్పత్తి దేశపు అవసరాలకు చాలినంతమాత్రమే గాక యెగుమతులకు కావలసినంతగా ఉండేది. అందు వల్లనే సముద్రాంతర దేశాలకు కూడా సరుకులు దీసికొని పోగలిగిరి ప్రధాన పరిశ్రమల ననుసరించి చిన్న చిన్న ఉప పరిశ్రమలూ ఉండేవి. ఆయా పరిశ్రమలతో అనేక కుటుంబాలు పల్లెలలో సుఖంగా జీవిస్తూ ఉండేవి ఈ పరిశ్రమలన్నీ గృహములలోనే నిర్వహింపబడుతూ ఉండేవి. ఇవి యితరుల పెట్టుబోతలలో లేవు. ఒకరి ఒద్దింపులూ గద్దింపులూ లేవు. ఏ సరుకు నెంత యుత్పత్తి చేయవలెనో ఏ ఏ ముడిసరుకు లెంతెంత కావలెనో వాటిని చేని దేని నెటనుండి తేవలెనో యీ మొదలైన పథకాలు వారంతట వారే నిశ్చయించుకొంటారు. పైన పెత్తనం చేసే వారెవరూ ఉండరు. వారికి వారే పాలకులు; పరిశ్రమ పోషకులున్నూ. పెట్టుబడి కేదైన డబ్బు కావలసి వస్తే వారివారి వృత్తిశ్రేణి సహకార సంఘాలనుండి అప్పు తెచ్చు కొందురు. వారి సరకులను విపణుల కెక్కించేవీ యాశ్రేణులే. ఈ పరిశ్రల నిర్వహించుటకు సాంకేతిక విషయముల వివరించు వారుగాని, విశేషజ్ఞులు గాని వారి కవసరము లేదు. ఆనుపూర్వికంగా తరతరాలనుండి వస్తున్న కౌశలం, వృత్తి మర్మాలు వారు చక్కగా ఎరుగుదురు.

ఎన్ని పరిశ్రమలున్నా ఎంత సంపదున్నా, నమలి మ్రింగ వీలుగాదు గదా! అన్నిటికీ ఆధారము ఆహారమే! ఆపైన కావలసిన ప్రధాన వస్తువు వస్త్రం. వీటి ప్రాముఖ్యమును. వారు చక్కగా గమనించిరి. 'అన్నం బహుకుర్వీత' (ఆహారము నెక్కువగా పండించు) అని ఉద్బోధించినారు. ఉపనిషత్ప్రబోధమిది. మరొకటి—

''తంతుం తన్వన్రజసో భానుమ న్విహి జ్యోతిష్మతః
పథో రక్ష ధియా కృతాన్। అనుల్బణం వయత
జోగువామపో మనుర్భవ జనయా దైవ్యం జనమ్॥''
(ఋ 10—53.6)

“దారమును వడుకుము. దానికి రంగు పట్టించుము. హెచ్చు తగ్గులు బుడుపులు లేకుండా నేయుము. బుద్ధిమంతులు చూపినది తేజస్వంతమైనది యీ మార్గము (పరిశ్రమ). దీనిని రక్షింపుము. దివ్యులైన సంతానమట్లై యిదే అవసరము” అని వేదవాక్కు. (ఋ 10—53; 6) ఈ యుపదేశము నాలించిరి. శ్రద్ధతో పాలించిరి. ఈ ఆహారోత్పత్తి చేయుటలో గాని, దీని సేకరణ పంపకములతోగాని యితరుల జోక్యము లేదు. ఏ కృషికున కా కృషికుడే యీ కార్యకలాప మంతటినీ పూనికొని నడిపేవారు. ప్రతి కర్షక కుటుంబికీ అది విధిగా తలచే వారు. క్షేత్రపతి (రైతు) మధు మంత మూర్తి (తేనె పట్టు వంటి వాడు) అని ప్రస్తుతించిరి. ఇట్లు వారిని లెస్సగా ప్రోత్సహించినారు. వారి పరమ పురుషార్థము పరమప్రాప్తి. అందు వలన అదియే వారి సకల వ్యాసంగములందు పర్యవసించు చుండును. అట్లే యీ ఆహారోత్పాదనోద్యోగము కూడ ఆధ్యాత్మిక భావముతో నతికించినారు. ఆ మూలమున భూతభావన (“ఇతర ప్రాణులూ నావంటివే అవే నేను, నేనే అవి; వాటికీ నాకూ భేదం లేదు.” అనే భావము)ను పురిగొల్పినారు. ఇదొక నైతిక బాధ్యతగా మత విశ్వాసంగా రూపొందించిరి. మరి వారి సంస్కృతి కర్షక సంస్కృతి. నిజంగా అది త్యాగమయము. వారు పడించిన పంటంతా వారే అకట్టుకొని అనుభవించరు. వా రా పంటతో నెందరెందరిని తృప్తి పరుపవలెనో చూపనే చూపితిని. ఆహారము నితరుల కందనీయక దాచుకొన్న వారిని గురించి నిర్దాక్షిణ్యంగా నిరసించిన నిరసనలను చూపితిని. అన్న మంటే సృజనాత్మక శక్తికే సృజనాత్మక శక్తి. దానిని వ్యర్థము చేయుట మహాపరాధము. ఎన్నెన్నో అవరోధముల నెదుర్కొని వాటికి తట్టుకొని యెంతెంతో శ్రమపడి పెంపొందించినగాని అన్నము సిద్ధించదు. అందువల్ల “అన్నం న పరిషించేత” (అన్నమును వ్యర్థం చేయకు) అని ఉద్బోధించి నారు. వ్యర్థ పుచ్చకే కాదు; ఎక్కి తొక్కిగా కడుపున త్రొక్కనూ రాదు. మితాహారిగా జీవించ మంటున్నది. గీత ధమ్మపథమూ ఆయుర్వేదమూ నిట్లే నిర్వచించినది. అంటే ‘తిండికోసము గాదు నీ బ్రతుకు; బ్రతుకుట కోసమే నీకు తిండి’ అన్న మాట. అతిథి అభ్యాగతుల నాదరిస్తూనూ, అనాథలను ఆదుకొంటూనూ కఱ

వులు మొదలైన ఉపద్రవములలో ఆర్తులకు అన్నదాన వస్త్రదానములూ చేస్తూ సోదర మానవులకు ఉపచరిస్తూ ఉండటము పవిత్రవిధిగా ప్రతిగృహస్థూ పాలించే వారని చూపితిని.

వంట చేసుకోవట మేలాగున సర్వసామాన్య విషయమో ఆలాగే నూలు వడకటం కూడ సర్వసామాన్య విషయంగా (పరిశ్రమగా) ఉండేది. రాట్నం మాడనియిల్లు ఉండేదికాదు. సామాన్యంగా ఏ కుటుంబానికి కావలసిన వస్త్రాల నాకుటుంబంవారే నిర్మించుకొనేవారు.

విద్యాసంస్థలు. పారిశ్రామిక సంస్థలు, కర్షక వ్యాసంగముల తీరుల గమనించితిరిగదా! ఇట్లే మన సకల సంస్థలు నిరాడంబరములు, మిత వ్యయముతో గూడినవిగా నుండేవి అవి స్వయంపోషకములు. దేశపు నాలుగు చెఱగులా వ్యాపించి యుండేవి. వాటి వ్యవహారతంత్ర మెక్కడో మిన్నులు పడ్డచోట ముడిపడి యుండేవి కాదు.వాటి కవే సర్వ స్వతంత్రములు.వేటి సమస్యలు అవే యెక్కడి కక్కడే పరిష్కరించుకొంటూ ఉండేవి· ప్రభుత్వపు చల్లని చూపు కోసరము పడిగాపులు పడియుండు టెరుగరు. ఆత్మవిశ్వాసముతో అన్నీ సాధించే వారు,

# ధర్మము

ఈ వ్యవస్థ కింత దృఢశక్తి, ఆసక్తి, ఆర్జవము ఎట్లు కలిగినవి? బహుముఖమైన దీని వ్యవసాయమున కంతా ధర్మమే మూలము. ధర్మ మనుపదమునకు చాల విశాలమైన అర్థపరిధి ఉన్నది, సమాజపు సుఖశాంతులు సర్వస్వమం దొదిగియున్న దనవచ్చు క్రమశిక్షణతో గూడిన ప్రవర్తన, బాధ్యత (విధి), నైతిక ప్రవర్తన, మతము, సామాజికహితకార్యము స్వభావము, మొదలైనవన్నీ దీని పరిధిలోనివే.

సుఖశాంతుల యభిలాషే మానవధర్మం (స్వభావం). అయితే లోకములో ననేక పరిస్థితుల ఒడిదుడుకులలో మెలగవలసి వుంటుంది. ఏవేవో ప్రలోభాలూ వ్యక్తిని చెడుత్రోవకు లాగుతూ ఉంటవి. అందువల్ల సహజము,

ఆర్షకుటుంబము

సరళమునైన మానవ స్వభావము మరుగుపడి స్వార్థము గడిదేరగా బుద్ధి వక్రిస్తుంది. దానితో నిక కామక్రోధము లట్టే ముసరు కొంటవి. లోకవ్యవహారం చిక్కులమారి దౌతుంది. ఈ బెడదల నివారించుటకే క్రమప్రవర్తన, నీతులు, నియమాలు, విధులు, వ్యవస్థలుగా మరల ధర్మమే రూపొందినది. అనేక ప్రాంతాలు, వర్ణాలు, వర్గాలు, మతాలు, భాషలతో వైవిధ్యముగా ఉన్నదేశము మనది. అయితే ధర్మ మందరకు శిరోధార్యముగానే ఉన్నది. ధర్మము నేభేదము లేక అందరూ సమానముగానే సంభావిస్తారు. ఇట్లిది మనదేశీయుల సంఘటితపరిచి జాతీయత నొదవించినది.

విశేషించి సమాజమున వారివారి విధులను నిరూపిస్తున్నది ధర్మము. విధులంటే తప్పక నిర్వహింపవలసిన బాధ్యతలు. ఇంకా సమాజమున కెక్కడి కక్కడ స్వావలంబన ప్రవృత్తి, ఆత్మవిశ్వాసము, ప్రవర్తము, ఐచ్ఛిక లోకసేవ, త్యాగబుద్ధి మొదలైన వానిని నెలకొల్పినవి. ఎవరో వచ్చి తమయవసరము పూరించవలె ననే పరావలంబన మనస్తత్వము వాటికి లేదు. తమ కేవేవి యవసరమో వారు చక్కగా గుర్తింపగలరు. వాటిని స్థానికంగా తామే సమిష్టి కృషితో సమకూర్చుకొనేవారు. అది వారికి ధర్మము నిరూపించిన, నిర్దేశించిన విధి. సమాజపు హితకార్యముల నిర్వహించు విధి (బాధ్యత) ఇట్లు వికేంద్రీకరింపబడినది.

కేవలము నైతిక బాహ్యపరిణామాల వివేచనలకే పరిమితము గాదు ధర్మము. అది ఆత్మసంబంధి. ధృతి[1] (సమాజమును క్రమబద్ధముగా నుంచుట) లేదా ధైర్యము, సహనము, అపహరించకుండుట, శౌచం[2] (పారి

---

1. "ధృతి క్షమో౽స్తేయం శౌచ మింద్రియనిగ్రహః
   ధీ విద్యా సత్య మక్రోధో దశకం, ధర్మలక్షణమ్" మనువు
2. శౌచం కేవలం బాహ్యశౌచం కాదు. ఆంతరికశౌచము. మనస్సునకు, దానికి పూనికగూర్చు ఆత్మకు సంబంధించినది.

శుద్ధ్యం), ఇంద్రియ నిగ్రహము, బుద్ధిపైశద్యం, విద్య, సత్యనిరతి, కక్ష పెట్టుకోకుండుట, ఇవన్నీ ధర్మదేవత యొక్క లక్షణాలు. ఆత్మపూతము లైననే యివి సాధ్యములు. ఇంకా యజ్ఞధర్మము కూడా. అంటే త్యాగబుద్ధితో కర్మ లొనర్చుచు. లోకమున జీవయాత్ర సాగించుట దీని లక్ష్యం. దీనిని పురస్క రించుకొనే మనజీవిత విధానము రూపొందింప బడినది. దానిని నాలుగు శాఖల చిగా నిర్వచించిరి. 1. ధర్మం, 2. అర్థం, 3. కామం, 4. మోక్షం. వీటిని పురుషార్థము లన్నారు. ఇవి ఒకదాని కొకటి బాధకముగాని తీరుగా వీటిని మెలకువతో సమన్వయించి (పొసగించి) అనుభవింపదగు నన్నారు. పురుషుని ప్రయోజకత్వము (సామర్థ్యం) అదేనట. వీటిలో మొట్టమొదటిది ధర్మం. చిట్ట చివరిది మోక్షం (ఆముష్మికాభ్యుదయం శ్రేయస్సు) చిట్టచివరిదైన మోక్షం (ఆముష్మికాభ్యుదయ జీవనం) పరమ లక్ష్యం. అంటే మానవుని మనుగడ దీనిని పొందుటకోసమే మొట్టమొదటి దైన ధర్మము, చిట్టచివరగమ్యము జేరు కొనుటకు శిక్షణ. మిగిలినవి రెండూ ఈ రెండు కొనలగల ధర్మమోక్షముల నాశ్రయించి యుండునవే, ఆనుషంగికములే.

ధర్మ మిట్లు దివ్యప్రతిపత్తి గలదైనది. సత్యము పరమేశ్వరుని స్థాయి నందినది. స్థాయినేకాదు, తాదాత్మ్యమును కూడ ఇదో చూడండి. "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ (బ్రహ్మసత్యము. జ్ఞానము అపరిమితము. తైత్తి ఆ.వ.మం.1) "బ్రహ్మణోనామ సత్యమితి" బ్రహ్మఅంటే సత్యమే (ఛాందో ప్రపా 3. మ-4) "యోవైన ధర్మ స్సత్యం'' సత్యమే ధర్మము— (బృహదా —4—14) ఇట్టి మహోన్నత ప్రతిపత్తి గలదగుట వల్లనే మన ధర్మమున కధిక గౌరవము. "ధర్మాత్పరంనాస్తి'' (ధర్మమునకు మించినది లేదు) అన్నారు. ''అధోఽబలీయాన్ బలీయాగ్ సమాశగ్ంసతే'' ibid (ఈధర్మం వల్లదుర్బలుడు కూడ బలవంతుల నోడించును అన్నారు. పూర్వము మనసమాజమును) నిజముగా శాసించినది ప్రభుత్వం కాదు. ధర్మమే. రాజుకూడ ధర్మమునకుదాసోహ మనవలసినదే.

ధర్మము మనవారి కుగ్గుతో రంగరించి పోయబడిన శిక్షగా నుండేది. అది వారి నరనరముల జీతించినది. కనుకనే సామాన్యునకుగూడ ధర్మా

ధర్మాలు స్థూలంగా తెలిసి యుండేవి. ధర్మసూక్ష్మముల నిశ్చయింపదగిన వారు స్థితప్రజ్ఞులే. సుఖదుఃఖములు, రాగద్వేషములు మొదలగు ద్వంద్వాల కతీతులై సమభావముగలవారు వీరు. కనుక అందులకు వీరే యధికారులు. ఇట్టి ధర్మ సూక్ష్మములు నిశ్చయించుటలో ఒకే కర్మయొక్క బాహ్యవ్యాపారము మాత్రమే పరిగణించి నిశ్చయింపగాదు. ఆకర్త మనఃప్రవృత్తి యెట్టిదో పరిగణించ వలెను. అది శుద్ధముగా నున్నదా? లేదా? అనే విషయము గమనించి నిర్ణయింప వలెను. ఇంకా ధర్మము నిరూపించుటలో వీరు కేవలం భౌతిక, నైతిక, ప్రమాణములే గాక, ఆధ్యాత్మిక పరిణామాలను పరిగణింతురు. కర్త యొక్క మనఃప్రవృత్తియే ప్రధానము. కొన్ని కార్యములు పైకి చూచుటకు ధర్మం గానే తోచవచ్చును కాని ఆయా సందర్భాలలో నవి వ్యక్తులకే కాక సంఘము నకూ ఉపద్రవము కలిగించగలవు. మరికొన్ని కార్యములు చూచుటకు అధర్మంగాతోచవచ్చు. కాని ఆయాసందర్భాలలో వాటి నాచరించుటే హితము కాగలదు. మచ్చుకివి-

ఒకడు విద్యాదానము చేస్తానని శిష్యులను సమకూరుస్తాడు. ఆవిద్యా బోధ మాటున దేశమునకు జాతికి ననర్థము దెచ్చిపెట్టే విషయాలు బోధిస్తూ ఉంటాడు. విద్యాదానం మహోత్తమమైన ధర్మంగా కనిపిస్తుంది. అయితే యీదానము చేయుటలో నతని బుద్ధి శుద్ధము కాదు· దేశమునకు, జాతికి, హాని చేయుటే. ప్రశాంతముగా నున్న పల్లెలో ప్రజాసేవ చేస్తానని ఒకరు ప్రవే శిస్తారు. ఆ యూరివారి కవసరములకు తోడ్పడుతూ మెల్లగా కొందరమాయకుల ఆదరాభిమానాలను సంపాదిస్తాడు. క్రమంగా ఆయూరి వారిలో వైమనస్యాలు కలిగించి తానొక పక్షానికి నాయకుడుగా వ్యవహరించ సాగుతాడు. ప్రజాసేవ యుత్తమ ధర్మమే. కాని యీ సందర్భంలో ఆ ప్రజాసేవకుని మనఃస్థితి యెట్టిది? జడ మనగలమా? మరి, ఒక శత్రువు ఒకదేశము పైకి వస్తూఉంటాడు. అప్పుడొక ప్రాంతం నడబాటలను పాడుచేసి, వంతెనల పడగొట్టి, జలాశ యాల దెగగొట్టి రొచ్చురొచ్చు చేస్తారు· పనులన్నీ పరమఅధర్మములుగా తోస్తవి. అయితే వీటిని చేయుటలో కర్తల మనస్సులు మలినముగా లేవు. శత్రువుల నెదుర్కొనుటకే. ఇంకా ఒక స్త్రీ ప్రసవింపజాలక బాధపడుతూ

ఉంటుంది. డాక్టరు ఎంత ప్రయత్నించినా శిశువు వెలువడుట లేదు. ఏమి చేయవలె? ఉపేక్షిస్తే తల్లిప్రాణమునకు మోసంవస్తుంది. గర్భంలో శిశువును కత్తిరించి తల్లిని రక్షించవలెనా? భ్రూణహత్య అని ఉపేక్షింపవలెనా? డాక్టరు శిశువును ముక్కలు చేసి వెలువరిస్తా డనుకోండి. దీనిలో డాక్టరు మనస్సు మలిన మన గలమా? కొన్ని విషయాలు స్థూలంగా బాహ్యదృష్టికి మంచిగానూ అద్భుతమైన విగాను చాలా ప్రయోజనకరములుగానూ కనిపించవచ్చు. మహాప్రళయ కరములైన శక్తుల సిద్ధుల కోసము చేసే తపస్సులు, అణువిచ్ఛేదనోద్యోగము, గ్రహాంతర ఆక్రమణ యత్నములు నిట్టివే. ఇట్టివి పరిమిత పరిధిలోనే ఉంటవని తలచు టెట్లు? ఎవ రెంత గోప్యంగా ఉంచినా, అవి కాలక్రమేణ ప్రపంచ మంతా వ్యాపించక తప్పవు. అప్పు డెవరికీ ఏదుర్బుద్ధీ పుట్టదనిగాని, అట్టి వారు వాటితో లోకము నుద్ధు గుడుప రనిగాని, విలయ తాండవము చేయరని గాని మాట యేమున్నది? నమ్మక మేమిటి? ఇంకా మరి యీనాడు ప్రతి వారూ తమ తమ కోరికల సాధించుకోవటం కోసం చేస్తున్న సత్యాగ్రహాలు ఉపవాసాలు సమర్థింప దగినవా? వాటినీ ధర్మ సూక్ష్మ దృష్టితోనే పరిశీలింప వలెను. మహాత్మాగాంధీ గారు చేసినారు కనుక మేము చేస్తామనటం సమంజసం కాదు. సమర్థనీయమూ కాదు. నిజమైన స్థితప్రజ్ఞు డాయన. ఆ మహాపురుషునకున్న అంతఃశక్తి, శుద్ధ బుద్ధి, సత్ప్రవర్తన ముఖ్యంగా ప్రతిపక్షిని గూడా ఆదరించు సహనము అనన్యదుర్లభం కనుక ఇతరుల కవిచేయుట కర్హతే లేదు. అవి సమర్థ నీయములు గావు. ఈవివేచనకు దిగితే చా[illegible] పెరుగుతుంది. అది అట్లుండ నీయండి.

ధర్మ పాలనమున కొక సులభ సూత్రము సూచింపబడినది. అది ఆత్మౌపమ్య—లేక, ఆత్మ తౌల్య—ధర్మం 'నీకేది[1] సరిపడదో దానిని నీ వితరులకు

---

1 న తత్పరస్య సందధాత్ ప్రతికూలం యదాత్మనః
ఏషం సంక్షేపతో ధర్మః సపేత్య సుఖ మేధతే" (భార-శాంతి—౧౧౩—౬)
ఒరు లేమేవి యొనర్చిన
నరవర యప్రియము దన మనంబున కగుఁ దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మ పథముల కెల్లన్.
(కవి బ్రహ్మ తిక్కనగారి అనువాదం భార—శాంతి. 5—220)

చేయకు. ఇది ధర్మసారం. దీని ననుసరిస్తే సుఖిస్తావు.' అని సూత్రిం. అంటే ఇతరు లేవిధంగా ప్రవర్తిస్తే నీకు హాయిగా శాంతిగా ఉంటుందని నీ కన్పిస్తుందో అదే విధంగా నీవు ఇతరులతో వ్యవహరించు. అప్పుడు సమాజ వ్యవస్థ సవ్యంగా సరళంగా సాగుతుంది. నీవు, నీ ప్రతిపక్షి ఇద్దరూ సుఖ శాంతుల ననుభవిస్తారు. ఇదే ధర్మానికి సుఖమైన సూత్రము. సూటిబాట. అయితే యీ సూత్రం ఏకపక్షీయం గాదు. ఇరు పక్షాల వారు పాలింప వలసినది.

మన పూర్వులకు ధర్మము, దానిచే విధింపబడిన విధులూ ఉగ్గుతో రంగరించి పోయబడినవి వారి యణువణువునా అవి జీర్ణించినవి. ఈవిధులు చాలా ప్రాముఖ్యమూ ప్రభావమూ గలవి. మన పూర్వులకు బాగా తెలిసినవీ, అలవాటైనవీ ఈవిధులే. ఈ విధులను పాటిస్తే హక్కుల జాబితాను పట్టి ప్రాకులాడ నక్కరలేదు. హక్కుల కోసం ఆందోళనలు చేయటం అవి ఫలించకపోతే ఆకతాయి పనుల కొడిగట్టటం ఉండదు. ఎవరి విధులను వారు పాలిస్తే సుఖ శాంతులు వాటంతటవే రెక్కలు గట్టుకొని వచ్చి కాళ్లదగ్గర వ్రాలుతవి. సమాజపు శ్రేయస్సు కోసం, సుఖ శాంతుల కోసం వ్యక్తులు నిర్వహించవలసిన బాధ్యతలూ త్యాగాలే విధులు. ఈ విధు లనుల్లంఘనీయములు. వ్యక్తులు తప్పక నిర్వహించి తీరవలెను. ఆలా నిర్వహించని వారు ధర్మ భ్రష్టులు: సంఘ బాహ్యులు. సంఘములో వారికి గౌరవ ప్రతిపత్తులుండవు. సంఘమేగాక బంధువులూ, చివరకు స్వకుటుంబమువారైనను వారితో సహకరించరు. ఇది దారుణమైన దండన; దుర్భరమైన యవస్థ. కనుక ఈ ధర్మము నతిక్రమించుట కెంతటి బలవంతుడూ సాహసించడు.

ఇటు ఐహిక జీవితానికి, అటు ఆముష్మిక జీవితానికి సేతువు(వంతెన)గా ధర్మప్రజాహితము లైన ఐహిక కార్యముల నెన్నిటినో యది సమకూర్చినది. గృహస్థ ధర్మాలూ,మాతాపితల పట్ల ప్రవర్తించ వలసిన ధర్మాలూ,గురు శిష్యుల ధర్మాలు మొదలుగా ధర్మాలనేక మున్నవి.వాటిలో కొన్నిటిని ఆయా ప్రస్తావనలలో వెనుకనే చూపితిని. స్వస్థ వృత్తమునకు ప్రధానముగా ననుష్ఠింప వలసిన శౌచ

కర్మలూ, పౌర సౌకర్యము నుద్దేశించిన విధులూ, సభ్యతా సంప్రదాయముల మర్యాదలూ, ప్రజాహిత కార్యములు మొదలైన వన్నీ ధర్మమున కంకితము లయ్యే యున్నవి.

# సామాజిక హితము

గృహస్థు నిత్యమూ నిర్వహించవలసిన పంచ యజ్ఞముల గురించి వెనుకనే వివరించినాను. వాటిని గమనించండి. అవన్నీ ప్రజాసేవకూ, సామాజిక హితమునకూ ఎంతగా నుపకరించగలవో తెలియును. కలవారు సప్త సంతానముల బడయు టొకధర్మముగా నున్నది. 1) కూప నిర్మాణం (బావి త్రవ్వించటం) దీనివల్ల మంచినీటి వసతి కలుగుతుంది. 2) ధర్మశాల (సత్రం) నిర్మించుట. బాటసారుల విడిదికి, విశ్రాంతికి ఉపయోగిస్తుంది. 3) జలాశయం (చెఱువు) నిర్మించుట. ప్రజలకు, పైరులకు, పశువులకు నీటి సౌకర్యం కల్గిస్తుంది. 4) వనం (తోపును) నిర్మించుట. ఎండవేళల బాటసారులు, పశువులు, తలదాచుకొనుటకు ఉపయోగిస్తుంది. 5) పల్లెలకు తోపుల ఫలసాయం ఆర్థికంగా లాభిస్తుంది. పల్లెల కనేకంగా తోపులు ఉపయోగపడును ఆ వివరాలను వృక్షాయుర్వేదపు సమాచారములో (సమీక్షలో) చూపినాను. 6) కృతిని పొందుట. ఇది సాహిత్య సేవ. 7) దేవ ప్రతిష్ఠ. దేవాలయాల ననుసరించి అనేక కళలు, వృత్తులూ విలసిల్లినవి. ఇంకా ప్రజ కాధ్యాత్మిక ప్రబోధమున కిది సాధనము.

ఇవన్నీ ప్రజల యవసరముల సమకూర్చునవే గదా! మరింకా ప్రజోపయోగం కోసమైన కార్యాలూ,సంస్థలూ, ఉద్యమాల కన్నిటికీ 'ధర్మం' అనే విశేషణం జోడిస్తారు. "ధర్మసత్రం'' "ధర్మతోపు'' "ధర్మబావి" "ధర్మ కార్యం'' మొదలైనవి. ఇట్లు త్యాగధర్మమునకు బాగా పదును బెట్టి దానితో ప్రజాసేవయేగాక భూత ప్రాణుల సేవనూ బాగా పురి కొల్పిరి. మరెన్నో మహత్కార్యముల సాధించిరి. జన రంజకములైన యనేక సంస్థలకు దానా లియ్యటం గురించి వెనుకనే వివరించితిని.

# భూతదయం

ఆతురులకు, అనాథలకు నుపచరించుట సభ్యత. సమాజ సౌష్ఠవమున కిది యవసరము కూడ. ప్రతి కుటుంబీ యీ ధర్మమును పాటించవలసి యున్నదన్న విషయము వెనుకనే చూచినారు గదా! ఇంతే గాదు: ఆతురులకు చికిత్సించుటకు పుణ్యశాలలు (ఆతురాలయాలు Hospitals) రోగులకు పడకలు పథ్యపానముల సౌకర్యముతో కూడ నెలకొల్పుటకు దాతలు దానము లిచ్చు చుండిరి. వాటిని నిర్వహించు చుండిరి. ప్రాణాచార్యులు, శల్యతంత్ర పారీణులు కూడ ఈ యాతురాలయమం దుండే వారట. ప్రసూతి వైద్యాలయ ములు ఉండేవి. విద్యాలయముల కోసము, గ్రామభద్రత ఇతర అవసర ముల కోసరమూ దానా లిచ్చు చుండిరి. అట్టి దాన శాసనము లనేక మున్నవి. షచ్చుకు వీర రాజేంద్ర చోళుని శాసనం (Ep. Rep. No. 182/1915— సం॥ 1062 క్రీ.శ) మదడం శాసనం (Madras Ep. Rep. F 122) చూత దగును. పశువులు మొదలైన తిర్యక్కుల కోసము ఆతురాలయముల నెలకొల్పిరి. (అశోకుని కాల్సి 2వ శాసనం చూడుడు) ఇది లౌకిక ప్రయోజన ముల నపేక్షించి కాదు; భూతసేవను పురస్కరించుకొని. భూతబలులనిచ్చుటకేది ప్రేరేపించెనో జీవహింస నిషేధించుట కేది ప్రోత్సహించెనో ఆ భూత భావన ధర్మమే దీనికి మూలం. భూతసేవ యెంత పటిష్ఠంగా ఉండేదో చూడండి. "అనేకజలచర[1] —భూచర— ఖేచరముల వధ నిషేధింపబడినది. చూడిది పాడిది యైన ప్రాణిని దేనినీ చంపరాదట. జంతువుల బలి యిచ్చుట నిషేధమట. అడవుల తగుల బెట్టరాదట."

ఇంకా కృషి కర్మలో పశువుల పోషణ వాటి శ్రమను వినియోగించ వలసిన విధానాలను గురించి నియమా లుండేవి. మున్ముందుగా దుక్కి టెద్దు లను, పిమ్మట చూడి, పాడిగొడ్లను, ఆ పిదపతక్కిన చతుష్పాదులను గనిపెట్టి

---

1 అశోకుని ధర్మశాసనాలు

పోషింప వలెనట.[1] నాలుగు జతల యెద్దులతో కృషి చేయుట ఉత్తమమూ ధర్మమూనట.[2] ఒక జతతో చేయు కృషి హీనమూ పాపమూనట. ఆకొన్నది, దప్పిగొన్నది, అలసినది, కుంటి, గుడ్డి మొదలైన అంగవైకల్యము గలది, జబ్బుగా నున్నది, దుర్బలంగానున్నది-ఇట్టి వానితో ఏ పని చేయరాదట[3] ఇలా నిషేధింపబడని పశువులతోనైనా అర్ధదినమే పనుల చేయించ వలెనట [4]. అంటే దినమున కొంటిపూట మాత్రమే పొద్దుట నుండి రెండు ఝాముల దాక పనిచేయించ వలెనట[5]. ఎద్దుల నదలింపులతో తోలవలెనేగాని వాటిని కొట్టరాదట. పర్వదినాలలో వాటి ముషణము [వృషణాల] వేయుట, చురకలు వేయుట కూడదట[6]. పశువులను రక్తము వచ్చునట్లు కొట్టరాదట. ఈ ఆచార మిప్పటికీ కర్షకులు పాటిస్తున్నారు. ఈనాడు మానవుల హక్కులు, కార్మిక స్వత్వాలు (హక్కులను) ప్రకటనలైతే ఆనాడో నోరు విప్పి తమ గోడైనా చెప్పుకోలేని దీనజీవుల పక్షమున ఈస్వత్వాలు (హక్కుల) ప్రకటింపబడినవి. ఆనాడు తాము తనివిదీర త్రాగినంత త్రాగి కుక్కలకు పందులకుగూడ మజ్జిగ త్రాగించినారు[7]. అంటే పాడి యానా డెంతో సమృద్ధిగా నుండేది. మరనేడో పసి పాపలకు పోయు పాలకైనా నోచమాయె!

## ధనమూ : త్యాగమూ

మరొక విశేషము :- ధనశక్తిని కాలూని కుదురుకోనీయలేదు, త్యాగ ధర్మమును బాగా ప్రోత్సహించి యా ధనశక్తి నొక చోట నిలువకుండ జేసిరి.

---

1 ఋగ్వేదము
2 పరాశరస్మృతి.
3 పరాశరస్మృతి.
4 పరాశరస్మృతి.
5 పరాశరస్మృతి.
6 అశోకుని ధర్మశాసనము.
7 కౌటిల్యుని అర్థశాస్త్రము.

రాజుల విషయమున నిది మరింత యవసరము. రాజకీయంగానూ, సైనికంగాను బలవంతుడు రాజు. ఆయన ఆర్థికంగానూ బలవంతుడైతే చాలా దుష్పరిణామాలు కలుగవచ్చు. కనుక రాజుల నత్యంతమూ త్యాగోన్ముఖులనుగా నుత్తేజపరిచిరి. అక్కడ గూడిన ధనమును రాజులు మరల ప్రజలకు గుమ్మరించు చుండే వారు. రఘు వట్లు చేయువాడని రఘువంశము చూపు చున్నది. హర్షు డీతీరు మహోత్సవములు చేయు చుండెనని చరిత్ర రచయితలు పేర్కొన్నారు. వీటిని సత్రోత్సవము లనువారట. చైనీయ యాత్రికుడు హ్యూయన్‌త్సాంగ్ వాటిని వర్ణించినాడు. అయిదేసి సంవత్సరముల కొకమారీ సత్రోత్స వాలు జరుపబడేవట. ఆ ఐదుసంవత్సరాలలో తన దగ్గర గూడియున్న ధనము ఆభరణాలు భోగవస్తువులు మొదలైనవాటి నన్నిటినీ ఈ ఐదవసంవత్స రాన ఆర్తులకు, అనాథలకు, విద్వాంసులకు, యతులకు, రాజు దానము చేయు వాడట. తనదగ్గర కానుపీసంకూడ విలువ యుండకుండ నిట్లు దానముచేసి తాను కాషాయవస్త్రములు ధరించి యింటికి చేరువాడట హర్షుడు. ఆయన అంతకు పూర్వము ఈతీరున ఉత్సవము లైదింటిని చేసినాడట. హ్యూయన్‌త్సాంగ్ చూచిన యుత్సవ మారవదట. "నిలువు దోపిడు లిస్తా"మని దేవుని కావద మ్రొక్కులు మ్రొక్కుచుండుట నేడూ ఉన్నదిగా? ఆసత్రోత్సవపు శిథిల రూపమే ఈ యాచారము కావచ్చు. "అల్పసంపద, అల్పవ్యయములు మే"లని యశోకుని నిర్వచనము. (అశోకుని ధర్మశాసనము కాల్సీ3 వ శాసనం.)

ఆత్మీయతా వితరణము లేసమాజమున నెలవుకొనునో యది సుఖశాంతుల తెప్పగా ననుభవిస్తుంటుంది. ఈ త్యాగధర్మములో నవి నెలవుకొనియేయున్నవి. సామాజికహితం కోసరం వ్యక్తులు వితరణచేయుట అవసరం. ఆవితరణ యైచ్ఛి కంగా వారివారి సౌహార్ద చిత్తశుద్ధులతో జరుగుచో సర్వదా శుభము. అటుకాక వేరుతీరుల వ్యక్తులనుండి సమాజహితముకోసం ధనమునూ, ద్రవ్యాలనూ గుంజనూవచ్చు. ప్రభుత్వ శాసనాల యొత్తిడిలు, దౌర్జన్యాలు దోపిడీలు అందు లకు, సాధనములుగావచ్చు. ఏవేవో ఆశలు, లాభాల యెరల జూపుట యొక మార్గం కావచ్చు. కాని యీతీరులు ఇచ్చిన వారికీ, పుచ్చుకున్నవారికీ సౌమన స్యము నమకూర్పవు. ఇచ్చిన వారి హృదయములు ప్రసన్నములుగా నుండవు.

వారు త్యాగానందము ననుభవింప జాలరు. ఆశలకు లోనై యిచ్చేది రాజస త్యాగము. శాసనాలు మొదలైన వాటికి దాళలేక యిచ్చేది తామసత్యాగము. ఈత్యాగాలలో ఇచ్చేవారి మనస్సులు శుద్ధముగా నుండవు. లోలోపల కుళ్లుతూ కుతకుతలాడుతూనేయుంటవి. కనుక మనవారు స్వచ్ఛందమైన సాత్త్వికత్యాగమునే యభిలషించిరి. దాని కున్ముఖులుగానే వ్యక్తుల ను త్తేజపరిచిరి.

ధర్మసంగ్రహపు తీరింకా ఉన్నది. యాత్రికులకు సౌకర్యము లొడవించుట. పంచాయతులు, వాటియుపసంఘములు విధిగా నుండేవి. యాత్రికులకు విడుదులు చూపుట, వారి యవసరములకు తోడ్పడుటే కాదు; వారావలి విడిది ప్రదేశము జేరుదాక వారి కుపకరించు చుండవలె[1]. గ్రామంలో దొంగతనం జరిగితే దొంగ లపహరించిన యాస్తుల జాడ తేల్చవలసిన బాధ్యత గ్రామాధ్యక్షుని దట[2]. ఆజాడ తేల్చలేకపోతే ఆనష్టము నాయధ్యక్షుడే అచ్చుకోవలెనట. మరి దారిదోపిడీ జరిగితే దాని తేల్చవలసినవారు విసీతాధ్యక్షుడు. ఆపదవి లేని చోట చోరరజ్జుకులు, అట్టివారి యేర్పాటులు లేనిచోట సిదోపిడీ యేయూరి [3]పొలిమేరలో జరిగినదో నాయూరివా రందరి బాధ్యతట. అది తేల్చలేకపోతే ఆ నష్టము నిదేవరుసన వారువా రిచ్చుకోవలెనట.

# యుద్ధనీతి

రణధర్మము ఉత్తమంగాను, అత్యంత ముదారంగానూ ఉండేది. శత్రువుతోనూ ఉదాత్తంగా వ్యవహరించేవారు. పారిపోతున్నవానిపైనా, ఆయుధము గోల్పోయి యున్నవానిపైనా చేయి చేసికోరు. శరణాగతుని రక్షించుట పవిత్ర

---

1. మెగస్తనీసు పాటలీ పుత్రమును గూర్చి చేసినవర్ణనలు. వాత్స్యాయనమునకు శ్రీ ఆదినారాయణశాస్త్రిగారివ్యాఖ్యానంలో గోష్ఠులు సంఘములయాచారములు చూడుము.
2. కౌటిల్యుని అర్థశాస్త్రం—అధిక—4—ప్రకర—88.
3. మెగస్తనీసు వర్ణనలు.

ధర్మం. స్త్రీలజోలికి పోరాదు. తమచేత జిక్కిన శత్రుకాంతలను గౌరవముతో నాదరించి వారి నివాసములకు క్షేమముగా జేర్చువారు. పౌరుల బాధించుట, పల్లెలు పట్టణాల దగులబెట్టుట, దోచుకొనుట నిషిద్ధములు. ఇట్టి నియమా లనేకము లుండేవి. అవి అట్లుండనీయండి. ఎంత బద్ధశత్రుత్వమున్నా, యెంత దారుణంగా పోరాడుతున్నా, యెంతకక్ష వున్నా, ఆయావృత్తులకు హానీ,అభ్యంతరమూ[1] కలుగనీయరాదు. అందువల్లనే పోరాట మెంత యారాటంతో దారుణంగా సాగుతున్నా కాపు(రైతు) లదురూ, బెదురూ లేక తమతమ కార్యకలాపాలను జరుపుకొంటూ వుండే వారట. ఇందువల్ల యుద్ధాలతక్కు, వాటి బాగోగులూ, ఆ పోరాడు పక్షాల వారికే పరిమితంగా వుండేవి. యుద్ధకాలాన గాని తరువాతగాని పరిశ్రమలు నుత్పత్తులు దెబ్బతిని లోకం చీకాకుపడివుండేదికాదు.

# అటవీసంపద పరిరక్షణ

వృథాగా[2] చెట్టును గొట్టరాదని మరొకధర్మం. అలాకొట్టితే నరాలపుండు పుట్టుతుందట. ఇదివెఱ్ఱితొఱ్ఱిమాటగా తోచవచ్చు. కాని దీనిప్రభావము హెచ్చు. మానవులకు ప్రకృతి ప్రసాదించిన మహత్సంపదలలో అడవు లొకటి. గృహనిర్మాణమునకు కావలసిన కలపమొదలు పొయ్యిలోనికి పుల్లదాక, మానవుడు అడవుల నరుకుకోవలసినదేగా ! ఇవి ప్రత్యక్ష ఉపయోగాలు. మనకు తెలియకుండానే యడవులవల్ల మన కొదవుచున్న లాభా లనేక మున్నవి. వడగాడ్పులనూ చలిగాలులనూ అడవు లాపు చున్నవి. అందువల్ల వాతావరణము సమస్థితిలో ఉంటున్నది. అడవులు మేఘాల నాకర్షించి వర్షము గురియుటకు తోడ్పడుచున్నవి. వర్షపాతపు తాకిడికి నేలలు దోకుకొనిపోకుండా ఆపుచున్నవి. వర్షపాతపు నీ రొక్కుమ్మడిగా పొర్లి వెల్లువలై పోకుండా అడవులు వాని నాపి పట్టి వాని పారుదలను క్రమపరుస్తవి.

---

1. మెగస్తనీసు వర్ణనలు.
2. ''వృక్షచ్ఛేత్తు వృథా యస్తు నాడీవ్రణవా న్భవేత్''

గౌతమధర్మశాస్త్రం.

ఇంకా అడవుల పరిసరముల నివసిస్తూ వాటి నాశ్రయించుకొని యున్న వారి కవెంతగానో ఉపకరిస్తున్నవి. ఈ విషయమును డా॥ ఫ్రెడరిక్ రోజ్ (Dr. Frederik Rose) గారు చక్కగా వివరించిరి. (బ్రిటన్ విదేశాంగ కార్యాలయపు నివేదికలో నని గుర్తు). "అడవులు లేనిదేశం; తీరం (సముద్రతీరం)లేని దేశంవంటిది" అని సముద్రతీరాలవారు సముద్ర సంపద ననుభవించి లాభం పొందుచుండునట్లే, అడవుల నాశ్రయించి యున్నవారు బెంకలు, ఆకులు, ఓషధులు, కాయలు, పండ్లు, పప్పులు, తేనెపట్టులు, నారలు, చువ్వలు, కలప. కట్టెపుల్లలు, అడవిజంతువుల కొమ్ములు, తోళ్ళు, పక్షుల ఈకలు—అబ్బా! యెన్నెన్ని విధములో ఆ సంపద! ఇది జాతీయ సంపద. ఇట్టిజాతీయసంపద మన భారతదేశంలో తక్కువేమీ కాదు, కాని దానిని దుబారా చేస్తున్నాము. ఆయడవుల నాశ్రయించుకొన్నవారికి వాటిలాభం పూర్తిగా చెందుట లేదు. దళారులు దోచుకుంటున్నారు. ఇట్టిసహజసంపద చాల నష్ట పడుతున్నది. మొన్నటి ప్రపంచయుద్ధంనాటి నుండి మరింత నష్టపడుతున్నది.

యూరపులో 16వ శతాబ్దినుండి అడవులు నిరాదరింపబడినవి. దాని ఫలి తంగా ఆయాదేశాలు ప్రకృతి శాపము ననుభవించినవి. అందువల్ల అనేక కష్ట ములకు గురియైనవి. వానలు తరిగి పోయినవి. నేలలు దోకుకొనిపోగా సార వంతమైన భూములు నీరసించి పోయినవి, లోయలు ఇసకనేలలై రోగాలకు నెలవులైనవి, వరదల వల్ల నష్టాలు కలిగినవి. మొదటి ప్రపంచయుద్ధము తరు వాత యూరపువారికి అడవులను పెంపొందింపవలెననే శ్రద్ధ కలిగినది దృఢ నిశ్చయంతో తీవ్రప్రయత్నముతో ఈ కార్యము సాగిస్తున్నారు.

ఈయడవుల యవసరమూ, ప్రయోజనమూ మనవారికి పురాతనకాలము నుండి తెలియును. తోపులు నాటుట పవిత్రధర్మంగా తలస్తుండేవారు, అందు వల్లనే "చెట్టును వృథాగా కొస్తే నరాల పుండు పుట్టుం" దని అనటం. మరి ఈ నాడు చెట్లస్థితి యెట్లున్నది? పెరళ్ళను, తోపులను, నడదారుల కిరుపై పులనూ, చేలగట్లను, చెఱువుల కట్టలను, కాలువల కట్టలను, గోభూములనూ, అడవు లనూ గల చెట్లను గాలించి గాలించి నరికి వేసినారు, నరికి వేస్తున్నారు. ఇట్లు బాధ్యత లేకుండా వ్యవహరిస్తున్నారు నడబాటల ప్రక్కల చల్లని నీడలనిచ్చే

చెట్లను నిట్టనిలువునా పట్టల నొలిచివేస్తూ చిత్రవధ చేస్తున్నారు. కొమ్మలను కొట్టివేస్తున్నారు. తోపులలో చెట్లకూ నిదేగతి. వచ్చేపోయే బాటసారులు వాటి మ్రాకుల మొదటనే పొయ్యి నమర్చి వంటలు చేస్తూంటారు. ఆ పొయ్యి కొక వైపు పొయ్యిరాయిగా మ్రానునే ఉంచుతారు. ఆచెట్టు చల్లని నీడ ననుభవిస్తూ దానిమొదలుకే మోసము దేవడమా? ఆశ్రయదాతకే యపకారము దలపెట్టుటేగా యిది! మరి ఇంతకంటె నీచకార్యమూ ద్రోహమూ ఇంకేమున్నది? చెట్లన్నీ ఈవిధంగా చేటొందుతూనే వున్నవి, పరశురాము డిరువదొక్కమారు క్షత్రలోక మును సంహరించి యంతటితోనైనా వదలినాడు. జనమేజయు డాస్తికుని యుప దేశము నాలించినంతటనైనా సర్పయాగమును విరమించినాడు. ఈ వృక్ష సంహారకాండ కట్టియవధి కనపడదే! ఈ దురాగతాలను చూచేవారు వారిని నివా రింపబూనరే! పల్లెత్తుమాటనరే? తమను గానట్టు చూస్తూ ఊరకుంటారు. ఈయపచారపు దుష్ఫలానుభవ మాయవివేకులకు మాత్రమేనా? కాదు. లోక మంతా దాని ననుభవించవలసినదే చల్లగా నీడల నిస్తూ వుండే పచ్చని చెట్లు జాడలేకుండా పోయినవి ; పోతున్నవి. పక్షులు తలదాచుకొన తావులేక అల్లాడు తున్నవి. ఆయాఋతువులలో అవి రంగురంగుల సింగారాలతో ప్రత్యక్షమై వొయ్యారా లొలికిస్తూ కనులపండువుగాజేయు నృత్యాలు చెవుల కింపొదవహాయి హాయిగా జేయుగానాలు ఇక కనుపించవు;వినిపించవు.ఎండవేళల పశువులకాపరు లైన పిల్లలు,పశువులు తలదాచుకొన తావులేకుండాపోయినది. ఇంకా ఆలోచిస్తే వాతావరణమూ చాలా మారిపోయినది. ఆయాలాన ఋతుపవనా లెగుడు దిగుడుగా నైనవి. దానిని బట్టి వర్షమూ క్రమము దప్పినది. అందువల్ల సస్యములు దెబ్బదింటున్నవి. ఈతీరున కంటికి చెవికి ఇంపులేక,హృదయానికి ఉల్లాసం లేక, వానల యొడిదుడుకుల వల్లనూ, పంటలు ఫలించకనూ బాధలు పడుతున్నాము. మరి పాపం పట్టికుడుపు తుందంటే యిది కాదూ? కర్మ సిద్ధాంతమున కిదే మచ్చు. కర్మ ఫలం వ్యక్తులనేగాక, సంఘం, జాతి, దేశం అన్నిటినీ పట్టి బాధిస్తుందట. ఈ మాట లిక్కడ సరిగా అతుకుతవి. చెట్టును నరికిన వాడికి పుండన్నారు. అది లోకానికే ఒట్టు. సలపరింత పుండైనది.

ఆర్షకుటుంబము

కర్షకులూ[1] ఆయా వృత్తులవారూ దోషులైననూ తమ తమ పనులలో నున్నప్పుడు వారిని పట్టుకొని బంధింపరాదట. ఎందువల్ల? ఆయా వృత్తులు భంగపడరాదనే. పౌరవిధులు గుర్తునకు దెచ్చు ధర్మము లిలాంటి వింకెన్నో యున్నవి. వడ్డీ వ్యాపారము నింద్య మైనదిగానూ దలపబడేది.

## సౌహార్ద సహకారములు

సౌహార్ద సహకారములు జాలువారెడిది వారి పౌర జీవితము. అది నిసర్గమధురము. పశువుల మంద, బయళ్లు మొదలైనవి సామాన్యంగా సమిష్టి అనుభవంగలవిగా నుండేవి. కొన్ని బీళ్లూ సాముదాయకములే. అయితే వ్యక్తి స్వామ్యంగల బీళ్ళు లేక పోలేదు. తగినంత ఉపపత్తి, తీరిక లేని చిన్న రైతులు అరకల పొత్తు గలసి సేద్యం చేసికోవటము జరిగేది. అయితే ఆ పొత్తు పంట చివర దాకనే. "చేతులపొత్తు చేని పంటతో సరి" అన్ననానుడే యీ విషయమును తెలుపుతుంది. ఇంకా పశువుల పొంతన లేకనో జబ్బు పడుట వల్లనో యేరైతు కృషియైనా వెనుకబడి అదును పదునులలో విత్తుటకు చేను నందించుకోలేకపోతే ఇరుగు పొరుగు రైతు లుపేక్షించి చూస్తూ వుండరు. చేను బీడు పడనీయరు. తమతమ అరకలూ మనుష్యులూ తోడ్పడి, ఆ రైతు పొలం దున్ని విత్తనాలు విత్తి యతని కప్పగిస్తారు.

సామాజిక ఉత్సవాలలో వూరివారందరూ నడుముగట్టి, తలకొక పని చేసే వారు. అందువల్లనే ''దేవుడి పెళ్లి కందరూ పెద్దలే'' అన్ననానుడి. ఇంతేగాదు; గ్రామంలో ఏ యింట్లో ఏ ప్రయోజనం (కార్యం) వచ్చినా అది ఊరందరిదీ నన్నట్లు వ్యవహరిస్తూండేవారు. ఎవరింట నేపదార్థ ముంటే అదితెచ్చి ఆ కార్యాని కందించేవారు. అందులకు ప్రతిఫలం అడుగరు. పెరటిలో నున్న కూరగాయలు, పాలు పెరుగు, విస్తళ్లు, పందిళ్లకు తాటాకు, వంటచెఱకు, వంటపాత్రలు మొదలైనవి యెవరింట నేవుంటే అవల్లా తెచ్చి యిచ్చి కార్యము నిర్వహించేవారు. పొరుపులున్నా కార్యముల పట్ల వాటి మాట దలచే

---

1 కౌటిల్యుని అర్థశాస్త్రం.

వారు కారు. అలా తలచటం కాని, సహకరించక పోవటంగాని అమర్యాదగా, అసభ్యతగా, నింద్యంగా ఉండేవి. కార్యాలలో నేపైనా లోట్లు వస్తే ఆ యగౌరవ మా కుటుంబికే కాక గ్రామానికే కలిగినట్లు తలచేవారు. పిన్ని, అక్క, బావ, అన్న అంటూ వరసలు గలిపి పిలుచుకొంటూ ఆప్యాయతతో ఆ కార్యమన్నాళ్లూ అందరూ తలాయొక పని నందిపుచ్చుకొని చేస్తూండేవారు. ఆ కార్యం జరిగినన్నాళ్లు దాదాపుగా ఊరందరికీ ఆ యింట విందులే. ఈతీరున నూరంతా సహకరించుటవల్ల ఆ కుటుంబి కట్టే వ్యయ ప్రయాసలుండేవి కావు. మరి సహకారం తీ రేలాగుంది? ఎవరి ద్రవ్యం వారిదే. కానీ అవసరాని కందరిదీ అన్నట్లు లేదూ? ఇది యైచ్ఛిక సహకారం. ఎవరికీ నొప్పి గలిగించదు. అంతటా అందరకూ హాయే! ఆనందమే! ఏ యాదేశంవల్ల, ఏశాసనం వల్ల ఈలాంటి సహకారం, ఆనందం సాధ్యమౌతుంది?

# వ్యవహార దక్షత

ఇది సరే, మరి లౌకిక వ్యవహార దక్షతా కొదువ గాదు. నిత్య వ్యవహారాలు నిర్వహించుకొనుటకు చాలినంత ప్రాథమిక జ్ఞానము సామాన్యంగా ఉండేది. తిథి, వారం, వర్జ్యం చూడటం, ప్రయాణ ముహూర్తములు చూడటము వంటి వాటికి తగినంత జ్యోతిషజ్ఞాన ముండేది. ఇల్లు కట్టుటకు, పాకలు పందిళ్లు వేయుటకు, బావులు, కుంటలు, చెఱువులు, కాలువల పనులు నిర్వహించుటకు. ఒరవలు, ఉలవరాలు మళ్లించుటకూ కావలసినంత వాస్తు విద్యా పరిచయ ముండేది. ఇలాగే వైద్యం, ధర్మశాస్త్రం, నైతిక సూత్రాలు, శ్రౌతం, స్మార్తం, వెరసులు, కొలగారపు లెక్కలు మొదలైన వ్యావహారిక గణితం, భూమితి (పొలం కొలవటం), పత్రవ్యవహారం (దస్తావేజులు వ్రాయటం) సరుకుల ధరల పరిజ్ఞాన ముండేది. ఏయే పనికి, ఏయే వస్తువులు కావలెనో యేదేది యెంతెంత కావలెనో వాటి వివరాల పరిజ్ఞానం, మనిషి, పశువులు, ఏ పనిని ఎంతెంత కాలములో ఎంతెంత చేయనగునో వాటి వివరాల పరిజ్ఞానం, అందుకు కాగల మూల్యపు (మజూరి) పరిజ్ఞానం కలిగియుండి యాయా పనుల కంచనాలు వేయజాలి యుండేవారు. ఈ ప్రాథమిక

జ్ఞానంతో సామాన్యంగా ఎవరి పనులు వారే నిర్వహించుకొనేవారు. ఒకవేళ నేనైన తెలియక పోతే సంప్రదించుట కాపాటి తెలిసినవా రాయూరనే దొరు కుదురు. కాసువ్యయం లేకుండా అట్టి వారి సహాయం లభిస్తుంది. జలాశయాలు, సేతువులు సంరాగారాలు మొదలైన ప్రజాహిత మహా నిర్మాణములు నిర్వహించుటకు పరిణతప్రజ్ఞులు విశిష్టులు అయిన స్థపతులూ ఉన్నారు. కొండలు, గుట్టలు, లోచూపు సారింపగాకుండెడి విషమాతి విషమ ప్రదేశములలోనూ నీటి వాటముల సూటిగా గుర్తింప సమర్థులై యుండిరి. ఈనాటి సాధన సంపద లేకున్నా, ఆనాటి వాటములు గుర్తించి వాటి ననుసరించి నదుల కానకట్టల గట్టుట కనువైన ప్రదేశాల నిర్ణయించిరి. ఆ ప్రదేశాల సుదృఢముగా నదుల బంధించి, మహాజలాశయములనుండి యా వాటముల వెంట మెలికల మలపుతూ కొండల గుండ పంటకాలువల నడిపించిరి. కొండల డొలిచి విశాలమైన గుహలను నిర్మించి వాటిలో శిలల గండరించి మనోహరమైన మూర్తుల దీర్చి దిద్దిరి. నీటిలో తేలియాడెడి యిటుకల నిర్మించిరి[1]. ఏయాధారమూ లేక అంతరమున నూగులాడే లింగమును[2] ప్రతిష్ఠింపగలిగిరి. వంగునట్టి గోడను నిర్మించిరి. నీటిలో రాళ్ల తేలియాడున ట్లొకజలాశయము నిర్మింప నేర్చిరి. త్రుప్పు పట్టని లోహస్తంభమును నిర్మింప సమర్థులైరి. సంగీత స్వరముల ధ్వనించెడి స్తంభముల వెలయించిరి. ఇట్టి వింకెనెన్నో యద్భుతాద్భుత నిర్మాణముల జేసిరి. ఇట్టి వీరి ప్రతిభ, ప్రజ్ఞ సామాన్యములా?

# జానపదుడే మంత్రి

మరి మంత్రద్రష్టలైన ఋషులేమి? బ్రహ్మవాదులేమి? మహాకవివరేణ్యులేమి? అనన్యసామాన్యకౌశలముగల శిల్పులేమి? ఘటనాఘటన సమర్థులైన రాజతంత్ర ప్రవీణులు మంత్రులేమి? అందరూ జానపదులే. జీవిత క్షేత్రాలలో

1 ములుగు దగ్గర గల రామప్ప దేవాలయము గోపురమున కిట్టి యిటుకలున్నవి.

2 సోమనాథ దేవాలయమున నిట్టియంతర్లింగ ముండేదట. గజనీ దండయాత్రకు లోనుగాకముం దట్లుండెనట.

ఏరంగాననేగాని, యే మహావ్యక్తి ఉద్భవించినా వారంతా జనపదాల [పల్లెపట్టులలో]బుట్టినవారే. అచట బెరిగిన వారే. జనులు జనపదాలయందే యెక్కువగా నివసించెడివారు. పట్టణాలు పల్లెలే హాయిగా నుండేవి. మంత్రిగా జానపదులనే నియమించవలెనట. శ్రేణులు మొదలైన సంఘ పల్లెలలో నుంఘాదేవి. ఈ సంఘాల సభ్యుల కర్తలను పేర్కొనుటలో వ్యవహార దక్షత, ప్రయోగ జ్ఞానము (ఆచరణ జ్ఞానము) వీరి కుండవలెనని చెప్పబడినది. జానపదుల ప్రజ్ఞాపతాక మీతీరున ప్రతిష్ఠింపబడెను.

ఇట్లు ప్రతిష్ఠింపబడిన ధర్మసంస్థలూ, ధర్మమూ స్థిరముగా, సుష్ఠుగా సాగు చుండుటకు సత్సంప్రదాయాలనుకూడా వెలయించిరి. కొత్త దాన మిచ్చుట కంటె ఇది వరకే యొకరిచ్చియున్న దానమును పాలించుట (భంగ పరచకుండుట) పవిత్రముగా దలచుచుండిరి. అందువల్ల ఎవరూ ఏదానము నకూ, ధర్మ సంస్థకూ హాని జేసేవారు కారు. ఆలాగున హాని జేసిన వారిని సంఘం సహించేది కాదు. వారిని ధర్మభ్రష్టులని ప్రకటించి ప్రతి ఘటించి వారితో సహకరించేది కాదు. ఇందువల్ల ఆయధర్మల పరపతి, ప్రతిష్ఠ భంగపడేవి. కాగా ఎన్నెన్ని యుపద్రవాలు వచ్చినా, రాజులు, రాచరికాలు మారినా, ధర్మసంస్థలు చెక్కు చెదరక జరుగుతూనే వుండేవి. ఈదాన ధర్మాలతీరు పరిశీలిస్తే ఇవన్నీ ముఖ్యంగా ప్రజల యక్కరల కుపయోగపడు సంస్థల స్థాపించి వాటిని నిర్వహించు చుండుట కోసమూ, అట్టి వాటిని నడుపు చుండు విశిష్టుల ప్రోత్సహించుటకోసమూగా కనుపిస్తవి. అంతేకాని, యీ దాన ధర్మాలతోనే వ్యక్తులను భోగభాగ్యాల రుచిమరిగించుటకు కాదు సోము రుల మేపుట కుటుంబి పనిగా వారెక్కడా చెప్పలేదు. మానవశక్తి యేకాస్తా కూడ వ్యర్థం గారాదనే వారి పూనిక. తుదకు వృద్ధులూ, వికలాంగులూ కూడ నేదో పని చేయనేవలె.[1] అట్టి వారికి నూలు వడుకుట మొదలగు పనులు చూపినారు. అంతేగాదు; ధర్మ (ప్రజా) కార్యాలలో ప్రతివారూ ఏదోతీరున సహకరించవలె[2]. శరీర శ్రమ చేయువారు శారీరక శ్రమ పూర్వకం

---

1, కౌ. అర్థ—ప్రక—41. 2. కౌ అర్థ—ధర్మాస్థీయం.

గానూ, శ్రమచేయజాలనివారు ధనపూర్వకంగాను, ఈ రెంటికీ చాలని వారు వారి వారి దగ్గర నుండు నాయా పరికరముల నిచ్చుట ద్వారాను సహకరింపవలెనట.

# దరిద్రనారాయణ సేవ

మరి యాచకుల మాట. దేశంలో రకరకాల యాచకు లుండేవారు. నాటి పరిస్థితులు వేరు. నాడు వీరు లోక వికాస వినోదములకు సాధకము. నేడు బాధకము. ఈ బైరాగులూ యాచకులూ నేడు రోతగా దోచవచ్చు. కాని వారా నాడు దేశమునకు జేసిన సేవ మరవ రానిది. తీరుతీరు పాటలతో ప్రజానీకమును రంజింపజేయుచుండునది వీరే. విప్రవినోదులు ప్రదర్శించెడి యక్షిణీ (గారడీ)విద్యలు, దొమ్మరులు ప్రదర్శించెడి సాముగరడీలు (మొగ్గలు,పగ్గముల పైన, గడలపైన నడచుట మొదలైనవి) అద్భుతములు. పాశ్చాత్యులు ప్రదర్శించెడి మెస్మరిజం,సర్కస్ల కివి తీసిపోవు. వీరు సోమరు లనదగునా? ఆర్ష సంప్రదాయాలు, సంస్కృతి–విజ్ఞానములను భారతీయ సమాజ హృదయ పుటముల నచ్చొత్తినవా రెవ్వరు? ఈ యాచకగణమే! వారిట్లు గిరి గీతగానైనా మాసిపోకుండా ముద్రింప గలిగిరి. ఊరూర, వాడ వాడ. గడప గడప త్రొక్కుతూ పాటలూ, పదాలూ భక్తిగీతాలూ తత్త్వాలూ, మొదలైన వాటితో చెవినిల్లు గట్టుకొని ధర్మమును చాటుచుండిరి. సమాజమును ధర్మపరాయణం గావించిరి. వారు ఈ ప్రచారమునకు గావలసిన సాధనాల జూడండి; అవి నిరాడంబరమైనవి కారు చౌక. వారే నిర్మించు కోనేవారు గూడ.తంబుర, సితార, చిరుతలు, తాళాలు, గజ్జెలు మొదలైనవి.

హైందవుల విశ్వాసములకవరోధములు కలగినకాలమున్నది ఆకాలమున హైందవులు తమ యాచారముల ననుసరించుట దుస్తరముగా నుండేది. దేవ పూజలుసేయుట, భజనలు సేయుట మొదలైన మతకార్యములను స్వేచ్ఛగా జరుపుకొనుటకు వీలుగా కుండేది. ఆసమయాననే కబీరు, తుకారాం, రామదాసు (సమర్థరామదాసు), మీరాబాయి, బ్రహ్మంగారు మొదలైన మహాభాగవతులు, తత్త్వవేత్తలు ఆవిర్భవించిరి. భక్తిమార్గముల ప్రదీపింప జేసిరి. కాని వారి

యీ సందేశాలు దేశమున మూల మూలలకు గొనిపోయి వినిపించ సాహసు లెవరు? ఆపరిచారపు బాధ్యతను తల దాల్చినవారూ దానిని నిర్దుష్టంగా నిర్వహించిన వారూ ఉన్నారు. దరిద్రనారాయణ సేవకు లీయాచకగణమే వారు. అది దైవసంఘటనే గావచ్చు. అప్పటి పరిస్థితులలో నీకార్యమునకు పూనుట సాహసమే! ఆ మహాభాగవతుల గీతముల నీయాచకు లింటింట మారు మ్రోగించిరి. విసుగు విరామము లేక అదేపని పరిచారము చేయుచుండేవారు. అది క్రమంగా వారికొక వృత్తియై పోయినది. ప్రజలలో నా డొక చైతన్యం, నవశక్తుల బ్రతిష్ఠించిన గౌరవమూ, పుణ్యమూ వీరిదే. అది చిరస్మరణీయం. ఇందుకు భారతజాతి వీరికి కృతజ్ఞతాబద్ధము గావలసినదే.

## ధర్మ మహామాత్ర పదవి

ధర్మము విషయమున లోకము నొకక్షణమైనా ఏమరనీయలేదు. సంతతము ఏదో తీరున ప్రచారము, పరిబోధము జేయుచునే యుండిరి. ఆప్రచార మనంతముఖములుగా సాగుచుండెడిది. పురాణశ్రవణం, నాటక ప్రదర్శనాలు మొదలైన వాటిని కొన్నిటిని జూపితిని. యాచకుల విషయ మప్పుడు విన్నారుగా. మ రిది చూడండి. అశోకుడు నిశ్చల ధర్మాభిమాని. ధర్మనిరతుడు. ఆయన మతమే ధర్మ మనవచ్చును. ధర్మప్రచారమున కాయన మిగుల పట్టుదల చూపెను. ధర్మప్రచారపాలనలకోసము ఆయన ప్రత్యేకంగా ఒక ప్రభుత్వ శాఖనే నెలకొల్పినాడు. 'ధర్మమహామాత్రు' లనెడి యున్నతాధికారులా శాఖను నిర్వహిస్తూండేవారు. వారి యాలన పాలనలలో ధర్మప్రచారం సాగుతుండేది. ధర్మస్థాపనం చేయుట, ధర్మము వృద్ధిపరచుట, ధర్మనిరతులకు సహాయము చేయుట వీరివిధులు. వాటి వివరములు అశోకునిధర్మశాసనములు తెలుపుచున్నవి. ఈ ధర్మములు, ప్రజకు సదా అగపడుతూ వారి స్మృతి పథములందు మెదలుచుండుటకే యాయన ఈ ధర్మశాసనములు దేశము నాలుగు చెరగుల నాటించి మహాప్రచార ప్రబోధము లొనర్చెను.

ఆర్షకుటుంబము

# అపరిగ్రహ ధర్మము

త్యాగము నింతగా ప్రశంసించి యుద్బోధింప జేసిరి గదా. లేనిచో డబ్బు లభిస్తుంటే లోకంలో ఒళ్లువంచి పాటుపడేవా డెవ డుంటాడు? దేశ మంతా సోమరులతో నిండిపోదా అని యనుకోకండి. ఆ భయం లేదు. ఆ త్యాగధర్మముతో దాతలను త్యాగోజ్జ్వలులుగా జేస్తూనే దానికి పరికట్టుగా గ్రహ ప్రతిగృహీతలను అపరిగ్రహ ధర్మమున బిగించిరి. ఈ ధర్మముతో వారి నుద్బోధించి, ప్రోత్సహించిరి. ఈ యపరిగ్రహం ప్రతివ్యక్తి పాటింప వలసిన వ్రతం. ఒకరిని యాచిస్తూ జీవించటం లేకితన మన్నారు. ఆత్మ గౌరవం కాదన్నారు. తాను యాచింప కుండుటే గాదు. తా నడుగకున్నా యెవరైనా యేదైనా ఇస్తే దానిని దాకరాదట. తనకు తెలియకుండా తనయింట నెవరైనా యేదైనా ఉంచి పోయినా. దానిని తీసుకోరాదట. ఇట్టి యపరిగ్రహ వ్రతిని గూర్చి యొక కథ భారతమందున్నది. ఉంఛవ అనుబంధము చూడండి. ఈ ధర్మం జీర్ణించినందు వల్లనే నేడు ఆత్మాభిమానం గలవారు తామెంత కష్ట దశలోనున్నా నొకరిని చేయి చాచి "దేహి" యని యడుగరు. ఒక రేదైన ఉచితంగా ఈయబోయినా తీసికోరు. అది తమ నవమానించుటగానే భావి స్తారు. తమ పిల్లల కెవరైనా ఆటవస్తువునో మిఠాయినో యీయబోయినా వారొప్పుకోరు. అలా తీసుకోకూడదని తమ పిల్లలకు బోధిస్తారు. వారి కేదైన ఇవ్వబోతే తీసుకోక చీకాకుపడతారు. ఇది సంపన్నుల తీరు మాత్రమే కాదు. నిప్పచ్చరం చప్పరిస్తున్న వారూ ఈ తీరు వారున్నారు. "దేవుడు మాకు కాళ్లు చే-లిచ్చాడు. మా బ్రతుకు మేము బ్రతుకుతాము లెండి. నీరు పోసిన నారా యణ మూర్తే నారు పోస్తాడు. ఒకరి యుకాన పోము" అని ఆ నిరుపేదలు బదులు చెప్పుతారు.

# అపాత్రదాన నిరాసము

ఇదిట్లుండగా ఈ త్యాగధర్మమూ నిరవధికంగా లేదు. దానికి పరిమితు లున్నవి. హద్దులు, ఆకలూ ఉన్నవి. దీనిని గూర్చి భారత ప్రవచనము...

అక్కు[illegible]

ఇచ్చునది ధనము పాత్రున
కచ్చుగ నొరు వేడకుండు నది యభిముఖులై
వచ్చిన యాశార్థుల వృధ
పుచ్చక చేయునది సర్వభూత ప్రీతిన్. (ఆది-అ-3-వ 204)

అంటే పాత్రులైన యాచకులకే దానమీయ దగునని, విచక్షణలేని దాన ధర్మాలు వ్యసనాలే నని అన్నారు. ఉపద్రికరములూ అని అన్నారు. దాన మిచ్చుటలో దాత యాలోచించ వలసినవి చాలా ఉన్నవి. మునుముందుగా గ్రహీత యొక్క శీలము, చరిత్రి గమనించవలెను. ఆపైన నీదానము దేని కోస మడుగుతున్నాడు? ఆకోరిక స్వభావమేలాంటిది? ఈదానమును సరిగా ఆకోరిక కోసమే ఉపయోగిస్తాడా? మరేదైన అకృత్యమునకు ఈ పేరుతో తీసికుని యాదుష్కార్యమునకు వినియోగిస్తాడా? ఇంకేదైన వంచన యున్నదా? గ్రహీత స్వబుద్ధి పూర్వకంగానే దీనిని కోరుతున్నాడా?ఇతరుల ప్రేరణ మేదైన ఉన్నదా? ప్రలోభములకో ప్రతిరోధములకో పాల్పడక యున్న ప్రత్యయనేయ బుద్ధి యగునా? ఈదాన మిస్తే దాని పరిణామ మేలాగుంటుంది? తనకుగాని, యితరులకుగాని, లోకంకుగాని యేదైనా యుపద్రవము తెచ్చిపెట్టుందా? ఇటు వంటి వెన్నెన్నో యాలోచించి నిశ్చయబుద్ధితో ధర్మబుద్ధితో నిర్ణయించి మరీ దానం చేయవలెనట. అదీ యార్షమర్యాద. అలాకాక అయోగ్యులకుగానీ యత్యా చారపు సంఘాలు, సంస్థలకు గానీ యిచ్చే దానాలను అపాత్రి దానాలన్నారు. ఈలాగే దాత సాత్త్విక భావంతో దానము చేయవలె అలాకాక-రాజస-తామస భావాలతో దానం చేస్తే అది అపాత్రిదానమే అన్నారు. రాజకీయ పక్షాల కీనాడు కంపెనీలు, ధనికులూ ఇస్తున్న విరాళాలూ అపాత్రిదానాలే అవుతాయేమో! అలా విరాళాలిచ్చిన వారితో, వాటిని పుచ్చుకున్నవారు నిర్దుష్టంగా మొగమాటం లేకుండా వ్యవహరించ లేరు. అందువల్ల వారి నిష్పాక్షికత భంగ పడుతుంది. ఆమొగమాటమేమీ లే దంటారా? అదొక తీరు ద్రోహ మౌతుందేమో! అది అలా ఉండనీయండి. ఈ విరాళాలు దుబారాగా వ్యయపడుతవి. వీటివల్ల ప్రజ కుపయోగించే దేదీ లేదు. ఏ సృజనాత్మకమైన కార్యము గాని ప్రజోపయుక్త కార్యముగాని సాధింపబడదు. అంతేగాదు, వివేచనలేని ఓటర్ల ఓట్లను కొనటం

నేడు బహిరంగ రహస్యము. ఈ విరాళాలు దురాచారమును ప్రోత్సహిస్తవి. అపాత్ర దానాలను మన పూర్వులు గర్హించిరి. ఈ అపాత్ర దానాలు దురుపయోగపడి దాతకో, పరులకో, లోకానకో ముప్పుదెచ్చినవి గావచ్చు.

వీనిని వివేచించి చూస్తే త్యాగపు తీరేలాంటిదిగా తోస్తుంది? త్యాగాలు, దానధర్మాలు వ్యక్తిక ప్రయోజనాల కుద్దేశింపబడలేదు. సామాజిక లాభముల కోసమేనని స్పష్టంగా తోస్తుంది.

## ప్రజాస్వామ్యము : వ్యక్తిస్వాతంత్ర్యము

మన వారి కిట్టి యుదాత్తమైన శిక్షణ నిచ్చినది మన కుటుంబ సంస్థయే. ఈ సందర్భమున మనము ముందుగా నొక విషయమును గమనింపదగును. అపుడు దాని విశిష్టత తెలియును. మన సమాజానికి కుటుంబము మూలము. పాశ్చాత్యుల సమాజానకో వ్యక్తి మూలము. వ్యక్తి స్వాతంత్ర్యము, అభిమతాలకు వారు ప్రాముఖ్యము ఇచ్చిరి. అయితే నిత్యవ్యవహారములో ప్రతివ్యక్తి తన ఇచ్చ వచ్చినట్లు వ్యవహరింప వీలగునా? అలా వ్యవహరిస్తే లోకం చీకాకై సమాజం వికలమై పోతుంది. కనుక వ్యక్తుల వ్యవహారం ఒక క్రమంలో నడిపేటందుకు ఒక సంస్థ అవసరము. అందుకు వారు వ్యక్తుల ప్రతినిధిగా స్టేట్‌ను (ప్రభుత్వమును) ఏర్పరుచుకొన్నారు. వ్యక్తుల పక్షమున వ్యవహరించే అధికారము ఆ స్టేట్ (ప్రభుత్వం)కు అప్పగించారు. వ్యక్తిని తృప్తిపరచుటకు వ్యక్తి హక్కులను ప్రతిపాదించి ప్రకటించిరి. కనుక సమాజపు అవసరాల నన్నిటినీ, యోగక్షేమాలనూ, శాంతిభద్రతలనూ ఆలించి, పాలించ వలసిన బాధ్యత స్టేట్ (ప్రభుత్వము)పై బడినది.

మరి ఇటీవల సమాజభోగ్య ( ommunist State) ప్రభుత్వాలు వెలసినవి. సంపదంతా సమాజముదేననే సూత్రంతో వ్యవహరిస్తవాదేశాలు. ఇట్లు వీరు వ్యక్తిగాక సమాజమునకే ప్రాముఖ్య మిచ్చిరి. కానీ, అక్కడా

అర్ధకుటుంబము

ప్రభుత్వానిదే ప్రాబల్యము. సమాజము సరాసరిగా వ్యవహరించదు. అంతే కాదు. ఈ ప్రభుత్వం నియంతృత్వం గలది. వ్యక్తి స్వాతంత్ర్యము మాటే లేదు. ప్రజాస్వామిక దేశాలలో వ్యక్తి స్వాతంత్ర్యము గౌరవింపబడినది.

అభేదా లెట్లున్నా, మొత్తాన నీ రెండు రకాల దేశాలు (స్టేట్) ప్రభుత్వ ప్రాబల్యం గలవే కాగా వారి వ్యాపకాలూ ఉద్యమాలూ శక్తులూ సమస్తమూ కేంద్రీకరింపబడినవి. అన్నీ ప్రభుత్వాధీనమై యుంటవి. ఈ కేంద్ర సంస్థ విసిరి వేసినట్లు దేశంలో దూరాన నెక్కడో యుంటుంది. ప్రజల కందు బాటుగా ఉండదు. దాని బాధ్యతలా అనంతం. బిచ్చగాండ్ర బిచ్చం మొద లుకొని ప్రజకు ధార్మిక నైతిక శిక్షణల గరపుదాక అన్నీ దానివేనాయె! అందు వల్లనే జీవితం సహజంగాను, సరళంగానూ సాగదు. అడుగడుగునా అదుపులూ ఆజ్ఞలతో కృతకంగా ఉంటుంది. కాగా వ్యక్తి స్వాతంత్ర్యము స్వేచ్ఛ గిడస బారిపోయిన వన వచ్చుగా! అందుకే ప్రజలలో అసంతృప్తి. ఏ వర్గాని కావర్గం తమతమ హక్కుల కోసం మారటం, ఆందోళన జేయటం. సమాజ భోగ్యదేశాలలో ఈ యసంతృప్తి ఉన్నా లోలోపల గుణస్తూ క్రుళ్లవలసిందేగాని హక్కుల నాశించట మనేదిగాని, ఆందోళన జరువుటగాని యసంభవము. అవి నియంతృత్వపు ప్రభుత్వాలాయె! ఇందువల్లనే మనీషు లన్నారు, "ఏ ప్రభుత్వము, ఎంతెంత తక్కువ శాసనాలూ, నియమాలతో పాలిస్తుందో అదీ నాగరికత(సభ్య) ప్రభుత్వం" అని.

మరి మనకో యేప్రాంతాని కాప్రాంతం, ఏసీమ కాసీమ, ఏయూరి కాఊరు చివర కే కుటుంబాని కాకుటుంబం ఎక్కడికక్కడ స్వతంత్రంగా స్వేచ్ఛగా జీవిస్తూ ఉండేవి. వ్యక్తులను ధర్మపరాయణులుగా, విధి నిర్వాహ కులుగా, శిక్షణ గరపు చుండేవి. వ్యక్తుల ప్రవర్తన నెక్కడి కక్కడ నొకకంట గనిపెట్టి చూస్తూవుండేవి. అదుపుల యాడంబరా లుండేవి కావు. ధర్మబలమే సర్వమూ చక్కబరచేది. సంస్థలు ప్రజలకు చాలాసన్నిహితంగా నుండేవి. కనుక వ్యక్తులు తమతమ సుఖదుఃఖాలను వారితో తరచుగా చెప్పుకొనుటకూ సహాయము పొందుటకూ అందుబాటుగా నుండేవి. అందులోనూ కుటుంబ

సంస్థ రక్తసంబంధము గలదీ, మరింత సన్నిహితమున్నూ. సహజంగా అది దానిసభ్యులయందు ప్రేమ, సౌహార్ద్రము, సానుభూతి గలదిగా ఉంటుంది. ఆవ్యక్తులూ దానియం దాదరాభిమానములు, శ్రద్ధాసక్తులు గలిగియుంటారు, కనుక వారిజీవితాలు సహజసౌమనస్యముతో, సహన సహకారములతో సరళంగా, శాంతంగా సాగుతూ ఉండేవి. మనసంస్థ లిట్లు వికేంద్రీకరింపబడియుండేవి. వేటి కవి స్వేచ్ఛాస్వాతంత్ర్యాల ననుభవిస్తూ పరస్పరం సహకరించుకుంటూ సమాజపు సముష్టిహితము, వ్యక్తిహితము సమన్వయించి ప్రవర్తిస్తూ ఉండేవి. కుటుంబం, సంఘం, గ్రామం, దేశాల శ్రేయస్సుకు భంగం గానంతవరకు. వ్యక్తికి స్వేచ్ఛా, స్వాతంత్ర్యా లున్నవి. వ్యక్తి వికాసము, శ్రేయస్సు ఆత్మోపలబ్ధులకు భంగం గానంతవరకు వ్యక్తిపైన కుటుంబము, సంఘము, గ్రామం, దేశాల కధికారమున్నది.

వారి స్టేట్ (ప్రభుత్వం)కు వల్లమాలినన్ని బాధ్యత లున్నవాయె! వారి పరిధి కూడా అతివిశాలమూ, అందుబాటుగానిదాయె: దానిని పురస్కరించుకొని మితిమీరిన యధికారాలను వారు ప్రయోగిస్తూండటం తటస్థిస్తుంది, అందువల్ల ప్రజలు ప్రభుత్వంకూడ తీరని సమస్యలతో సతమతమౌతుంటవి. మనకో ఆతీరు చాలా తక్కువ. కుటుంబంమొదలు గ్రామసీమలదాకగల సంస్థలే తమ తమ యక్కరలను తామే సమకూర్చుకొనేవి. తమతమ శాంతి భద్రతలనూ చాలావరకు తామే నెలకొల్పుకొనేవి. విశేషించి యీబాధ్యతలను చాలావరకు కుటుంబాలే నిర్వహించేవి. గురుకులాలు, విద్యావిధానములతీరు చూపనే చూపితిని. ప్రభుత్వపు పెత్తనం, జోక్యం లేకుండా అవి వ్యవహరించటం గమనించితిరిగా ! గ్రామాలలో నేదో యొక పరిశ్రమను, లేదా కళను, విద్యను ప్రభుత్వపుజోక్యం లేకుండానే స్వతంత్రంగా నిర్వహింపబడుతుండేవి. చివరకు న్యాయదానం కూడ కుటుంబసంస్థ గ్రామసంస్థలే నిర్వహించేవి. మనకూ ప్రభుత్వాలున్నవి, కాని ప్రజలనిత్యజీవితవ్యవహారాలలో ప్రభుత్వపు జోక్యం లేదు. ప్రభుత్వాధికారాలు చాలా పరిమితం. న్యాయదానం విషయంలో రాజుకు విన్నవించు కోవటం చాలా అరుదు. ఏవైనా ప్రజోపయోగ కార్యాలకు రాజులు దానాలు చేసినారంటే అదిప్రభుత్వ పక్షాన కాదు ; గృహస్థు గానే. "నావిష్ణు

పృధ్వీపతిః" అన్న ప్రవాదమున్న మాట నిజమే. దానిని పురస్కరించుకొని చరిత్ర రచయితలు కొందరు మనరాజులు నిరంకుశాధికారు లంటున్నారు. రాజుల మెప్పుకోసం ఎవరో పండితు లట్టి అన్వయం దాని కతికించి వుంటారు. ఇంకా "విష్ణు"వను మాటకు నిజమైన అన్వయం వారు విస్మరించి కాల క్రమాన దానికి రూఢమైన అన్వయమును బట్టి వారు ప్రాకులాడిరి. విష్ణు వంటే శంఖ, చక్ర, గదా చక్రధారి, చతుర్భుజుడు, పీతాంబరధారిగా పురాణాలలో వర్ణింపబడిన దేవుడని వీరిభావం. దానిబట్టి "విష్ణువే రాజు" అంటే యీలోకంలో రాజుకంటే దేవుడు వేరేలేడు అన్న యన్వయం కుదురు కొల్పిరి. ఆ యన్వయమే చరిత్రకారుల కట్టియపోహ కల్గించినది. అయితే దానియన్వయమేమిటి? 'విష్ణువు=రక్షకుడు' అని నిజమైన అన్వయము· కాగా అవిష్ణు=రక్షకుడుకాని వాడు, దేశమును, ప్రజను, రక్షింపజాలని (శక్తిలేనివాడు) "పృధివీపతి=భూపతి (రాజు) 'న' = కాదు. అంటే 'రక్షించేశక్తిలేనివాడు రాజుగా నుండ నర్హుడు కాడు' అనే యన్వయము నాకుతోస్తుంది. దీనిలో రాజు నిరంకుశు డనే దెక్కడుంది? ఇంకా రాజుస్థితిని దెలుపున దిది. "తనమేలు చూచుకోవటం కాదు. రాచరికం ప్రజలకు మేలు సమకూర్చుటకే" "నాత్మప్రియంప్రియం రాజ్ఞః ప్రజానాంచ హితం హితం" అన్నాడు విష్ణుసప్తుడు. రాజుకు ధర్మమును సృజించే శాసనాలను, చట్టాలను చేసే అధికారంలేదు. ధర్మము ననుసరించి పాలించవలసిన వాడే ధర్మాన్ని అతిక్రమిస్తే రాజును మన్నించరు ప్రజ. ఆయనసూ. ధర్మభ్రష్టునిగానే పరిగణిస్తారు, పదచ్యుతునీ చేస్తారు. అలా ధర్మ భ్రష్టులైన రాజులను పదచ్యుతుల జేయుటం మనయితిహాసములు పేర్కొన్నవి.

మరొకమాట:—అధికాధికంగా ఆశించటం, అధికాధికంగా ఆర్జించటం, అధికాధికంగా భోగాల ననుభవించటం వారిధ్యేయాలు. వీటికొకయంతున్నదా? అనుభవించిన కొద్దీ యింకా యింకా కావలననేగాని చాలుననే మాటే యుండదు. దీనికి కళ్ళేలు తగిలించి యదుపులో నాపక పోతే ననేకమైన అప చారాలూ, సమస్యలూ అశాంతి నొదవిస్తవి. సామ్రాజ్యాలూవలసరాజ్యాలస్థాప నకూ, పరజాతుల నదిమి వారిపై పెత్తనము నెరపబూనుటకూ అధికారముల యారాటమునకూ మూలము వీటిప్రభావమే· సామ్రాజ్యవాదాలవల్ల రాజ్య వాదా లను సమాజభోగ్యదేశాలు నిరసిస్తూ ప్రకటిస్తుండటం నిజమే! అయితే దానిలో

చిత్తశుద్ధి యేపాటి? ఆ రాజ్యాలకూ ఈ మనస్తత్త్వం వదలలేదనే తోస్తుంది. వారి ప్రకటనలు ప్రచారసాధనములే నన్పిస్తుంది. చిత్తశుద్ధికి ప్రమాణములు మాటలుగావు; చేతలు. వీరి రాజ్యాలలోనూ పరజాతులు దేశాంతర్భాగాలుగా నున్నవి. అది చాలనట్లు, పొరుగువారి నదిమిపెట్టమన్నారు. టిబెట్, జెకొస్లొవికియాలపైన వీరు జరిపిన యాక్రమణలూ, అత్యాచారముల నేమనవలె? సామ్రాజ్యతత్త్వపు రూపాంతరములు గావా?

మనవారో యీఅధికారాల అనర్థమును చక్కగా గుర్తించిరి. అత్యాశను "తృష్ణ" యన్నారు. ఈ లోకపు బెడదలన్నిటికీ తృష్ణేమూల మన్నారు. దానిని గర్హించిరి. యథాలాభసంతుష్టి (ప్రాప్తించినదానితో తృప్తి నొందుట) మనవారి స్వభావం. అభిలాషలూ, ఆర్జనా అధికారాలూ, భోగాలూ మొదలైన వాటన్నిటా మితముగా వ్యవహరించటం మనవారిధ్యేయం. అంటే మధ్యమార్గము. ఆహారం, విహారం, వ్యవహారం, నిద్ర, మెలకువలలో తగుమాత్రంగా మెలగు వారికి దుఃఖాలను బాపు యోగం లభిస్తుందని గీతాప్రవచనం[1]. "అల్ప సంపద అల్పవ్యయము గలిగి యుండుట మే"లని నిర్వచించినాడు ధర్మఅశోకుడు[2].

పాశ్చాత్యుల యీలక్ష్యాలవల్ల ఇంకా ప్రమాదాలున్నవి. ఈ విషయమున గురుదేవులు, రవీంద్రనాథకవిచంద్రునిమాట లివి. "వారు బాధ్యతల నిర్వహించుటలో ప్రాలు మాలినా, విప్లవాలలో ప్రభుత్వం భంగపడినా, ఆ విసురు సమాజానికంతా తగులుతుంది. సమాజ మంతా తికమకపడి, కుతకుతలాడుతుంది; దానిస్వయంనిర్ణయశక్తి దెబ్బతింటుంది. ఎక్కడో యేపట్టణంలోనో వున్న యొకానొక ప్రభుశక్తి కుతికిలపడితేనూ, క్రుళ్ళగిల్లితేనూ ఆదెబ్బ యీ మూలనుండి యామూలదాక పడుగుపేకల దేశమంతకూ తగులుతుంది."

---

1. యుక్తాహార విహారస్య యుక్తచేష్టస్య కర్మసు
   యుక్త స్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖః
   
   అ–6–శ్లో–17

2. "అపరియతా అపభాండతా సాధు"–కాల్సి-3వ శాసనం.

మన పూర్వుల కాతంటాలు తికమకలూ లేవు. మన వారి యభ్యుదయము ప్రభుత్వాలలో పాతుకొనిలేదు. జానపద సంస్థలపై నాధారపడినది. అవి వికేంద్రీ కృతములు; స్వతంత్రములు. అందువల్ల ప్రభుత్వ మలసత్వం చూపినా విప్లవాలలో చేతులు మారినా వాటి బాధ గ్రామసీమలకు తగిలేది కాదు. ప్రజలెందాక ధర్మం దప్పకుందురో యెందాక నీతికి నిలచి యుందురో అందాక మన సమాజమునకు ముప్పు లేకుండెను. ప్రజలలో పశుత్వము పాకినప్పుడే మన సమాజమునకు ముప్పుమూడేది. మన కుటుంబ సంస్థ తీరు తీయములు వివరించితిని, దోషుల పసిగట్టుటలోనూ, న్యాయదానములోనూ అవెంత నిర్దుష్టంగానూ, నిష్పాక్షికంగానూ వ్యవహరించేవో గమనించితిరి గదా!

శాంతి భద్రతలను నాడు మునిముందుగా కుటుంబ సంస్థలే నెల కొల్పేవి. ఈనాడు పోలీసులు, మేజిస్ట్రేట్లు నిర్వహిస్తున్న దానికంటే అది మేలుగా నుండేది. మెరుపు హొలుపుతో సుమాళంగా నుండేది.

# గ్రామ పునరుద్ధరణము

మన స్వతంత్ర భారత ప్రభుత్వ మవతరించిన పిదప, మరల గ్రామ సీమల యోగ క్షేమము లాలోచింపబడు తున్నవి. గ్రామ పంచాయతుల పునరుద్ధరిస్తున్నారు. కాని యవి యుండవలసినంత యుత్సాహోత్తేజములతో లేవు. ఒకతీరు ద్వంద్వ పాలనతో నున్నది. వ్యవహారమంతా ఉద్యోగ బృందమే నడుపుతూ ఉన్నది.ఉద్యోగుల సంఖ్య మితిమీరి యున్నది. ఇది ఆదాయమునకు మించిన వ్యయమనక తప్పదు. ఈ ఉద్యోగుల జీతబత్తెములకే చాల ధనం వ్యయ మౌతున్నది. జరుగుతున్న పనికంటే వీరివేతనాలకే వ్యయమైపోతున్నది. వీరివేతనాల కిస్తున్న ధనమును గ్రామాల యవసరాలకు వినియోగిస్తే యెంతో పని జరిగేది. అంతేకాదు; ఇంతింత పెద్దవేతానాల యుద్యోగులు పంచాయతుల కవసరం కాదు. ఈ పరిస్థితులు మారవలెను.

అట్లవిమారి పంచాయతుల పూర్వ వికాసంతో మరల పూర్వపు దశ నందవలె నంటే యెంతో సంస్కరింపబడవలెను. నైతిక బలమైనా లేని సమాజము

నిలుప దొరక్కోలేదు. నైతిక బలానకు మానవత్వం ప్రాతిపదిక. సమాజమున సుఖశాంతులు, సభ్యతా సుష్ఠుగా కుదురు కొనుటకు, కేవలం నైతిక ప్రమాణాలు. మానవత్వమే చాలవు. ఇంకా ముందుకు పోవలె. దానికి ధర్మబలం మూపకం. ఆత్మపూతమైన బుద్ధి ఉండినగాని యది ప్రసరించదు.

ఇక బాహ్యసంస్కరణ లేమి టంటారా? పూర్వం పంచాయతుల కనుబంధాలుగా నున్న శ్రేణులు (వృత్తుల సంఘాలు) వివిధ శ్రేణుల మిశ్రిమ సంఘాలు కూడ పునరుద్ధరింప బడవలెను. ఆయా వృత్తుల వారి యోగ క్షేమాలకూ వివిధ వృత్తులవారి మధ్య సహకారము. సయోధ్యత సమకూర్చుటకు ఉపకరిస్తవి. గ్రామాలలో వివిధ వృత్తులవారి మధ్య కలిగే వివాదాలను, యితర ప్రాంతాలవారి జోక్యం లేకుండా నే ఊరివా రాయూరి శ్రేణులు—పూగాలే అవసరమయితే ఆయూరి పంచాయతీ సంప్రతింపులతో పరిష్కరించుట మేలు. గ్రామశాంతి కది యవసరము.

గ్రామజీవితం శాంతంగా, నిర్మాణోన్ముఖంగా సాగవలెనంటే రాజకీయ వివాదాలతో గ్రామవాతావరణం కలుషితం కాగూడదు. రాజకీయ సిద్ధాంతాలకూ గ్రామ జీవితానికీ ముడిపెట్టరాదు. పౌరులు, ధర్మవిముఖులగునట్లు కనీసం శాసనాలు, రాజ్యాంగం పట్లనైనా విముఖులగునట్లు బోధించరాదు. రాజకీయాల పేరుతో గ్రామస్థులలో నెవరికి పరస్పర వైమనస్యాలను కల్పించరాదు. రాజకీయాల పేరుతో, రెచ్చగొట్టరాదు. ఎన్నికలలో ఓటర్ల నవినీతికి పాల్పరచరాదు ఓటర్లకు ప్రలోభాలు కల్పించరాదు. వారి ఓటు హక్కును వారు నిరభ్యంతరంగా స్వేచ్ఛగా ఉపయోగించు నట్లుండవలెను. అంతేకాదు. ఈనాడు సంఘము నావరించి యున్న అధికార వ్యామోహము, అత్యాచారాలు, ఆడంబర జీవితము, అతివ్యయం, భోగాల పిపాస పూర్తిగా మారవలెను. నైతిక శక్తి లేనిదే యివి సిద్ధించవు. నీతి, నిజాయితీ లేనివారిని ప్రజలు విశ్వసించరు. ఎందుకు విశ్వసించవలె? పంచాయతీలు పూర్ణ స్వపరిపాలన ననుభవించుటకు నేడు పెద్ద యవరోధముగా నున్నదిదే. ఇట్టినీతి నిర్దుష్టంగా నెలకొనవలెనన్న మన పురాతన ధర్మం పునరుత్తేజితం కావలెను.

# కుటుంబ ధర్మరాజ్యము

మన పూర్వుల సర్వస్వమునకూ ధర్మమే మూలం. ఈ ధర్మ శిక్షణ మెంత లోతుగా మన సమాజమున నాటుకొన్నదో యనేక సందర్భములలో చూపితిని. ఈ ధర్మమే యనేక ఆపదలనుండి మన సమాజము నుద్ధరించినది, దేశమెన్నెన్నో యొడిదుడుకులు పడ్డా, విధర్ముల తాకిడు లెన్నెన్ని తిన్నా, ఉప ద్రవాలూ, ఉత్పాతాలూ ఎన్ని దాపురించినా యాతళ్ల కన్నిటికీ తట్టుకొని నిలిచి నది. సమాజములో నేటికీ కొన యూపిరితోనైనా మినుకు మినుకు లాడు తూనే యున్నది. అట్టి యీ ధర్మమునకు మరల ప్రాణప్రతిష్ఠ గావింపవలెను. భారతీయుడన్న ప్రతివాడూ ధర్మదీక్ష స్వీకరింపవలెను. దీనిని సుస్థిరముగా స్థాపించుట కశోకునివలె దృఢ సంకల్పముతో ప్రచారము గావింపవలెను. ఈ ధర్మ సందేశమును దేశపు నాలుగు మూలలా వ్యాపింప జేయుటకు సాధన సంపద సమకూర్చవలెను. గ్రామాలలో నిత్యము ధర్మపు ప్రాశస్త్యమును దెలుపు కథలు చెప్పుట, పురాణములు చెప్పుట, గోష్ఠులు సాగించుట మొదలగు నవి చేయవలెను. దేవాలయములో నిత్యమూ ధర్మ ప్రబోధములు చేయించ వలెను. ధర్మము నుద్బోధించెడి మహాసూక్తులను దేవాలయాలు సత్రాలు న్యాయ స్థానాలు పాఠశాలలు మొదలైన వాటి గోడల మీద చిత్రించవగును. అట్టి సూక్తులను శిలాఫలక ములపై వ్రాయించి బాటల కూడలిలో నాటించదగును. పాఠశాలలలో నిత్యమూ విద్యార్థుల కీవిషయమును బోధింపదగును. ఈధర్మ వ్యాప్తి ప్రచారము లేయొక్క మతమునకు చెందినవి కావు. ధర్మప్రవర్తన మన్నిమతముల వారికీ ఆమోదమే. మతాలవారి కితర విషయాలలో నెన్ని భావ భేదాలున్నా సత్యం, ధర్మం, జ్ఞానం, అక్కరలే దనువారుండరు. కనుక ధర్మమును మరల మహోన్నత పీఠమున ప్రతిష్ఠింపబూనవలెను. నేడిది మన ప్రధానమైన జాతీయ సమస్య.

కుటుంబపు స్వరూప స్వభావములను మీరు చక్కగా గమనించి యుం దురు. ఇక నాపని తీరినది. చివరిమాట యిది వినండి. కుటుంబ మొక చిన్న

ప్రజాస్వామిక రాజ్యమని చెప్పితిని. ఆతీరు కొంత వివరించితిని. ఇప్పుడో పదుగు పేకల ధర్మమల్లుకొని యున్న దీనిని కుటుంబ ధర్మ రాజ్య మంటాను. సెలవు.

"అభయం మిత్రాదభయ మమిత్రాత్।
అభయం జ్ఞాతా దభయం పురో యః
అభయం న క్త మభయం దివా వః
సర్వం ఆశామమ మిత్రం భవన్తు''

మాకు మిత్రుల వల్ల భయం లేకుండుగాక! శత్రువుల వల్ల భయం కలుగ కుండు గాక! తెలిసిన వారి వల్ల భయం లేకుండు గాక! ఎదుట నున్న వానివల్ల భయం లేకుండు గాక! పగలు భయం లేకుండు గాక! రాత్రి భయం లేకుండు గాక! అన్ని దిక్కులూ మాకు మిత్రులగు గాక !

సర్వే భవన్తు సుఖినః
సర్వేసన్తు నిరామయా
సర్వే భద్రాణి పశ్యన్తు
మా కశ్చి ద్దుఃఖభా గ్భవేత్॥

అందరూ సుఖింతురు గాక ! అందరును ఆరోగ్య మనుభవింతురు గాక! అంద రకూ శుభ మగు గాక ! ఎవరికి దుఃఖము లేకుండు గాక !

ఓం శాంతిః శాంతిః శాంతిః

ఆర్షకుటుంబము

# ఉపయుక్త రచనలు

I

1. అథర్వవేదము
2. ఈశావాస్యోపనిషత్తు
3. ఋగ్వేదము
4. కఠోపనిషత్తు
5. కామందకము
6. కౌటిల్యార్థశాస్త్రము
7. గౌతమ గృహ్య సూత్రాలు
8. గౌతమ ధర్మ సూత్రాలు
9. ఛాందోగ్యోపనిషత్తు
10. తైత్తిరీయోపనిషత్తు
11. ధమ్మపదము
12. నారద భక్తి సూత్రాలు
13. నారదస్మృతి
14. పతంజలి యోగ సూత్రాలు
15. బృహదారణ్యకము
16. భగవద్గీత
17. మత్స్య పురాణము
18. మనుస్మృతి
19. మహావగ్గ
20. ముండకోపనిషత్తు
21. మేఘ సందేశము
22. లలిత విస్తరము
23. వాత్స్యాయన కామసూత్రాలు
24. వాయు పురాణము
25. వృద్ధమనువు

26. వ్యాస భారతము

27. శ్వేతాశ్వతరోపనిషత్తు

28. సంధ్యావందనము

29. హారితసంహిత

II

1. అరవిందుల కర్మయోగ దర్శనము

2. అశోకవర్ధనుని శిలాశాసనాలు

3. కన్‌కట్టి రికార్డులు (1910, 1912)

4. కాశీఖండము

5. గుంటూరు జిల్లా, గుంటూరు తాలూకా—
మత్యాపురంలో దొరికిన శాసనం

6. అప్పనమంత్రి- 'చారుచర్య'

7. జాతక కథలు

8. డాక్టర్ ఫ్రెడరిక్ రోజ్ సమర్పించిన విదేశాంగ
కార్యాలయపు నివేదిక

9. మహమ్మదీయ మహాయుగము

10. మెగస్తనీసు వర్ణనలు

11. శ్రీమదాంధ్ర మహాభారతము

III

1. త్యాగభూమి—హిందీ సంచిక 1928—శ్రీదయానంద
శ్రీకృష్ణ ఓ. ఝూగార్ల 'వేద మే శిల్ప విజ్ఞాన్'
అను వ్యాసము.

IV

1. A New Race Theory-'Modern Review.'
2. Darwin's Theory of Evolution
3. Epigraphy Report 1917, Madras
4. H.M. Elliot's - 'Histroy of India'
5. Local Government in Ancient India
6. 'Yantras or Mechanical Contrivances in Ancient India' By V. Raghavan, M.A., Ph.D
7. Works of Zenaide A. Ragozine
8. Works of Zimmer, the Indologist

# ఆర్ష కుటుంబము

## సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 |
| V | 9 | Grammer | Grammar |
| 7 | 8 | వెలిసినది | వెలసినది |
| 10 | 5 | అను | ఆను |
| 11 | 13 | శ్రిమవిభజన | శ్రమవిభజన |
| 12 | 13 | గృసాస్థాశ్రమము | గృహస్థాశ్రమము |
| 13 | 8,9 | వ్యవహాస్తుంటాడు | వ్యవహరిస్తుంటాడు |
| 13 | 26 | అధ్యగ్యధ్యాహాహానికం | అధ్యగ్న్యధ్యా వాహానికం |
| 14 | 10 | జీవికనుపైన | జీవిక కనుపైన |
| 17 | 25 | కుటుంబాలు విభక్తంగా | కుటుంబా లవిభక్తంగా |
| 19 | 8 | అర్ధాంగి అన | అర్ధాంగి అని |
| 21 | 7 | నెపరుకొనుచూ | నెదురుకొనుచు |
| 25 | 17 | తిరుగుడుగా | విరుగుడుగా |
| 27 | 19 | ద్ధులను | వృద్ధులను |
| 29 | 11 | సచ్చేడి | వచ్చేడి |
| 29 | 25 | పుత్రపౌత్రి పౌత్రయోః | పుత్రి పౌత్రియోః |
| 29 | 26 | తాదద్ధనం | తావద్ధనం |
| 31 | 13 | నలవరుచికొని | నలవరిచికొని |
| 32 | 11 | సహస్రాబ్దుల | సహస్రాబ్దుల |
| 32 | 18 | ప్రజాతిశ్చ | ప్రజాపతిశ్చ |

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| 40 | 19 | వాసోయత్వత్నైభి రుతతన్నయోన ముపస్పృశాత్ | వాసోయత్పత్నైభి రుతం తన్నసోస్యేన ముపస్పృశాత్ (దయానంద భవన్ ప్రచురణ) |
| 40 | 22 | వితన్వతి ధియో | వితన్వతే ధియో |
| 41 | 21 | ముదాచారములు | సముదాచారములు |
| 42 | 22 | కించిత్కలుషిత | కించిత్కలుషితా |
| 42 | 24 | మిత్రిజన మధ్యస్థ ఏకాకినం | మిత్రజన మధ్యస్థ మేకాకినం |
| 45 | 4 | కుటిదృష్టి | కుటిలదృష్టి |
| 51 | 12 | వినయ | వినయి |
| 60 | 24 | విన మునివర | విను మునివర |
| 62 | 24 | స్వాశ్యం | స్వాశ్వ్యం |
| 64 | 22 | క్షితిరాజసో | క్షితిరాజపో |
| 65 | 24 | బ్రిహ్మ | బ్రిహ్మే |
| 71 | 22 | ధీమహే | ధీమహి |
| 75 | 17 | కుమార్త | కౌమార్తె |
| 77 | 24 | వార్తారంభాశ్చ | వార్తారంభాంచ |
| 79 | 25 | కతశి ఎలోఽపి | కృతశిల్పోఽపి |
| 81 | 26 | తానిసేవితవ్యాని | తానిసేవితవ్యాని నోఇతరాణి |
| 82 | 20 | స్పమ్మర్మినః | స్వమ్మర్మినః |
| 84 | 13 | అవిరళంగా | అవి విరళంగా |
| 90 | 15 | పురషు | పురుషు |

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| 90 | 15 | దేవల | దేవుల |
| 102 | 17 | ఒదిలేవి | పొందేవి |
| 109 | 14 | గట్టులపై | గట్టుపయిం |
| 109 | 20, 21, 26 | మంజు | ముంజు |
| 110 | 1 | మంజుడు | ముంజుడు |
| 111 | 24 | ఆదివేదం | ఆరివేరం |
| 117 | 2 | సర్యసామాన్యముగా | సర్వసామాన్యముగా |
| 118 | 2 | కుదుదు కొంటుంది | కుదురు కొంటుంది |
| 125 | 4 | రిగి | ఎరిగి |
| 140 | 22 | దదర్మా | దదర్యా |
| 142 | 2 | కటాకు | తాటాకు |
| 142 | 3 | తాచివరకి | చివరకు |
| 146 | 4 | నడుపువారు వేరే | నడుపువారు వారే |
| 148 | 10 | పరుషార్థము | పురుషార్థము |
| 150 | 21 | ధృతిక్షమో ఒస్తేయం | ధృతిఃక్షమాదమో ఒస్తేయం |
| 150 | 22 | ధీవిద్యా | ధీర్విద్యా (మ.స్మృ6.92) |
| 151 | 18 | ఆ.వ.మం. 1 | ఆ.వ. 1 అను 1 మం |
| 152 | 23 | జడ | శుద్ధ |
| 153 | 23 | నతత్పరస్య సందధాత్ ప్రతికూలంయదాత్మనః ఏషం సంక్షేపతో ధర్మః నపేప్రిత్య సుఖమేధతే (భార.శాంతి-౧౧౩-౬) | నతత్పరస్య సందద్యా త్ప్రతికూలం యదాత్మనః ఏష సంక్షేపతో ధర్మః కామాదన్యః ప్రివర్తతే. భార-అను.ప.114అ.8శ్లో. (భండార్కర్ ప్రచురణ) |

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| 157 | 4 | చేయరాదట[3] | చేయించరాదట.[3] |
| 160 | 24 | వృక్షచ్ఛేత్తు | వృక్షచ్ఛేత్తా |
| 166 | 3 | పట్టణాలు | పట్టణాలకన్న |
| 166 | 4 | సంలు | సంఘాలు |
| 166 | 4 | సుంఘాదేవి | సుందేవి |
| 171 | 5 | వ్యక్తిక | వ్యక్తి |
| 172 | 13 | మారటం | మారాటం |
| 173 | 27 | నావిష్ణు | నా ఽవిష్ణుః |
| 174 | 1 | పృధ్వీపతిః | పృథ్వీపతిః |
| | ,, | పురుస్కరించు | పురస్కరించు |
| 174 | 22 | ధ్యేయాలు | ధ్యేయాలు గావు |
| 175 | 4 | పెట్టమన్నారు | పెట్టుతున్నారు |
| 179 | 13 | నిరామయా | నిరామయాః |

గమనిక :— 'ఆర్షకుటుంబము' లో రచయిత అనేక గ్రంథములనుండి అనేకములైన అంశములు ఉద్ధరించటం జరిగింది. ఉపయుక్త గ్రంథముల ప్రచురణ వివరములు ఇవ్వకపోవటంవల్ల సాధుపాఠ నిర్ణయానికి ఆకర గ్రంథములు సంప్రతించటం క్లిష్టమైంది. అందినంతవరకు ఆకర గ్రంథాలను సంప్రతించటం జరిగింది.

—పరిచయకర్త